అపరాధ పరిశోధన అనుబంధం—47

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## షాజహాన్ ప్రేమ కథ

17

రచన : వసుంధర

## అజ్ఞాత శత్రువు?

రచన : అజీజ్

## పెంపుడు కొడుకు

రచన : గీతారాణి

## మృత్యు బహుమతి

రచన : లలితకుమారి

'శాన్యోరా' సీరియల్-పన్నెండవభాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—47
నవంబర్, 1977
వెల : 3_00 రూపాయలు
ఏడాది చందా 39 రూపాయలు
జీవిత చందా 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :
శ్యామ దామోదర్ రెడ్డి
సంపాదక వర్గం :
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
కంచర్ల రమణ

కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు_29
ఫోన్_36959

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు_1.

# షాజహాన్ ప్రేమ కథ

వసుంధర

"ఐ లవ్ యూ రియల్లీ రవీ!" అంది నీరజ.

రవి ఆమెవంక గంభీరంగా చూసి "నేనూ అంతే_ అందుకే ఈరోజు నా గురించిన భయంకర నిజం నీకు చెప్పేయదల్చుకున్నాను. . ." అన్నాడు.

భయంకర నిజం అన్న మాటకు నీరజ తడబడింది. ఆమెకు నోట మాటరాలేదు. రవి మళ్ళీ ప్రారంభించాడు. "నాకు తెలియదు_ఇలాంటి రోజొకటి మన జీవితంలో రానున్నదని. తెలిస్తే నా బ్రతుకు దారి ఇంకోకలా ఉండేదేమో! నిన్ను చూసినపుడు నీ అందానికి చలించి పరిచయం చేసుకున్నాను. ఆ తర్వాత నీ ఆకర్షణకు లోనై నీ చుట్టూ తిరిగాను. కానీ అదంతా ప్రేమగా

మారిపోయి మనం పెళ్ళి చేసుకోవాలనుకుంటామని నే నప్పట్లో అనుకోలేదు.

కానీ నువ్వు లేనిదే నాకు ప్రపంచం లేదు. నేను పెళ్ళి చేసుకోవాలని నిర్ణయానికి వచ్చాను. నువ్వు అంగీకరించావు కాబట్టి - ఇంక నిన్ను నేను నా కాబోయే భార్యగా భావించవలసి ఉంటుంది. కాబోయే భార్య దగ్గర నన్ను గురించి ఏ రహస్యాలూ ఉండడం నా కిష్టం లేదు. ఎంత భయంకరమైనదైనప్పటికీ నన్ను గురించిన నిజం నీకు చెప్పక తప్పదు. అందువల్ల మన వివాహం ఆగిపోయినా సరే!"

"ఏమిటా నిజం రవీ___" అంది నీరజ. కాని వినడానికామెకు భయంగానే ఉంది.

రవి ఎలా చెప్పడమా అన్నట్లు ఒక్క క్షణం ఆగాడు. ఆ తర్వాత నెమ్మదిగా "షాజహాన్ పేరు విన్నావా ఎప్పుడైనా?" అన్నాడు.

"హిస్టరీలో వస్తుంది..."

"ఆ షాజహాన్ కాదు..."

"మరి?" అని ఆగిపోయింది నీరజ. హఠాత్తుగా షాజహాన్ గురించి ఆమెకు స్ఫురించింది.

షాజహాన్ ఆ నగరాన్ని గడగడలాడిస్తున్న వ్యక్తుల్లో ఒకడు. ఆరితేరిన స్మగ్లర్ గా పోలీసులతణ్ణి అభివర్ణిస్తుంటారు. ధనిక వర్గాల కతను సింహస్వప్నం. అతనికి పెద్ద ముఠా ఉన్నదనీ ఆ ముఠాలో ఉన్న క్రమశిక్షణ అపూర్వమనీ అందరూ చెప్పుకుంటూంటారు. తనను గురించిన భయంకర నిజమంటూ రవి షాజహాన్ ప్రసక్తి తీసుకు రావడం నీరజ నేనో అనుమానానికి గురిచేసింది.

"షాజహాన్ ఎవరో గుర్తొచ్చిందా?" అన్నాడు రవి.

"వచ్చింది. కానీ నీకూ షాజహాన్ కీ ఏమిటిసంబంధం?" భయపడుతూనే అడిగింది నీరజ.

"షాజహాన్ నా బాస్. అతని అనుచరులలో నేనే ప్రథముణ్ణి..." అన్నాడు రవి.

రావాలనుకుంటున్న భయం నీరజ కళ్ళలోకి వచ్చేసింది. చెప్పాలనుకున్న మాటలుమాత్రం నోటికి రాలేదు. అలా కళ్ళప్పగించి నోరు తెరిచి రవి వంకే చూస్తూండి పోయిందామె.

"అవును నీరజా! నా పదిహేనో ఏట చిల్లర దొంగతనాలు చేసి బ్రతుకుతూండే నేను షాజహానుకు దొరికాను. షాజహాన్ నా తెలివితేటలకూ, చాకచక్యానికీ, సమర్థతకూ ముచ్చటపడి నాకు తను స్వయంగా శిక్షణ ఇచ్చాడు. అయిదేళ్ళలో నేను అతని అనుచరులందరిలోకీ ప్రప్రథముడి నయ్యాను.

ఇప్పుడు నాకు పాతికేళ్ళు. ఆ రకం జీవితం మొహం మొత్తింది. బ్యాంకులో నా పేరున చాలా డబ్బుంది. ఏదైనా వ్యాపారం ప్రారంభించి సాఫీ జీవితం గడపాలని ఉంది. నాలో ఈ రకం ఆలోచనలు తలెత్తడానికి నీ పరిచయంకూడా కొంత వరకూ కారణం. నువ్వనుమతిస్తే నా పాత జీవితానికి స్వస్తిచెప్పి కొత్త జీవితం ప్రారంభించాలనుంది..."

నీరజ రవి కళ్ళలోకి చూసి "నువ్వు నిజమే చెబుతున్నావని నమ్ముతున్నాను. నిన్ను పెళ్ళి చేసుకోవడానికి నాకేమీ అభ్యంతరంలేదు. నేను లక్షాధికారి కూతుర్నే కావచ్చు. కానీ నా తండ్రి సంపాదన కూడా న్యాయా

రితం కాదు. బ్లాక్ మార్కెట్‌లో ఈయన పాత్రకూడా ఉంది.

ఆయన కుమార్తెగా, ఆయన డబ్బు ననుభవిస్తున్న వ్యక్తిగా ఆయనచేసే పాపాల్లో నాకూ భాగముంది. అందుకని నన్ను నేను స్వచ్ఛమైన మనిషిగా భావించడం లేదు. ఎటొచ్చీ మన వివాహం జరిగేక నువ్వు స్వచ్ఛమైన జీవితం నడపాలి. పాజహాన్ గురించి మరిచిపోవాలి. నేనూ మా నాన్న గురించి మరిచిపోతాను. నలుగురూ మెచ్చేవిధంగా న్యాయంగా బ్రతుకుదాం...'' అంది.

రవి కళ్ళలోకి వెలుగు వచ్చింది. ''పాజహాన్ నన్నాదు కున్న వ్యక్తి. నాలో వ్యక్తిత్వం నింపిన మనిషి. అతని పట్ల కృతజ్ఞత చూపడం నా బాధ్యత. అయినా ఇక మీదట వ్యక్తిగా అతన్ని గౌరవిస్తాను తప్పితే_అతని కార్యకలాపాల్లో పాల్గొనను. ఇది నా తుదినిర్ణయం. ఆ రకం జీవితంలో సుఖంలేదు, సంతృప్తిలేదు. నీ భావాలు తెలిసేక నీమీద ప్రేమ మరింత పెరిగింది. కానీ మీ నాన్న కూడా ఓ చిన్న పాజహానే అయినప్పటికీ__ఆయనకు సంఘంలో స్థానముంది. పాజహానికీ, అతని మనుషులకీ సమాజంలో స్థానంలేదు. అందువల్ల మన వివాహం కాస్త ఇబ్బంది కావచ్చు...'' అన్నాడతను.

''ఆ విషయంలో నువ్వు బెంగపెట్టుకోవద్దు. మా ఇంట్లో అందర్నీ పెళ్ళికి ఒప్పించగలను. అయినా పెళ్ళికి నీ గురించిన పూర్తి వివరాలు వాళ్ళందరికీ ఎందుకు చెప్పాలి? నువ్వు పాజహాన్ మనిషివని తెలియకపోతే సమాజంలో నీకేం తక్కువ?'' అంది నీరజ.

రవి, నీరజ చేతిని మృదువుగా తాకి ''నాకు నమ్మకం

వుంది నీరజా-నీ మూలంగా నా జీవనపథం మారుతుంది...'' అన్నాడు.

## 2

''ఏమైంది నీకు...'' అన్నాడు షాజహాన్.

రవి మాట్లాడలేదు. అతని ముఖంలో ఏవిధమైన భావాలూ లేవు.

''నేను నిన్ను నాకోసం తయారుచేసుకున్నాను. నువ్వు నన్ను వదిలి వెళ్ళిపోతే నా శ్రమంతా బూడిదలో పోసిన పన్నీరు అయిపోతుంది. అలా జరగడం నేను సహించను...''

''తప్పదు బాస్! మీరు నన్ను వదలిపెట్టేయాలి. అయితే నేను మీకో హామీ నిస్తున్నాను. మీరు నాకిచ్చిన శిక్షణ మరే ఇతర వ్యక్తి ప్రయోజనాలకూ ఉపయోగించబడదు. నేను గడపబోయేది చాలా సాదా జీవితం. ఏ పరిస్థితుల్లోనూ మీ జోలికి రాను. మీ వ్యవహారాల్లో జోక్యం కలిగించుకోను. నాకు మీరు భగవంతుడు. రోజుకొకసారైనా మిమ్మల్ని స్మరించుకుంటూంటాను...''

''నామస్మరణవల్ల నా కొరిగేదేముంది? పని కావాలి. నీమీద చాలా ఆశలు పెట్టుకున్నాను. నీవల్ల కావలసినవి కొన్ని పనులున్నాయి ప్రస్తుతానికి. కనీసం అవైనా పూర్తి చేసి వెళ్ళిపో...''

''లేదు బాస్. ఒక మంచి నిర్ణయాన్నమలు పరచడానికి వాయిదాలు వేయకూడదు. ఇంక నేను ఏ పనులూ చేయలేను'' దృఢంగా అన్నాడు రవి.

''అయితే ఇదే నీ తుది నిర్ణయమా?''

"అవును."

"ఈ నిర్ణయం మూలంగా నీ ప్రాణాలు నీవికాకుండా పోతే?"_ కర్కశంగా అన్నాడు షాజహాన్.

"నేను మిమ్మల్నెదిరించను. అన్నింటికీ సిద్ధపడే వచ్చాను. చంపదల్చుకుంటే ఇప్పుడే ఈ క్షణంలోనే చంపేయవచ్చు మీరు. నేను నిరాయుధుణ్ని. మీ పట్ల కృతజ్ఞతాభావంతో కట్టుబడ్డవాణ్ని" అన్నాడు రవి.

షాజహాన్ కేమీ తోచలేదు. అతనికి రవి మొండితనం గురించి బాగా తెలుసును. రవికి ప్రాణభయంలేదు. అనుకున్న పని ఎంత కష్టమైనా సాధించితీరుతాడు. ఇలాంటి మనిషి ఎక్కడో కానీ ఉండడు. అనుకోకుండా తనకు దొరికాడు. ఇతన్ని వదులుకోవడం అతని కేమాత్రమూ ఇష్టంలేదు. అయితే ఈ మొండి మనిషిని లొంగదీసోకా వాలి. అందుకు ఏంచేయాలి?

షాజహాన్ ఓక్షణం ఆలోచించి, "ఇంతకీ నన్ను వదిలి పెట్టి పోతానని నువ్వనడానికి కారణం ఒక అమ్మాయి. అంతేనా?" అన్నాడు.

"అవును."

"అయితే నేను చెప్పిన పనులు నువ్వు చేయనిపక్షంలో ఆ పిల్లమీద అత్యాచారం జరుగుతుంది" అన్నాడు షాజహాన్.

రవి చలించలేదు. "అత్యాచారమంటే?"

"నీ కళ్ళముందే ఆమె దారుణంగా హింసించబడుతుంది. అప్పటికీ నువ్వు లొంగి రాకపోతే ఆమెకు మానభంగం కూడా జరుగుతుంది..."

"నన్ను బెదిరించవద్దు బాస్. నా కళ్ళముందే మాన

భంగం జరిగినా నేనామెను పెళ్ళి చేసుకుంటాను. నేను ప్రేమిస్తున్నది ఆ మనిషిని. ఆ మనిషికున్న మనసును. ఆ రెండింటినీ సామాన్యులు మలినం చేయగలరని నేననుకోను. ఆ విధంగా అయితే నేనెప్పుడో మలినపడ్డాను." అన్నాడు రవి.

షాజహాన్ కు చిరాకు వేసింది. "ఆమె ముఖాన్ని వికృతంగా తయారుచేస్తాను..." అన్నాడు.

"అందం కారణంగానే ఆమె పట్ల నేనాకర్షించబడ్డాను. కానీ మా మధ్య ప్రేమ ఏర్పడ్డాక ఇంక అందంతో పనిలేదు" అన్నాడు.

"నీ కళ్ళముందే ఆమెను హింసించి చంపేస్తాను" అన్నాడు షాజహాన్ కసిగా.

"అందువల్ల మీరు సాధించేదేముంది బాస్! మీపనులు నేనెలాగూ చేయను. ఆమె చనిపోయేక నేనూ నా ప్రాణాలు తీసుకుంటాను. అందువల్ల మీకు మనశ్శాంతి ఉండదు. మీరే పని చేసినా ఒక ప్రయోజనముంటుంది. కేవలం పగతో ఘోరాలు చేయగలరని నేననుకోవడం లేదు. మమ్మల్ని దర్శి విడదీయడంద్వారా మమ్మల్ని బాధపెట్టగలరు కానీ మీ పని జరిపించుకోలేరు. అటువంటప్పుడు మమ్మల్ని వదిలి మా మానాన మమ్మల్ని బ్రతకనిస్తే, మీ మనిషికి మీ రన్యాయం చేయలేదన్న తృప్తి మీకుంటుంది!"

ఏం మాట్లాడాలో తోచలేదు షాజహాన్ కు. అతనంటే ఊళ్ళోనే కాదు, అతని అనుచరుల్లో కూడా చాలా మందికి భయం. కానీ రవికి భయంలేదు.

రవి మొండివాడు. విపరీతమైన పట్టుదల అతనికి. ఆ

లక్షణాలు షాజహాన్ కి బాగా ఉపయోగపడతాయి. అందుకే అతను రవిని ముఖ్యానుచరుడిగా చేసుకున్నాడు. కానీ రవిలో ఉన్న మొండితనం, పట్టుదల ఇప్పుడు షాజహాన్ కే ఎదురు తిరిగాయి. వాటినెలా లొంగదీయాలో షాజహాన్ కర్థంకావడంలేదు.

"సరే నువ్వు వెళ్ళు..." అన్నాడు షాజహాన్.

"వెడుతున్నాను బాస్. వెళ్ళే ముందు మీకు మరో సారి చెబుతున్నాను. మీ కై మీరు తలపడితే తప్ప నేను మీ జోలికి రాను. అప్పుడు కూడా తప్పనిసరి అయితే తప్ప మీమీద ఎదురుదెబ్బ తీయను" అని అక్కణ్ణించి వెళ్ళిపోయాడు రవి.

# 3

కరెంట్ పోయిన కారణంగా మ్యేట్నీ షో వదిలే సరికి ఇంకో అరగంట ఆలస్యమవుతుంది. ఫస్టు షోకి వచ్చిన వారందరి ముఖాల్లోనూ అసహనం కొట్టివచ్చినట్లు కనబడుతోంది. థియేటర్ వద్ద నీరజ కూడా అసహనంగా పచార్లు చేస్తోంది. ఆ సమయంలో ఎవరో ఆమెను పలకరించి_ "మిస్ నీరజ మీరే కదూ" అన్నారు.

తన్ను పలకరించిన వ్యక్తిని ఆశ్చర్యంగా చూసింది నీరజ. అతను తనకు పరిచయస్థుడు కాడు. చూడ్డానికి నడివయస్కుడిలాగున్నాడు. ముఖం రఫ్ గా వుంది కానీ పెద్దమనిషిలాగే కనిపిస్తున్నాడు.

"అవును_" అందామె.

"మీతో అయిదు నిముషాలు మాట్లాడాలి. అలా ఎదురుగా వున్న పార్కుకు వస్తారా?" అన్నాడతను.

"మీరెవరో నాకు తెలీదు" అంది నీరజ అనుమానంగా.

"నన్ను రవి పంపించాడు. చాలా అర్జంటు విషయం మీతో మాట్లాడాలి."

"మీ పేరు?"

"శంకరం" అన్నాడతను.

నీరజ "పదండి" అంది. ఇద్దరూ కలిసి ఎదురుగా వున్న పార్కులోకి వెళ్ళారు.

"చెప్పండి. రవి ఏమని చెప్పాడు?" అంది నీరజ ఆత్రుతగా.

"నన్ను రవి పంపలేదు" అన్నాడతను నవ్వి.

"మరి?"

"మీతో మాట్లాడడంకోసం చిన్న అబద్ధం చెప్పాను..."

నీరజ ముఖంలో కంగారు కనపడింది. "ఏమిటీ మీ ఉద్దేశ్యం?"

"ఏమీ లేదు. రవి విషయంలో చిన్న హెచ్చరిక చేసి పోదామని వచ్చాను."

నీరజ మాట్లాడలేదు. చెప్పమన్నట్లు చూసింది.

"మీరూ రవీ ప్రేమించుకున్నారు. అంతవరకూ నాకు తెలుసు. ఆ ప్రేమ ఇకమీదట కొనసాగడానికి వీల్లేదని చెప్పడానికి వచ్చాను."

"అంటే?"

"మీరు రవిని మరిచిపోండి."

"మరిచిపోకపోతే?"

"మీ తలిదండ్రులు, అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు-ఇంటిల్లపాదీ ఘోరంగా అవమానించబడి హత్యచేయబడతారు" చాలా తాపీగా అన్నాడతను.

నీరజ కళ్ళలో భయం కనపడింది. "ఎందుకు?"

"మీరు రవిని మరిచిపోనందుకు!"

"నేను రవిని మరిచిపోవడం వల్ల మీ కేమిటి ప్రయోజనం?"

"అది మీ కనవసరం."

"నా కనవసరమైనా మీ కవసరం కాబట్టి చెప్పాలి. రవినుంచి మీరేదో ప్రయోజనాన్నాశిస్తున్నారు. మా ప్రేమ కారణంగా ఆ ప్రయోజనం సిద్ధించదని భయపడుతున్నారు. అదేమిటో నాకు తెలిస్తే—నేను రవిని ప్రేమిస్తూనే మీ ప్రయోజనం సిద్ధించేలా చేయగలను" అంది నీరజ.

ఈ పర్యాయం శంకరం ముఖంలో ఆశ్చర్యం కనబడింది. అతనీవిధమైన సమాధానానికి సిద్ధపడినట్లు లేదు. క్షణం మాత్రం ఆలోచించి "అదేం కుదరదు. రవిని మీరు మర్చిపోవలసిందే..." అన్నాడు.

"రవిని నేను మరిచిపోవడం అసాధ్యం..." అంది నీరజ.

"అయితే సర్వనాశనానికి సిద్ధపడ్డట్లేనా?"

నీరజ మాట్లాడలేదు.

"చూడండి. నా గురించి మీకు పూర్తిగా తెలిసినట్లు లేదు. నేను వేళాకోళానికి మీ కివన్నీ చెప్పడంలేదు. అన్నంత పనీ చేయగలను నేను" అన్నాడు శంకరం.

"ప్రమాదకరమైన వ్యక్తులతో వేళాకోళాలాడ్డం నాకూ ఇష్టముండదు, కానీ నేను రవిని ప్రేమించాను. అతను లేకపోతే నేను బ్రతకలేను. అతను లేకుండా జీవించడంకంటే సర్వనాశనమైపోయినా బాధ లేదనిపిస్తుంది నాకు."

"మీరు రవిని మాత్రమే ప్రేమించారా? మీవారెవ్వరినీ ప్రేమించడం లేదా? మీకు జీవితంమీద ఆశ లేకపోయినంత మాత్రాన వారందరికీ ఉండకూడదని లేదు కదా_మీకోసం వారందర్నీ బలిచేయడం బాగుందా నీకు" అన్నాడు శంకరం.

"లేదు. కానీ ఇందులో నేను చేయగలిగినదేమీ లేదు. ఇతరులకోసం నేను రవిని వదులుకోలేను" అంది దృఢంగా నీరజ.

"అయితే సర్వనాశనం తప్పదు."

"మీరూ మరొక్కమారు ఆలోచించండి. రవినుంచి మీ రాశిస్తున్న ప్రయోజనమేమిటో చెప్పండి. అది తప్పక నెరవేరుస్తాను. ఆ విధంగా ఉభయులకూ జననష్టం లేకుండా పని జరుగుతుంది" అంది నీరజ.

ఈ పర్యాయం శంకరం కాస్త ఆలోచనలో పడ్డట్లు కనపడ్డాడు.

అయిదు నిముషాలసేపు వారిద్దరిమధ్య మౌనం రాజ్యమేలింది.

"షాజహాన్ పేరు విన్నారా మీరు?" అన్నాడు శంకరం.

"విన్నాను. ఆ పేరు వింటేనే నా ఒళ్లు జలదరిస్తుంది భయంతో" అంది నీరజ.

"నా పనులు కావాలంటే అతనితో భేటీకి సిద్ధపడాలి" అన్నాడు శంకరం.

"ఎందుకని?"

"అతనూ నేను గూడా నాలుగు ప్రయోజనాలు సాధించాలని ప్రయత్నిస్తున్నాం. అందుకు రవిలాంటి

సమర్థుడి అవసరమెంతైనా ఉంది. రవి నాకోసం అవి సంపాదించాలంటే అతను విధిగా షాజహాన్‌తో భేటీ పడాలి. సిద్ధమేనా?"

"సిద్ధమే?" అంది నీరజ.

"షాజహాన్ అంటే భయంలేదు..."

"రవిని దక్కించుకోడానికి దేవుడితో భేటీ వచ్చినా భయపడను."

శంకరం ముచ్చటగా ఆమెవంక చూసి "ప్రేమ కథల్లో తప్పు ఉండదనుకునేవాణ్ణి. ఆ మాట అబద్ధమని ఇప్పుడనిపిస్తోంది. అయితే రవినుంచి నేనాశించే మొదటి ప్రయోజనమేమిటో చెబుతాను విను" అన్నాడు. "ఇన్‌స్పెక్టర్ రఘురాంవద్ద నా వేలిముద్ర ఫొటోలున్నాయి. అవి నావి అని వారికి తెలియదు. నేరం జరిగిన ప్రాంతంలో నెలరోజుల క్రితం పోలీసులు వాటిని కనుగొన్నారు. అవి పోలీసు రికార్డులో ఉండడం నా కిష్టంలేదు. వాటిని నాకు సంపాదించి పెట్టాలి."

"సరే_ వీటివల్ల షాజహాన్‌కేం ప్రయోజనం?" అంది నీరజ.

"మేమిద్దరం ప్రత్యర్థులం. ఆ బేరంజరిగిన ప్రాంతంలో మా ఇద్దరివీ కూడా వేలిముద్రలున్నాయి. ఒకరి తర్వాత ఒకరు అక్కడికి వెళ్ళడంవల్ల జరిగిందది. ఎవరి వేలిముద్రలు సంపాదించడానికి వాళ్ళం ప్రయత్నాలు చేస్తున్నాం. ఇందులో విజయం ఒకరిని మాత్రమే వరించడం తథ్యం. ఒకసారి మోసం జరిగితే రెండోసారి విషయంలో పోలీసులు జాగ్రత్తపడిపోతారు..." అన్నాడు శంకరం.

"మరి మీ వేలిముద్రలను గుర్తుపట్టడమెలా?"

శంకరం తన చొక్కా జేబులోంచి ఒక చిన్న కవరు అందించాడు నీరజకు. "ఇందులో నా వేలిముద్రల ఫోటో ఒకటుంది. అయిడెంటిఫికేషన్‌కు పనికివస్తుంది."

నీరజ అందుకుంది.

"చూడండి. మిమ్మల్ని అనుక్షణం నీడలా వెన్నాడుతూంటాను. మిమ్మల్ని నమ్మి నా పని అప్పగిస్తున్నాను. మోసం జరిగితేమాత్రం మీకు సర్వనాశనం తప్పదు. పోలీసులతో లాలూచీపడ్డా, ఈ ఫోటోను ప్రింట్సు తీయడానికి ప్రయత్నించినా నేను సహించను. నన్ను నేను రక్షించుకునేందుకు నా ఏర్పాట్లు నాకున్నాయి..." అన్నాడు శంకరం.

"మోసం ప్రసక్తి లేదు." అంది నీరజ.

"అయితే ఈ పని చేయడానికి సరిగ్గా రెండే రోజులు వ్యవధి ఇస్తున్నాను. ఎల్లుండి సాయంత్రం మిమ్మల్నిక్కడ ఇదే సమయంలో కలుసుకుంటాను. ఒంటరిగా ఒక్కరూ రావాలి మీరు. రవినికూడా తీసుకురావడంకానీ, మీకు రక్షణగా నిఘా ఏర్పాటు చేసుకోవడంకానీ జరగకూడదు..."

"అలాగే" అంది నీరజ. శంకరం గుడ్ బై చెప్పి వెళ్ళిపోయాడు.

నీరజ ఆలోచనలో పడింది. తన ప్రేమ ఫలిస్తుందా? అని అదేపనిగా ఆలోచిస్తోందామె. పరిస్థితులు తన ప్రేమ కనుకూలంగా వున్నట్లు లేవు.

రవితో మాట్లాడి ఇందుకు ఒప్పించినా పోలీసులవద్ద నుంచి వేలిముద్రలు సంపాదించడం అతి సామాన్యమైన

వ్యవహారం కాదు. ఒకవేళ సంపాదించినా అదింకా శంకరం కోరిన మొదటిపని మాత్రమే. అలాంటివి మరో మూడు చేయాలి.

నీరజకు సినిమా చూడాలని లేదు. అయినా తప్పదు. ఏడున్నరకు హాలుదగ్గర కలుసుకుంటానని చెప్పాడామెకు రవి.

# 4

నీరజకు సినిమా బుర్రలోకి ఎక్కడంలేదు. ఆమె వుండి వుండి టైము చూసుకుంటోంది. టైము ఏడున్నర కాగానే నిట్టూర్చి హాల్లోంచి బయటకు వచ్చిందామె. బయట ఆమెకోసం ఎదురుచూస్తున్న రవి వెంటనే కనిపించాడు.

"రవీ!" అందామె ఉత్సాహంగా. ఆమెనుచూస్తూనే రవి ముఖం వెలిగిపోయింది.

"ఎక్కడికి పోదామో చెప్పు" అన్నాడు రవి.

"చాలా సీరియస్ విషయం మాట్లాడాలి రవీ!" అంది నీరజ.

"నీతో సీరియస్ విషయాలు మాట్లాడడం నాకిష్టముండదు" అన్నాడు రవి.

"కానీ నేను కావాలనుకుంటే తప్పదు..." అంది నీరజ.

ఇద్దరూ హాలుకెదురుగా ఉన్న పార్కులోకి వెళ్లారు. ఓ మూల కూర్చున్నాక నీరజ రవికి తనదగ్గరున్న కవరు అందించింది.

"ఇదేమిటి?" అన్నాడు రవి.

"ఇన్‌స్పెక్టర్ రఘురాంవద్ద ఈ కవర్లో ఉన్నలాంటి

ఫోటో ఉంది. అది సంపాదించాలి నువ్వు...'' అంది నీరజ.

''ఎందుకు?''

''నన్ను వివరాలడగొద్దు. ఈ పని నీవల్ల అవుతుందో కాదో చెప్పు. దానిమీదే మన పెళ్ళి ఆధారపడి ఉంది...''

రవి ముఖంలో అనుమానం తొంగిచూసింది. ''నేను షాజహాన్‌ను వదిలిపెట్టింది నీ ప్రేమకోసం. కానీ నువ్వూ ఇంకో షాజహాన్‌లా ప్రవర్తిస్తున్నావు. నా ప్రేమను నీ స్వంతపనుల కుపయోగించుకోవాలనుకుంటున్నావు.''

నీరజ బాధగా రవివంక చూసి ''నువ్వు నన్ను నమ్మలేవా?'' అంది.

''కానీ నువ్వు చెప్పిన పని...''

''నిజంగా నా స్వంతపనికోసం కాదు. కేవలం మన ప్రేమ ఫలించడంకోసం. ఇప్పుడే ఇలా అనుమానిస్తే ఎలా? ఇంకా ఇలాంటివి మరికొన్ని చేయాల్సి ఉంటుంది. అప్పుడే మన పెళ్ళి జరుగుతుంది.''

''నేను చేయకపోతే...''

''నీ నీరజ కుటుంబసహితంగా దారుణహింసలకు గురవుతుంది. ఆ తర్వాత చచ్చిపోతుంది.''

నీరజ నెవరో బెదిరించారని రవికి అర్థమైంది. ఆ బెదిరించిన వ్యక్తి షాజహాన్ కావచ్చుననికూడా అతనికి తోచింది_అందుకే ''నేనీ పనులు చేసినంత మాత్రాన మన ప్రేమ ఫలించి మన వివాహం జరుగుతుందని నీకు నమ్మకంగా ఉందా?'' అన్నాడు.

''ఉంది. అవన్నీ నేను చూసుకోగలను.''

"అయితే సరే. రేపే ఈ ఫోటో పోలీస్ స్టేషన్నించి తస్కరిస్తాను" అన్నాడు రవి.

నీరజ, రవి వంక ఆశ్చర్యంగా చూసి, "ఇది చాల కష్టమైన పని. బహుశా ఈ ప్రయత్నంలో నువ్వు పోలీసులకు పట్టుబడిపోవచ్చు. అయినా ఆ భయం నీముఖంలో కనబడ్డంలేదు. బజారుకు వెళ్ళి కూరగాయలు తెస్తానన్నంత సులభంగా మాట్లాడేశావ్" అంది.

"రవి సంగతి నీకు తెలియదు నీరజా! నాకు కష్టసాధ్యమైనదంటూ లేదు."

"అయితే ఆ షాజహాన్ నీ అతని ముఠానీ ఎందుకు సర్వనాశనం చేయవు?"

"కృతజ్ఞత అంతే!" అన్నాడు రవి.

# 5

రవినిప్పుడు ఎరిగున్న వాళ్ళెవ్వరూ గుర్తుపట్టలేరు. అంతలా మారిపోయింది రూపం. అతను సుమారు పది గంటల సమయంలో పోలీస్ స్టేషన్లో అడుగుపెట్టాడు.

"ఎవరు మీరు?" అనడిగాడు ఇనస్పెక్టర్ రఘురాం.

"మీరేనా రఘురాంగారు?"

"అవును నేనే!"

"మీతో చిన్న రహశ్యం చెప్పాలి. అభ్యంతరం లేకపోతే పక్కనేదైనా చిన్న గది ఉందా?" అన్నాడు రవి.

రఘురాం క్షణం తటపటాయించి "సరే పదండి!" అన్నాడు. ఇద్దరూ అక్కడున్న చిన్న గదిలోనికి వెళ్ళారు.

"రెండ్రోజుల క్రితం జరిగిందిది..." అన్నాడు రవి.

"అర్ధరాత్రి ప్రాంతంలో ప్రవేశించాడతను మా ఇంట. వాడి తాకట్టు వ్యాపారం. ఇనప్పెట్టెనిండా నగలున్నాయి. అతను చాలా ఆరితేరిన వాడిలాగున్నాడు. ఎంతో కష్టసాధ్యమైన ఇనప్పెట్టెను సులువుగా తెరిచేశాడు. ఆ సమయంలో నా భార్యకు మెలకువ వచ్చింది. అతన్ని చూసి దొంగ దొంగ అని అరిచింది. అప్పుడే నాకూ మెలకువ వచ్చింది. అతను చేతిలో కత్తితో మమ్మల్నిద్దర్నీ సమీపించాడు. కత్తి చూడగానే మా ఇద్దరి నోళ్ళూ మూతపడ్డాయి. అప్పుడే చిన్న తమాషా జరిగింది.

"నా భార్య చాలా అందంగా వుంటుంది. రాత్రి కావడం మూలానూ, భర్త పక్కనే పడుకున్న కారణంగానూ ఆమె ఒంటిమీద దుస్తులు సరిగ్గా లేవు. దొంగను చూసిన కంగారులో ఆమె దొంగ దొంగ అని అరిచింది కానీ ఆ తర్వాత నైట్ డ్రస్సునించి మామూలు డ్రస్సులోకి మారే అవకాశమేదీ? దొంగకు అత్యాచారం చేయాలనిపించిందనుకుంటాను. నా భార్యను చూసి 'బంగారం కంటె బాగున్నావ్ నువ్వు!' అంటూ ఆమెను సమీపించాడు. ఒక మూల కత్తిని నా వైపు ఝుళిపిస్తూనే వున్నాడు.

మాట్లాడకుండా లొంగిపోతే నీ మొగుణ్ణేమీ చేయను. లేకపోతే మాత్రం..." అని ఆగాడు.

"వాడి మాటలు నా ఆవేశాన్ని రెచ్చగొట్టాయి. ఆ సంఘటననూ, వాడి బలహీనతనూ ఆధారంగా తీసుకుని నేను వాడిమీద ఎదురుదెబ్బతీయగలిగాను. వాడు తప్పించుకుని పారిపోయాడు. నా భార్య మానం, నా

నగలూకూడా రక్షించబడ్డాయి. అందుకు నాకు చాలా సంతోషం కలిగింది. నన్ను నేనే అభినందించుకున్నాను. తర్వాత ఇనప్పెట్టెను పరిశీలించాను. డిటెక్షన్ నా హాబీ. ఇనప్పెట్టెమీద వేలిముద్రలున్నాయి. మీ పోలీసుల పద్ధతులే ఉపయోగించి వాటికి ఫొటోలు తీశాను. దాని నమూనా నా దగ్గరుంది. ఇదిచూసి మీరు మీ రికార్డ్సు వెరిఫైచేసి ఇదివరలో ఏ పాత నేరస్థుడివైనా అయితే వెంటనే దొంగను పట్టవచ్చునని నా ఆశ. ఆ మనిషి ముఖం నాకు బాగా గుర్తుంది. ఎప్పుడు కనబడ్డా గుర్తు పట్టగలను.''

రఘురాం బయటకు వచ్చి-వేలిముద్రల నిపుణుడు సుందరానికి ఫోన్ చేశాడు. ఆయన వచ్చి పోలీస్ రికార్డ్సు వెతికి-స్టేషన్లో ఉన్న తాత్కాలిక సదుపాయాలతో ఒక ఫోటోని వెదికితీసి "ఇదీ అదీ ఒకటేనని నా అనుమానం. ఎటొచ్చీ ఖచ్చితంగా చెప్పాలంటే రేపటివరకూ సాధ్యపడదు. ఈ ఫోటోని నాతో తీసుకు వెడతాను'' అన్నాడు.

"వెంటనే చెప్పడం సాధ్యపడదా...?'' అన్నాడు రవి.

"మీ రాయనతో వెళ్ళండి. ఓ గంటలో మీకు విషయం తెలుస్తుంది. అవి రెండూ ఒకటే అయిన పక్షంలో-మీకు మళ్ళీ నేరస్థుడు కళ్ళబడితే మాకు తెలియ జేయండి. రెండు నేరాల దొంగ బయటపడతాడు'' అన్నాడు రఘురాం.

"అది సరే__ఇత నెటువంటి నేరస్థుడు?'' అన్నాడు రవి.

"ఒక స్మగ్లింగ్ వ్యవహారంలో ఈ వేలిముద్రలు దొరికాయి" అన్నాడు రఘురాం.

రవి, సుందరం కలిసి వెళ్ళారు. సుందరం తన లాబొరేటరీలో రెండింటినీ జాగ్రత్తగా పరిశీలించి "నా అనుభవం నన్ను మోసం చేయదు. అసలు నేను ఫోటోలు చూసి అయిడెంటిఫై చేసేయగలను. ఈ రెండూ ఒకరివేనని పోలీస్ స్టేషన్లోనే కనిపెట్టేశాను. అయినా ఎందుకైనా మంచిదని..." ఇంకా ఏదో అంటూండగా రవి ఆయన భుజంమీద ఏదో పిన్‌తో గుచ్చాడు.

జరిగినదేమిటో ఆయన కర్థంకాలేదుకానీ మరో రెండు నిముషాల్లో ఆయనకు స్పృహతప్పింది. రవి రెండు ఫోటోలూ తీసుకుని అక్రమించి వెళ్ళిపోయాడు.

# 6

"నాకు తెలుసు రవి ఈ కార్యం సాధించుకురాగలడని..." అన్నాడు శంకరం ఆనందంగా ఫోటోల నందుకుని.

"మీ రెండో పని యేమిటో చెప్పండి..." అంది నీరజ.

"జగన్మోహన్ తెలుసా మీకు?"

"ఏ జగన్మోహన్?" అంది నీరజ ఆలోచిస్తూ.

"ఎర్ర కారు..." అని ఆగాడు శంకరం.

నీరజకు అర్థమైంది. ఆ ఊరికే పెద్ద ఆకర్షణ ఆ కారు. జగన్మోహన్‌కున్న మూడు కార్లలోనూ అది చాలా ముఖ్యమైనది. చాలామందా ఊళ్ళో ఆయన్ను ఎర్రకారు జగన్మోహన్ అని అంటూంటారు. జగన్మోహన్‌కు బట్టల షాపు ఉంది. కానీ ఒక బట్టలషాపు యజమానికంటే

బాగా ఎక్కువగా ఖర్చుపెడతాడాయన. ఆ ఊళ్ళో అగ్రశ్రేణి ధనికుల్లో ఆయనొకడు. కొంపదీసి ఆ కారు గానీ సంపాదించమనడు కదా అనుకుంది నీరజ.

"తెలుసు" అంది నీరజ.

"ఆయన అలా కనబడుతున్నాడుగానీ ఈ నగరానికే పెద్ద బ్లాక్ మెయిలర్. బ్లాక్ మెయిలింగ్‌లో ఆయన సంపాదించిందాంట్లో సగం ముందు బట్టలషాపుమీద ఆయనకొచ్చే ఆదాయం" అన్నాడు శంకరం.

ఆశ్చర్యంగా వింటోంది నీరజ ఆయన చెబుతున్న విషయాన్ని. జగన్మోహన్ బ్లాక్ మెయిలర్ అన్న విషయాన్ని ఆమె ఊహించలేదు సరిగదా ఇప్పుడు శంకరం చెప్పినా నమ్మలేకపోతోంది.

శంకరం కొనసాగించాడు. "జగన్మోహన్ నన్ను బ్లాక్ మెయిల్ చేస్తున్నాడు. ఏ నేరం జరిగినచోటున నా వేలిముద్రలున్నాయో—అక్కడే నన్ను ఫోటో తీశాడు. నన్ను రెడ్ హేండెడ్‌గా ఫోటోలు తీశాడాయన. ఇప్పుడా ఫోటోతో బెదిరిస్తున్నాడు."

"అంటే ఆ నెగిటివ్స్ సంపాదించాలంటారు" అంది నీరజ.

"అవును."

"అది పెద్ద కష్టంకాదు. పోలీసులదగ్గర్నుంచి వేలిముద్రలు సంపాదించిన మనిషి ఒక మామూలు మనిషి దగ్గర్నుంచి నెగిటివ్స్ సంపాదించడం కష్టం కాదనుకుంటాను" అంది నీరజ.

"జగన్మోహన్ మామూలు మనిషి కాడు. మొదటి పనికంటే కష్టమైనదిది...." అన్నాడు శంకరం ఆలోచిస్తూ.

"అయినా తప్పదు కదా. ఆ నెగెటివ్స్ నెలా గుర్తించాలో చెప్పండి" అంది నీరజ.

"నెగిటివ్స్ ట్వంటీటూ అంటే జగన్మోహన్‌కు అర్థమవుతుంది" అన్నాడు శంకరం.

నీరజ నవ్వి-"జగన్మోహన్‌ని అడిగి తెమ్మనా మీ ఉద్దేశ్యం?" అంది.

"ఇంచుమించు అలాగే చేయాలి. ఆ సామర్థ్యం రవికుంది. ఒకవేళ తప్పు నెగటివ్సు తెచ్చే మాటయితే అవి మళ్ళీ తిరిగిచ్చేసి సరైనవి తేవాల్సి ఉంటుంది. నేను మాత్రం మోసాన్ని సహించను. వేయి కళ్ళతో మీ ఇద్దర్నీ కనిపెడుతూనే ఉంటాను...." అన్నాడు శంకరం.

"బాగానే ఉంది. మిమ్మల్ని మళ్ళీ ఎప్పుడు కలుసుకోవాలి?"

"రోజు విడిచి రోజు సాయంత్రం ఆరుగంటల ప్రాంతంలో ఈ పార్కుకు వస్తుంటాను" అన్నాడు శంకరం

# 7

"నమస్కారమండీ - నా పేరు వీర్రాజు" అన్నాడు రవి.

జగన్మోహన్ అతనివంక చూసి "నువ్వెవరో నేనెరగను" అన్నాడు.

"నిన్నటివరకూ నేనూ మిమ్మల్నెరగను. కానీ ఒక ముఖ్యమైన పనిమీద మిమ్మల్ని కలుసుకోవాలని వచ్చాను."

"ఏమిటా పని?"

"నెగిటివ్సు ట్వెంటీటూ గురించి మాట్లాడాలని వచ్చాను."

జగన్మోహన్ ముఖంలో కలవరం కనబడింది. "ఏమిటి నువ్వనేది? నాకేమీ అర్థంకావటంలేదు" అన్నాడు.

"అంతా అర్థమైంది మీకు. ఊరికే నటిస్తున్నారంతే! నేనేమీ సిబిఐ మనిషిని కాను. మీకులాంటిదే నావృత్తి కూడా" అన్నాడు రవి.

"మిస్టర్ వీర్రాజూ! నువ్వేం మాట్లాడుతున్నావో నిజంగా నాకర్థంకావడంలేదు."

"అయితే వివరంగా చెబుతాను వినండి. ఒక మనిషిని నేరం జరిగిన స్థలంలో ఫోటో తీశారు మీరు. ఆ నెగ టివ్సుకు నెగిటివ్స్ ట్వెంటీటూ అని పేరు పెట్టారు. వాటితో ఆ మనిషిని బెదిరిస్తున్నారు. ఆ మనిషి నన్ను కలుసుకున్నాడు. మిమ్మల్నడిగి ఆ నెగిటివ్సు తెచ్చిపెట్ట మన్నాడు. సాధారణంగా ఎవరైనా నేనడిగిన వెంటనే ఏమడిగితే అది ఇచ్చేస్తారు. ఆ నమ్మకంతోనే ఇక్కడకు వచ్చాను."

జగన్మోహన్ నవ్వి "ఏమిటి నీ స్పెషాలిటీ?" అన్నాడు.

"నా స్పెషాలిటీ ఏమిటని అడక్కండి. నేనే ఒక స్పెషాలిటీ" అన్నాడు రవి.

"సరే–ఇప్పుడేం చేయదల్చుకున్నావ్?"

"మీరు నెగిటివ్సివ్వగానే తీసుకుని వెళ్ళి ఆ మనిషి కిచ్చేయదల్చుకున్నాను."

"అందుకు ప్రతిఫలం?"

"ప్రతిఫలం అవసరంలేదు నాకు. అందు మూలంగా

నా పెళ్ళి ఆగిపోయింది. అందుకని ఈ పనికి ఒప్పు కున్నాను'' అన్నాడు రవి.

''మిస్టర్ వీర్రాజూ—ఆ మనిషి యిప్పుడెక్కడున్నాడు?''

''ఊరి చివర ఒక బంగళాలో.''

''నేనూ వస్తాను నీతో. ఆ మనిషితో మాట్లాడుతాను. పద!''

''నెగటివ్స్ కూడా తీసుకురండి.''

''అవసరంలేదు. నేనా మనిషితో మాట్లాడి నిన్ను పంపించేస్తాను. వ్యవహారం మేమిద్దరం చూసుకుంటాం'' అన్నాడు జగన్మోహన్.

''నాతో వచ్చే ధైర్యముంటే రండి....'' అన్నాడు రవి.

జగన్మోహన్ తమాషాగా నవ్వి ''నన్నీమాట అనగలిగిన నీ ధైర్యానికి మెచ్చుకుంటున్నాను. నిన్ను చూస్తే నాకు ముచ్చటగాకూడా వుంది. నీలాంటివాడివల్ల నాకూ చాలా ఉపయోగాలుంటాయి'' అన్నాడు.

రవి ఏమీ మాట్లాడలేదు. ఇద్దరూ బయల్దేరి బయటకు వచ్చారు. ఇంటిముందున్న ఎర్ర కారును చూసి—''ఇలాంటి కారు నే నెక్కడా చూడలేదు!'' అన్నాడు రవి.

''ఎక్కడా చూడని వస్తువులూ ఎవ్వరూ అనుభవించని అనుభవాలూ సేకరించడం నా హాబీ'' అన్నాడు జగన్మోహన్.

ఇద్దరూ కార్లో కూర్చున్నారు. కారు తూనీగలా దూసుకుపోతోంది. ఊరి చివరకు వచ్చేక ఒక బంగళా ముందు కారాపమని చెప్పాడు రవి.

"ఈ దారీ, బంగళా కూడా కొత్తవి నాకు" అన్నాడు జగన్మోహన్.

"చాలా కొత్త కొత్త విశేషాలు చూస్తారు మీరు నా దగ్గర" అన్నాడు రవి.

జగన్మోహన్ నవ్వి- కారు దిగాడు. రవికూడా కారు దిగి ముందుకు దారి తీశాడు. జగన్మోహన్ అతన్ననుస రించాడు.

ఇద్దరూ బంగళాలో ప్రవేశించారు. లోపలకు వెళ్ళ గానే హాలొకటుంది. హాల్లో సోఫాలున్నాయి.

"కూర్చోండి. ఆ మనిషిని పిలుస్తాను" అన్నాడు రవి.

జగన్మోహన్ కూర్చున్నాడు. అతని పక్కనే రవి కూడా కూర్చున్నాడు.

"మరి- ఆ మనిషిని పిలుస్తానన్నావ్?" అన్నాడు జగన్మోహన్.

"సోఫాకున్న బటన్ నొక్కితే లోపల బెల్ మ్రోగు తుంది" అన్నాడు రవి. జగన్మోహన్ బటన్ చూడానికి వెనక్కు తిరిగాడు. అప్పుడే ఆయన భుజంమీద ఏదో గుచ్చుకుంది.

"ఏమయిందీ?" అన్నాడు జగన్మోహన్. రవి జవాబు చెప్పలేదు. సరిగా రెండు నిమిషాల్లో జగన్మోహన్‌కు పూర్తిగా స్పృహ తప్పింది.

రవి ఆక్కణ్ణించి బయటకువచ్చి ఎర్ర కార్లో కూర్చు న్నాడు. కారు కొత్తదారి పట్టింది.

# 8

"హలో సార్, గుర్తున్నానా?" అన్నాడు రవి.

జగన్మోహన్ కోపంగా రవి వంక చూసి-"నువ్వు

నన్ను మోసంచేశావ్'' అన్నాడు.

"ఇందులో మోసమేమీ లేదు. నెగెటివ్స్ ట్వంటీ టూ నాక్కావాలి. అవి ఇచ్చేస్తే నా దారిన నేను వెళ్ళిపోతాను.''

"ఇవ్వకపోతే?''

"మీ ఎర్రకారును మీరింక చూడలేరు.''

"ఆఁ'' జగన్మోహన్ నోరు తెరిచాడు. ఎర్ర కారు అతని ప్రాణాలకంటె విలువైనది. ఆ రోజు స్పృహ రాగానే తను మొట్టమొదట దానికోసమే చూశాడు. అది కనపడకపోగా చాలా కలవరపడ్డాడు. అయితే పోలీస్ రిపోర్టుమాత్రమివ్వలేదు. ఆ కారును పోలీసుల దృష్టిలోకి తీసుకువెళ్ళడం ఆయనకిష్టంలేదు. అది తనకు ప్రాణప్రదమైన కారు మాత్రమే కాక - ఆ కారులో తన ప్రాణాలూ ఉన్నాయి. "ఈ దేశం మొత్తంమీద అలాంటి కారొక్కటే ఉంది. ఎక్కడున్నా కనుక్కోగలను''అన్నాడు జగన్మోహన్ తేరుకున్నాక.

"కనుక్కోవడానికి కారుండాలి కదా'' ప్రస్తుతం ఎవ్వరూ కనుక్కోలేని చోట ఉంది. నా పని జరక్కపోతే ఆ కారు నాశనమైపోతోంది'' అన్నాడు రవి తాపీగా.

"నీ పని జరిగితే నా కారు తిరిగివస్తుందని నమ్మకమేమిటి?''

"నమ్మకం లేనిదే మన వృత్తిలో నెగ్గుకు రావడం కష్టం. ఉదాహరణకు మీ కారు సంగతి తీస్కోండి. దాని గురించి నాకన్నివివరాలూ తెలుసు. ఈ నెగెటివ్స్ కంటె ఆ కారు మీకు చాలా ముఖ్యమన్నది మీరు దాచినా దాగని నిజమని నాకు తెలుసు.

ఆ కారు విషయంలోనే కాదు, ఈ ఊళ్ళో చాలా మందికి సంబంధించిన చాలా విషయాలు తెలుసు నాకు. కానీ వాటివల్ల ఎవరికీ ఏ ప్రమాదమూ లేదు. అవసరం లేనిదే నేనెవరి జోలికీ వెళ్ళను. మీ కారుకు రంగు, కొద్దిగా మోడల్ మారిస్తే నాకు చాలా ఉపయోగం. అయినా నేనది తీసుకోను. నెగటివ్స్ కోసం మాత్రం దాన్ని తీసుకున్నాను. అవి చేతికి రాగానే మీ కారు మీకు అప్పగిస్తాను."

జగన్మోహన్ కాసేపు ఆలోచించి ఏమనుకున్నాడో లోపలికి వెళ్ళాడు. పదిహేను నిమిషాల అనంతరం ఓ చిన్న కవరుతో తిరిగివచ్చాడు. అది రవికి అందించాడు. రవి అందుకుని చూశాడు. దానిమీద N-22 అని వుంది.

"కారు ఎప్పుడిస్తావ్?" అన్నాడు జగన్మోహన్.

"ఈ నెగటివ్స్ సరైనవేనని తెలిసేక" అన్నాడు రవి.

"మిస్టర్ వీర్రాజూ- ఐ హోప్ యూ డోన్ట్ ప్లే విత్ మి-" అన్నాడు జగన్మోహన్.

"మీ దీ సేమ్ విత్ యూ..." అన్నాడు రవి.

# 9

"నాకేమీ ఆశ్చర్యంగా లేదు. రవి ఘటనాఘటన సమర్థుడు" అన్నాడు శంకరం ఆ నెగటివ్స్ అందుకుని పరీక్షించి చూసేక.

"అయితే ఈ పని అయినట్లేనా?" అంది నీరజ.

"అహా- అయినట్లే?" అంటూ ఆలోచనలో పడ్డాడు శంకరం.

"నాదో చిన్న అనుమానం. మీకు రవి గురించి బాగా

తెలిసినట్లుంది. మీరే స్వయంగా కలుసుకోవడంలేదేం?" అంది నీరజ.

"రవి ఇప్పుడు ఎవరిమాటా వినడు. అతను సంఘంలో సామాన్య జీవనం చేయాలని నిశ్చయించుకున్నాడు. మిమ్మల్ని పెళ్ళి చేసుకోవాలనుకున్నాడు. మీకోసం ఈ పనులన్నీ చేస్తున్నాడు తప్పితే ఇంకొకరి కతనిచేత ఈ పనులు చేయించడం సాధ్యపడే విషయం కాదు" అన్నాడు శంకరం.

నీరజ నిట్టూర్చింది. తన్ను పెళ్ళి చేసుకుని సామాన్య జీవనం చేయాలనుకుంటున్నాడు రవి. తనకోసం తన పాత జీవితాన్ని వదిలిపెట్టేయదల్చుకున్నాడు. అతన్ని తను పాత జీవితంలోకే నడిపిస్తోంది. ఇంతవరకూ రెండు ప్రమాదాలూ గడిచాయి. ఇకముందుకూడా ఇలా గడిచి పోయి తనయొక్క, అతనియొక్క ఆశయం సిద్ధిస్తుందా?

"మీ మూడో పని ఏమిటి?" అంది నీరజ భయపడు తూనే. తడవ తడవకూ ప్రమాదం పెరుగుతుందని ఆమెకు అనిపిస్తోంది.

"కైలాసరావు తెలుసా మీకు?" అన్నాడు శంకరం.

తెలియదని నీరజ ఎలా చెప్పగలదు? ఒక దారుణ హంతకుడిగా అతన్ని పేపర్లభివర్ణించాయి. రెండురోజుల క్రితమే అతను పోలీసులకు పట్టుబడ్డ వైనం కూడా పేపర్లో చదివింది. కైలాసరావుమీద ఎన్నో కేసు లున్నాయి. వాటిలో చాలావరకూ హత్యలు, మాన భంగానికి సంబంధించినవి. ఈమధ్యనే అతను ఒక హోటల్లో బసచేసిన ధనవంతుణ్ణి కిరాతకంగా హత్య చేశాడు. ఇప్పుడా కైలాసరావును పోలీసులదగ్గర్నుంచి విడిపించమనడుగదా ఈ శంకరం?

“తెలుసు. అతను ప్రస్తుతం పోలీసుల కస్టడీలో ఉన్నాడు” అంది నీరజ.

“అవును” అని శంకరం మళ్ళీ ఆలోచనలో పడ్డాడు. రెండు నిముషాల అనంతరం “మీకు శ్యామసుందర్ తెలుసా?” అన్నాడు మళ్ళీ.

“తెలియదు” అంది నీరజ.

“శ్యామసుందర్ లక్ష్మీనారాయణగారబ్బాయి.”

“నాకు లక్ష్మీనారాయణగారుకూడా తెలియదు...” అంది నీరజ.

“ఆయన దీ ఊరే. ఈమధ్య కైలాసరావుచేతహోటల్లో హత్యచేయబడినది లక్ష్మీనారాయణగారే...” అన్నాడు శంకరం.

నీరజకింకా శంకరం చెప్పదల్చుకున్నదేమిటో తెలియ లేదు కానీ ఆమె గుండె జలదరించడం మొదలయింది... “అయితే!” అంది.

“లక్ష్మీనారాయణగారు హత్యకాబడడానికి కారణం నేనే!” అన్నాడు శంకరం.

నీరజ తృళ్ళిపడి “అంటే?” అంది.

“కైలాసరావును నేనే పురమాయించాను. లక్ష్మీ నారాయణగారిని చంపమని అతనికి నేను చెప్పలేదు. ఒక వస్తువును సాధించమని అతనికి చెప్పాను. అది లక్ష్మీ నారాయణగారి వద్ద ఉంది.”

“ఏమిటా వస్తువు?”

“బంగారం తయారుచేసే యంత్రం” అన్నాడు శంకరం.

నీరజకు అర్థంకాలేదు కానీ కుతూహలంగా వింటూ కూర్చుంది.

శంకరం చెప్పసాగాడు. "అదొట్టే పెద్దది కాదు. కానీ గంటలో యాభై బిస్కట్లు తయారౌతాయి. ఇత్తడి బిస్కట్లు లోపలకు తోస్తే బంగారం బిస్కట్లుగా మారతాయన్నమాట. అందులో పెద్ద తమాషా ఏమీ లేదు. బంగారం పూత వస్తుందన్నమాట వాటికి.

అయితే ఈ పూతలో ఒక తమాషా ఉంది. ఒక మాదిరి పరీక్షలో అవి బంగారం కాదని నిర్ణయించడం కష్టమవుతుంది ఈ పూత మూలంగా. అలాగని బంగారం కూడా ఎంతో పట్టదు. ఇది లక్ష్మీనారాయణగారి వద్ద ఉంది. కానీ ఎక్కడ వుందో తెలియదు. ఇది మాకు చాలా అవసరం. ఒకోసారి కస్టమర్సనీ, ఒకోసారి పోలీసులనూ మోసగించడానికీ యంత్రం మాకు బాగా సహాకరిస్తుంది.

లక్ష్మీనారాయణగారు దాన్నెలాగో ఒక ఫారినర్ దగ్గర సంపాదించాడు. దాంతో ఆయన గిల్టు నగల వ్యాపారం చేస్తున్నాడు. కానీ ఇత్తడిని బంగారంగా మార్చడం కూడా వుందని నా అనుమానం.

అది సంపాదించడానికి కైలాసరావుని నియోగించాను. అతనికి రవిలాంటి బుర్ర లేదు. అతను దీనికి ప్రయత్నిస్తున్నాడని తెలియగానే లక్ష్మీనారాయణగారు తెలివిగా అతన్ని బుట్టలో వేశాడు. దానిమీద అతను రెచ్చిపోయి ఆయన్ను హత్యచేశాడు. అందులోకూడా అట్టే తెలివి ప్రదర్శించకపోవడం వల్ల చివరకు పోలీసులకు దొరికిపోయాడు.

ఉన్న సుగుణమల్లా ఏమిటంటే అతను తనవారి గురించిన రహాస్యాలు ప్రాణం పోయినా చెప్పడు. నాకు

సంబంధించినవాళ్ళలో ఒక ముఖ్యుడు పోతున్నాడు. నాకు బాధగానే వుంది. ఆ సంగతలాగుంచితే అసలుపని జరగలేదు గదా–ఇప్పుడా మిషన్ నాకాక్కావాలి. అది శ్యామసుందర్ దగ్గరుంది.''

నీరజ క్షణం ఆలోచించి ''లక్ష్మీనారాయణగారు తెలివిగా కైలాసరావుని బుట్టలో వేశాడంటున్నారు కదా—ఏ విధంగానో చెప్పగలరా?'' అనడిగింది.

''ఫలానా చోటికి వస్తే ఆ యంత్రం అతనికిస్తానని ఆయన చెప్పాడు. వీళ్ళ పరిచయం కేవలం టెలిఫోన్ కాల్స్‌వరకే పరిమితం. కైలాసరావు, లక్ష్మీనారాయణ గారి మాటలు నమ్మి అక్కడికి తన మనిషిని పంపాడు. వాణ్ణాయన తన మనుషులచేత బంధింపజేసి నానా హింసలూ పెట్టి కైలాసరావు గురించిన వివరాలులాగాడు. ఆ తర్వాత ఆయన మనుషులు కైలాసరావును వేటాడడం మొదలుపెట్టారు. ఈ విషయం పసిగట్టి జరిగిన మోసం గ్రహించడానికి కైలాసరావుకు రెండురోజులు పట్టింది. గ్రహించేక లక్ష్మీనారాయణగారు ఘోరాతిఘోరంగా హత్య చేయబడ్డాడు.''

నీరజకు భయంవేసింది. ''శ్యామసుందర్ ఎటువంటి మనిషి?'' అంది.

''చాలా సౌమ్యంగా కనపడతాడు కానీ సమయం వచ్చినపుడు పచ్చి రక్తం తాగడానికి జంకని మనిషని నా అనుమానం'' అన్నాడు శంకరం.

నీరజ మాట్లాడలేదు.

''చాలా ప్రమోదకరమైన పని ఇది. నాకా యంత్రం కావాలి'' అన్నాడు శంకరం.

# 10

"చాలా థాంక్స్ మిస్టర్ వీర్రాజూ! అన్న ప్రకారం నా కారును నా కప్పగించావు" అన్నాడు జగన్మోహన్.

రవి నవ్వి "అంటే మీలో నామీద అనుమానమున్న దన్నమాట" అన్నాడు.

"ఇట్స్ నేచురల్" అన్నాడు జగన్మోహన్.

"అనుమానమున్న చోట మోసముంటుంది. నేను మోసాన్ని సహించను. నెగెటివ్స్ ట్వంటీటూవ మీ దగ్గర డూప్లికేట్సున్నాయా?"

"నా కారు నాకు చాలా విలువైనది. ఎలాంటి రిస్కూ తీసుకోను నేను. నాకూ నెగెటివ్స్ ట్వంటీటూకూ ఋణం చెల్లిపోయింది. ఇది నిజం" అన్నాడు జగన్మోహన్.

"అయితే సరే-కానీ మీరు నన్నుకూడా ఇకమీదట మరిచిపోవాలి. నన్ను ఫాలో చేయడానికిగానీ నా ఉనికి తెలుసుకుందుకుగానీ ఏ విధమైన ప్రయత్నాలూ చేయకూడదు. అలాంటి ప్రయత్నాలు చేసినట్లు నాకు ఏ మాత్రం అనుమానం కలిగినా ఫస్టుఎటాక్ ఎర్రకారుమీదే నని గుర్తుంచుకోండి" అన్నాడు రవి.

"నా సంగతి సరే. నువ్వూ నా జోలికి రాకూడదు."

"భలేవారే. మీకూ నాకూ ఏ సంబంధమూ లేదు. నేను మిమ్మల్ని మరిచిపోవడం అప్పుడే ప్రారంభమయింది. వస్తాను మరి" అన్నాడు రవి.

జగన్మోహన్ ఆశ్చర్యంగా చూస్తూండగా అతనక్కణ్ణించి బయటపడ్డాడు. తర్వాత అతను ఊరంతా గజిబిజిగా తిరిగాడు. అలా తిరిగి తిరిగి ఒక సందులోని గది

లోకి వెళ్ళాడు. ఆ గదిలో అతని వేషం మళ్ళీ మారింది. కాసేపు అద్దంముందు నిలబడి కొత్త వేషానికి అనుగుణంగా కొంత నటన ప్రాక్టీసు చేశాడతను. అలా ఓ పావుగంట అక్కడ గడిపేక — గదికున్న ఇంకో తలుపు తీసుకుని బయటపడ్డాడు.

మళ్ళీ కాసేపు సందులు తిరిగి రోడ్డుమీదకు వచ్చాడు. కనబడ్డ ఆటో ఎక్కి తనక్కావలసిన అడ్రస్ చెప్పాడు. సుమారు పది నిముషాల్లో ఆటో అతన్ని ఇంటికి తీసుకు వెళ్ళింది.

రవి ఆటో దిగి మీటరు ప్రకారం డబ్బిచ్చి-నాలుగడుగులు వేసి ఆ ఇంటి తలుపు తట్టాడు.

సుమారు రెండునిముషాల అనంతరం ఆ ఇంటి తలుపులు తెరుచుకున్నాయి. ఒక అందమైన అమ్మాయి సుమారు ఇరవై ఏళ్ళది—గుమ్మంలో నిలబడి వుంది.

“మిస్ స్నేహా—నేను లోపలకు రావచ్చునా?” అన్నాడు రవి.

ఆమె ఆశ్చర్యంగా అతనివంక చూసి “మీరెవరో నాకు తెలియదు” అంది.

“నా ప్రశ్నకు జవాబు అదికాదు. లోపలకు రావచ్చా అని అడిగాన్నేను” అన్నాడు రవి.

“అందుకే మీరెవరో నాకు తెలియదన్నాను” అంది స్నేహ విసుగ్గా.

“అయితే ఈ ఇంట్లోకి వచ్చేవాళ్ళందరూ మీకు తెలిసినవాళ్ళేనా?” అన్నాడు రవి.

స్నేహ తడబడి “లోపలకు రండి!” అంది. అతను లోపలకు రాగానే తలుపులు వేసి “ఎవరు మీరు ఎందుకు వచ్చారు?” అనడిగింది.

"నేను మీకు శత్రువును కాను. మీకేమీ అపకారం తలపెట్టను. మీతో చిన్న పనుండి వచ్చాను. పని చిన్నదైనా ప్రతిఫలం పెద్దదిగా ఉంటుంది" అన్నాడు రవి.

"మీ పేరు?"

"పేరు కావాలనుకుంటే అశోక్ అని పిలవ్వచ్చు" అన్నాడు రవి.

"మిస్టర్ అశోక్-మీకు నాతో ఏం పని?" అంది స్నేహ.

"తెలుసుకోబోయేముందీ ఫోటో చూడండి" అంటూ జేబులోంచి ఒక ఫోటో తీసి స్నేహకు అందించాడు రవి. స్నేహ ఆ ఫోటో అందుకుని చూసి తృళ్ళిపడింది. అందులో కండలు తిరిగిన వస్తాదొకడున్నాడు. వాడి ముఖం చాలా భయంకరంగా వుంది.

"నయాన నా మాట వినని వాళ్ళకోసం ఇతన్ని వాడుతూంటాను. ఆడవాళ్ళను హింసించడంలో ఇతను స్పెషలిస్టు" అన్నాడు రవి.

"ఇదంతా ఎందుకు చెబుతున్నారో నాకర్థంకావడం లేదు" అంది స్నేహ. అర్థంకానప్పుడు తన గుండె ఎందుకు జలదరిస్తోందో ఆమెకు తెలియడంలేదు.

"మీ దగ్గరకు వచ్చే అతి కొద్దిమందిలో శ్యామ్‌సుందర్ కూడా ఉన్నాడు. అతన్నీరోజు పిలవండి. బాగా రెచ్చగొట్టండి. ఇద్దరూ అనుభవాలు పంచుకోండి. నేను కాసిని ఫోటోలు తీసుకొంటాను."

స్నేహ భయంగా చూసింది. "ఆయన్ను బ్లాక్ మెయిల్ చేయడానికా? అలాగైతే నా ప్రాణాలు పోతాయి" అంది.

"నేను బ్లాక్ మెయిలర్ని కాను. ఆ ఫోటోలు బ్లాక్ మెయిలింగ్ కోసం కాదు. నా పని ఏమిటో మీకనవసరం. కానీ అందువల్ల మీకే ఇబ్బందీరాదని హామీ ఇస్తున్నాను. నేను చెప్పినదానికి అంగీకరించకపోతే మాత్రం..." అని ఆగి "అన్నట్లు ఆ ఫోటో ఇలా ఇచ్చేయండి. మీకు దాని అవసరం లేదనుకుంటాను" అని ఆమె దగ్గర్నుంచి ఫోటో అందుకున్నాడు రవి.

"నాకు భయంగా ఉంది" అంది స్నేహ.

"భయం అనవసరం. మీకు శ్యామసుందర్ కీ ఉన్న సంబంధం ఈ ఊళ్ళో చాలా కొద్దిమందికి మాత్రమే తెలుసును. అంత గొప్ప రహస్యం నాకూ కూడా తెలుసును. శ్యామసుందర్ మీరంటే పడి చస్తాడనీ-అడిగినప్పుడల్లా అతనికి లొంగకపోవడమే అందుకు కారణమనీ కూడా నాకు తెలుసును మీరు పిలిస్తే ఎన్ని పనులున్నా మానుకుని క్షణాలమీద పరుగెత్తుకుని వస్తాడనికూడా తెలుసు.

ఇవన్నీ నాకెలా తెలిశాయని నన్నడగొద్దు. తెలుసుకునేందుకు ప్రయత్నించవద్దు. నా గొప్పతనాన్ని ప్రదర్శనం చేసుకోవడానికి మాత్రమే ఈ విషయాలు గుర్తుంచుకోవాలి. ఆ తర్వాత-నేను అన్నమాటమీద నిలబడేవాడిని. ఈ రోజు తీయబోయే ఫోటోలతో నాకొక చిన్న పనుంది. ఆ పని ముగియగానే ఈ ఫోటోలు నాశనం చేయబడతాయి. ఎటొచ్చీ నన్ను మోసగించడానికి ప్రయత్నిస్తే మాత్రం— నేనిందాక చూపించిన ఫోటో ఉందికదా... అది గుర్తుంచుకోవాలి" అన్నాడు రవి.

# 11

"ఏమైంది మేడమ్?"

"టైర్లో గాలిలేదు" అందామె నిరుత్సాహంగా.

"మీ డ్రైవర్ లేడా?"

"లేడు. కారు నేనే స్వయంగా డ్రైవ్ చేసుకుని వచ్చాను."

"నేను మీకేవిధంగా సహాయపడగలనో చెప్పండి."

"థాంక్స్. నాకే సాయం అవసరంలేదు. రిక్షాలోనో, టాక్సీలోనో ఇంటికి వెళ్ళిపోతాను" అని "నాకో టాక్సీ పిలవగలరా?" అందామె.

"మరి మీ కారు?"

"ఇంట్లో ఎవరూ లేరు. ఆయన ఊళ్ళో లేరు. ఈ హోలు ప్రొప్రయిటర్ని రిక్వెస్టు చేస్తాను" అందామె.

అతనక్కణ్నించి కదలగానే ఆమె హోలు ప్రొప్రయిటర్ని కలుసుకుని పరిస్థితి వివరించింది. అతనామెను కలవరపడవద్దనీ కారు విషయం తను చూస్తాననీ వాగ్దానం చేసి, "ఇంటికెలా వెడతారు? మా కార్లో డ్రాప్ చేయమంటారా?" అన్నాడు.

"అవసరం లేదండి. చాలా థాంక్స్" అని ఆమె అక్కణ్నించి బయటపడింది. బయట ఆమెను ఇందాకా పలకరించిన యువకుడు కనపడలేదు. అదృష్టవశాత్తూ ఆటో దొరికింది. ఆమె ఇల్లు చేరింది.

ఆమెను చూస్తూనే వాచ్‌మన్ సలాంకొట్టి "ఆటోలో వచ్చారేమమ్మా, కారేమయింది?" అనడిగాడు. కష్టంగా అతనికి పరిస్థితిని వివరించి ఇంట్లో అడుగుపెట్టింది. ఆమె వెళ్ళేసరికి హాల్లో ఆయా ఆమెకోసం ఎదురుచూస్తోంది.

"బాబు నిద్రపోయాడమ్మా. మరి నేను వెడతాను" అంది ఆయా.

ఆయా వెళ్ళిపోయేక తలుపులు వేసుకుందామె. అంత ఇంట్లోనూ ఇప్పుడు తనొక్క త్తేఉంది. అయితే ఇదామెకు కొత్త కాదు. పడకగదిలోకి వెళ్ళి నిద్రపోతున్న కొడుకును చూసి ఒకసారి ప్రేమగా బుగ్గలు నిమిరింది.

ఆమెకు ఒళ్ళంతా చిరాగ్గా ఉంది. అది ఎయిర్ కండిషన్డు థియేటర్ కాకపోవటంతో బాగా ఉక్కపోసింది. బయట కూడా వాతావరణం ఉక్కగానే వుంది.

ఆమె టవల్ తీసుకుని బాత్ రూమ్‌కు బయల్దేరింది. ఓరవాకిలిగా ఉన్న బాత్ రూమ్ తలుపులు తెరిచిన ఆమె తెల్లబోయింది. ఆ గదిలో ఒక యువకుడు నిలబడి నవ్వుతున్నాడు. కొద్దిసేపటిక్రితం తనకు హాలువద్ద కనపడ్డ యువకుడతనే!

"ఇందాకా నా పేరు చెప్పడం మరచాను. అయాం మిస్టర్ అశోక్!" అన్నాడతను నవ్వుతూ.

అతన్నీ అతని నవ్వునూ చూస్తూంటే ఆమెకు భయం వేసింది. "ఎవర్నువ్వు?" అంది కంగారుగా.

"కంగారు పడవద్దు. నావల్ల నీకే ప్రమాదమూ వాటిల్లదు. నేనిక్కడికి రావడంలో ఏ విధమైన దురుద్దేశ్యమూ లేదు..." అన్నాడు రవి.

"అయితే ఎందుకొచ్చావ్?" అందామె కంగారుగా.

"నువ్వు స్నానంచేసే ఉద్దేశ్యంతో లోపలికి వచ్చినట్లున్నావ్ - నేను బయటకు పోతాను. నువ్వు స్నానం ముగించుకురా. తీరుబడిగా మాట్లాడుకుందాం" అన్నాడు రవి.

"అవసరంలేదు. స్నానంచేసే ఉద్దేశ్యం పోయింది. ఏం చెబుతావో చెప్పు" అందామె.

"అయితే ఎక్కడ మాట్లాడుకుందాం? క్రింది హోల్లో అయితే మరీ బట్టబయలుగా వుంటుంది. ఇక్కడే అయితే ఇబ్బందిగా వుంటుంది. నీ పడగ్గదికి పోదాం. నేనేం చేయన్లే" అన్నాడు రవి.

ఇద్దరూ ఆమె పడకగదిలోకి వెళ్ళారు. ఆమె మంచం మీద కూర్చుంటే- డ్రస్సింగు టేబిల్ ముందుండే బల్ల లాక్కొని అతనామెకెదురుగా కూర్చొని, "నువ్వు చాలా అందంగా వున్నావు" అన్నాడు.

"ఇదేనా నువ్వు చెప్పదల్చుకున్న విషయం?" అందామె.

"కాదు. అందం ఆడదానికి వరం. అయితే నాలాంటి మగవాళ్ళున్నప్పుడది శాపంగా కూడా పరిణమిస్తుంది. నేను చెప్పదల్చుకున్న విషయం ఇదే!" అన్నాడు రవి.

"అంటే?"

"ఈ ఫోటో చూడు" అంటూ రవి ఆమెకో ఫోటో అందించాడు. ఆ ఫోటోలో వున్న భయంకరమైన వస్త్రాదుని చూసి ఆమె త్రుళ్ళిపడింది.

"అందమైన ఆడది బంగారు గుడ్లు పెట్టే బాతు లాంటిది. దాని అందంతో ఎంతైనా డబ్బు సంపాదించవచ్చు. కానీ తన అందంతో వ్యాపారం చేయడానికి ఆడది ఓ పట్టాన ఒప్పుకోదు. నాలాంటి వాడు రోజుల తరబడి చెప్పినా వినని ఆడదాన్ని క్షణాలమీద దేనికైనా ఒప్పించగల సమర్థత ఈ ఫోటోలోని మనిషికుంది. ఈ మనిషి పూర్తిగా నా చెప్పుచేతల్లో వున్నవాడు.

అయితే అందమైన ఆడవాళ్ళమీద మాత్రమే ఇతన్ని ప్రయోగిస్తాను. అదీ ఆ ఆడది నా మాట విననప్పుడు! అన్నట్లు... నువ్వు అందంగా వున్నావు. చాలా చాలా అందంగా ఉన్నావు."

రవి మాటలు విని ఆమె బాగా కలవరపడింది. ఏమిటితని ఉద్దేశ్యం? తన్ను వ్యభిచారిణి చేస్తాడా? తలచుకుంటూనే ఒళ్ళు గగుర్పొడిచిందామెకు. రవి మళ్ళీ మొదలు పెట్టాడు.

"నీకంటె అందమైన ఆడదాన్ని నేను రెండు నెలల క్రితం వృత్తిలోకి దింపాను. అందుకే ఫోటో మనిషి అవసరమయ్యాడు. ఇప్పుడామె నాకు లక్షలు సంపాదించి పెడుతోంది. ఇంతకూ ఆమెను నీకంటె అందమైనదని ఎందుకన్నానో ఈ ఫోటో చూస్తే తెలుస్తుంది" అంటూ ఆమెకింకో ఫోటో అందించాడతను.

ఆ ఫోటో అందుకుని చూసిన ఆమె ముఖంలో మొట్టమొదట సిగ్గు కనపడింది. తర్వాత అసహ్యం, ఆపైన ఆశ్చర్యం- ఆమీదట కోపం కనబడ్డాయి. రవి ఆమె ముఖ భావాలను చూస్తూ కూర్చున్నాడు. ఫోటోను పరిశీలించాక ఆమె రవి ముఖంలోకి ఒకసారి చూసి తల దించుకుంది. ఆ ఫోటో చూసేక అతని ముఖంలోకి చూడడం కష్టంగా వుందామెకు.

అందులో శ్యామసుందర్, స్నేహ అత్యంత అసహ్యకరమైన విధంగా వున్నారు. ఇద్దరి ముఖాలూ స్పష్టంగా కనపడుతున్నాయి. స్నేహ ఎవరో ఆమెకు తెలియదు. కానీ శ్యామసుందర్ మాత్రం...

"నువ్వుండగా నీ భర్త ఇంకో యువతి పొందు కోరు

తున్నాడంటే ఆమె నీకంటె అందమైనదేఅయుండాలి" అన్నాడు రవి. "అయినా వెరైటీ కోరే మగవాడికి అందంతో పనేమిటి?"

"ఈ ఫోటో నాకెందుకు చూపించినట్లు?" అందామె చివరకు.

"ఒకటి_ నిన్ను కూడా ఈ ఫోటోలోని ఆడదానిగా మార్చగలనని చెప్పడానికి. రెండు_ నీ భర్త నిజస్వరూపం కళ్ళారా చూసే అవకాశం నీకివ్వడానికి" అన్నాడు రవి తాపీగా.

"తర్వాత..." అందామె.

"నీ భర్తను బెదిరించడానికొక్కటే వాలంటే ఈ ఫోటో నీకు వదిలేస్తాను ఒకే ఒక్క షరతుమీద" అన్నాడు రవి.

"ఏమిటా షరతు?"

"బంగారం పూతె యంత్రం కావాలి. ఎలాగో అలా అది నువ్వు నీ భర్త దగ్గర్నుంచి సంపాదించి తెచ్చి నా కివ్వాలి" అన్నాడు రవి.

"లేకపోతే?"

"నీ కొడుక్కి స్వర్గలోకం. నువ్వు ఇహా లోకంలో రంభవు."

ఆమె ఆలోచనలో పడింది. రవి గురించి ఆమెకు చాలా భయంగా వుంది. భర్త ప్రవర్తన తెలిసేక అతని మీద విపరీతమైన కోపంగా వుందామెకు. ఈ రెండూ కలిసి ఆమె ఆలోచనలను రవికి అనుకూలంగా మారుస్తున్నాయి.

నిజానికి బంగారం పూత యంత్రం గురించి ఆమెకు తెలుసును. అది ఈ ఇంట్లోనే వుంది. చాలా వరకూ

పూర్తి పనులు రహస్యంగా తనే చేస్తూంటుంది. కానీ తన మామగారు, భర్తకూడా అది వేరే ఎక్కడో ఉందన్న భ్రమ చాలామందికి కలిగించారు.

ఎంత మంది ఆ యంత్రం కోసం ప్రయత్నించి ఎలా భంగపడ్డదీ తన భర్త తన దగ్గర సగర్వంగా చెప్తూ తూంటాడు. మూడో కంటివాడికి దాని ఉనికి గురించి తెలియడం ఇష్టంలేకనో— దానికి సంబంధించిన వ్యవహారా లన్నీ ఇంట్లోవాళ్ళే చూసుకోవడం జరుగుతోంది.

దాని కారణంగా లక్షలార్జించే అవకాశముంది. అది లేకపోతే తమ వ్యాపారమే ఆగిపోతుంది. కానీ అదుంటే తన భర్తకు లక్షలు మిగలవచ్చు. కానీ తన జీవితం సర్వ నాశనమవుతుంది.

క్రమంగా ఆమె ఆలోచనల్లో స్వార్థం చోటుచేసుకో సాగింది. డబ్బుకు తమకేమీ లోటులేదు. తన పేరనే బ్యాంకులో ఆరేడు లక్షలకుపైగా ఉన్నాయి.

గిల్టునగల వ్యాపారం ఆగిపోతే తనకేం? కొనసాగితే తనకేం? అవన్నీ తన భర్త చూసుకుంటాడు. ప్రవర్తన విషయంలో తనెలాగూ అతన్నదుపుచేయలేదు. అతని వ్యాపారం గురించి ఆలోచిస్తే బంగారంలాంటి తన బ్రతుకు సర్వనాశనమవుతుంది. తనుపోతే అతనింకో వివాహం చేసుకుని ఇంకా విచ్చలవిడిగా ఉంటాడు.

ఆమె ఆ యంత్రాన్నతని స్వాధీనం చేయాలని నిర్ణ యించుకుంది.

## 12

శంకరం ముఖంలో ఆనందం స్పష్టంగా కనిపిస్తోంది. "అద్భుతం! జీవితంలో ఇంత ఆనందం నాకెన్నడూ కలగ లేదు" అన్నాడాయన.

నీరజ నిర్లిప్తంగా కూర్చుని ఉంది. ప్రతి పర్యాయమూ ఒక గండంలా ఉన్నదామెకు. ఇప్పటికి మూడు గండాలు గడిచాయి. ఇంక ఒకే ఒక్క గండముంది.

"మీ ఆఖరు పని చెప్పండి" అందామె.

"లలిత తెలుసా మీకు?" అన్నాడు శంకరం తన మామూలు ధోరణిలో.

"తెలియదు."

"అవున్లెండి. ఎలా తెలుస్తుంది? ఆమెగురించి చాలా మందికి తెలియదు" అన్నాడు శంకరం.

"ఎవరామె?"

"ఈ ఊళ్ళోనే వుంటోంది. ఒక ప్రయివేట్ కంపెనీలో స్టెనోగా పనిచేస్తోంది. చాలా అందంగా వుంటుంది. అందానికి మించిన తెలివితేటలు."

"అలాంటి ఆడవాళ్ళు చాలామంది ఉంటారు. ఆమె ప్రత్యేకత ఏమిటి?" అంది నీరజ.

"మీకర్థమయ్యేలా చెప్పాలంటే ఆమె ఆడ రవి!" అన్నాడు శంకరం.

నీరజ కర్థంకాలేదు. "అంటే?" అంది.

"మగవాళ్ళలో రవికెన్ని క్వాలిటీస్ వున్నాయో, ఆడవాళ్ళలో ఆమెకూ అన్ని క్వాలిటీస్ వున్నాయి. ఆమెకోసం నేను ఎన్నో రకాల ప్రయత్నించాను. అన్ని ప్రయత్నాలు ఫెయిలైపోయాయి. ఏమీ చేయలేక పోయాను. మామూలు ఎత్తులకు, జిత్తులకు లొంగదామె. బలప్రయోగంకూడా పనిచేయలేదు. కండలు తిరిగిన వస్తాదులనే మన్ను కరిపించిందామె. కరాటేలో శిక్షణ పొందిందామె."

"ఇప్పుడు రవి ఏం చేయాలి?"

"ఆమెను నా మనిషిని చేయాలి."

"అంటే?"

"ఆమెను నా కప్పగించాలి. ఆమె నేను చెప్పే మాటలు వినేలా చేయాలి."

"అదెలా సాధ్యం? ఏదైనా వస్తువును సాధించవచ్చు గానీ మనిషి మనసును సాధించడమెలా? అది మీవల్లనే కావాలి" అంది నీరజ.

"నావల్ల కాలేదు. కనుకనే మీ దగ్గరకు వచ్చాను. ఇది నేను మిమ్మల్ని కోరుతున్న ఆఖరు కోరిక. ఇది సాధ్యపడితే నేనింక మీ జోలికి రాను. హాయిగా, సంతోషంగా సుఖజీవనం చేయవచ్చు మీరు" అన్నాడు రవి.

"కానీ ఇది చాలా అన్యాయం. ఒక మనిషిని ఇష్టాఇష్టాలతో నిమిత్తం లేకుండా ఇంకొకరి పాలేయడమే నా కిష్టంలేదు. ఇష్టం లేకపోయినా తప్పనిసరి పరిస్థితుల్లో అది చేయవచ్చు. అయితే ఆ మనిషిని మానసికంగా మీ పరం చేయడం మీవల్లకాదు."

"వల్లకాదంటే కుదరదు. శాయశక్తులా ప్రయత్నించాలి" అని శంకరం అక్కణ్ణించి లేచి వెళ్ళిపోయాడు.

నీరజ నిరుత్సాహంగా అక్కడే కూర్చుండిపోయింది. ఈ పని సాధ్యపడుతుందని ఆమెకు అనిపించడంలేదు. శంకరం లలితకోసం చాలా ప్రయత్నాలుచేసి ఉండాలి. ఆమె కొరకరాని కొయ్య అన్నది స్పష్టమైనాకనే_నిరాశ చేసుకుని ఉంటాడు. ఇప్పుడు రవికి పని అంటగట్టాడు. ఇంతవరకూ భగవత్కృపవల్ల అన్నీ సక్రమంగా అయిపోయాయి. చివరకు ఇబ్బంది తప్పేలా లేదు.

'భగవాన్-మా ప్రేమ ఫలిస్తుందా? మేము కూడా అందరిలాగే హాయిగా కాపురం చేసుకునే రోజు అసలు రానున్నదా?' అనుకుంది నీరజ.

# 13

"ఇది మన ప్రేమకు ఆఖరి సవాలు" అంది నీరజ.

"అని నువ్వనుకుంటున్నావా?" ఏదో ఆలోచిస్తూ అన్నాడు రవి.

"రవీ—నిన్ను చూస్తే నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది. ఒకోసారి మన ప్రేమజీవితం ఎలాగుంటుందోనని కూడా భయంగా ఉంటుంది. ప్రతి విషయంలోనూ నీ ప్రవర్తన సూటిగా ఉంటుందో కానీ లోతుగా ఉండడం లేదు. నేను చెప్పిన పనులన్నీ సాధించుకువస్తున్నావు తప్పితే కారణాలగురించి నన్నెక్కువగా వేధించడంలేదు నువ్వు. ఏ విషయాన్నయినా నీకు సంబధించినంతవరకే తప్ప పట్టించుకోవడంలేదు."

నీరజ మాటలకు రవి నవ్వాడు. "నువ్వలా ఎందుకనుకుంటున్నావో నే నర్థం చేసుకోగలను. నేరాలతో నా హృదయం కరడుగట్టుకుపోయింది. నీ ప్రేమలో అది కరగడం ఆరంభమయింది. అయితే కొన్ని ప్రయోజనాలు కోరావు నువ్వు. అవి సాధించాలంటే ప్రేమ ప్రభావానికి దూరంగా ఉండాలి నేను. నా ప్రేమ రీతులు నీకు ముందుముందెలాగూ తెలుస్తాయి.

ఇంతవరకూ నీకోసం నేను సాధించిన విషయాలకెంత అవగాహన అవసరమో నీకు తెలుసా? ఈ నగరంలో ప్రముఖులందరి రహస్యాలూ, బలహీనతలూ నాకు తెలుసును.

పది నిముషాలు మాట్లాడితే ఎదుటివాడి మన స్తత్వా న్నాకళింపు చేసుకోగలను నేను. అందుకే షాజహాన్ నన్ను వదులుకోవడానికిష్టపడలేదు. నేను సాధించిన పనుల వెనకనున్న లోతైన మన స్తత్వ పరిశీలన నువ్వు గుర్తించి ఉంటే ఈ మాట అని ఉండేదానివి కాదు నువ్వు."

"సారీ రవీ__నా మాటలతో నిన్ను బాధపెట్టినట్లున్నాను!" అంది నీరజ.

"ఏమీ లేదు. నా దృష్టిలో నువ్వింకా పసిపాపవు. నిన్ను కొంతకాలం ప్రేమతో లాలించాలి. ఆ తర్వాత నువ్వే తల్లి వౌతావు."

నీరజ సిగ్గుపడింది. అంతలోనే ఆమెకు శంకరం ఆఖరి కోరిక గుర్తొచ్చింది. "కానీ లలిత మనసు నువ్వు సాధించగలవా?" అంది నిరుత్సాహంగా.

"అన్నింట్లోకీ అదే నాకు సులభం" అన్నాడు రవి.

"ఎలా?" అంది నీరజ ఆశ్చర్యానికి సంతోషం జతకాగా.

"ఎలాగని అడగవద్దు. ఇంకో గంటలో నేను లలితను తీసుకుని నీ దగ్గరకు వస్తాను. ఆ తర్వాత మనం మంచి ముహూర్తం చూసుకోవాలి" అన్నాడు రవి.

## 14

"హల్లో లలితా_ నీతో ఒక చిన్న పని తగిలింది."

"వ్హాట్ డియర్" అంది లలిత.

"నన్నలా పిలవద్దని చెప్పానా?"

"పిలుపేగా_ అంతకుమించి ఎలాగూ సాధ్యపడను నాకు."

"కాదు లలితా, నా వివాహం నిర్ణయమైనట్లే!" అన్నాడు రవి.

పక్కలో బాంబు పడ్డట్టదిరిపడింది లలిత. "ఏమి టన్నావ్?"

"నేనొక అమ్మాయిని ప్రేమించాను. ఆమెకూడా నన్ను ప్రేమించింది. ఇద్దరం పెళ్ళి చేసుకోవాలను కున్నాం. చిన్న అడ్డంకి వచ్చింది."

"ఏమిటది?"

"అదేమైనప్పటికీ నువ్వు సాయంచేస్తేనే ఆ అడ్డు తీరుతుంది...

"చెప్పు...."

"లలితా! నువ్వు నన్ను ప్రేమించావు. నేను నిన్ను అభిమానిస్తున్నాను గానీ నువ్వు కోరేవిధంగా ప్రేమించ లేకపోతున్నాను. అది నా దురదృష్టం. కానీ ఎన్నో పర్యాయాలు నిన్ను నేను కాపాడాను. ఒకటి రెండు పర్యాయాలు నువ్వు నన్ను కాపాడావు. జీవితంలో నా కోసం ఏమైనా చేయగలనని చెప్పావు. అందుక్కారణం ప్రేమ అని కూడా చెప్పావు. అందుకే ఇప్పుడు గంపె డాశతో నీ దగ్గరకు వచ్చాను. నాకోసం ఏమైనా చేసి నీ ప్రియుడి ప్రేమను భగ్నంకాకుండా కాపాడగలవా?" అన్నాడు రవి.

"అందుకు సందేహమా?" అంది లలిత.

"అయితే నేను నిన్ను నాకాబోయే భార్య నీరజకు అప్పగిస్తాను. ఆమె నిన్ను ఒక పురుషుడికి అప్పగిస్తుంది. నువ్వు పూర్తిగా అతని అధీనంలోకి వెళ్ళిపోవాలి. అతను నిన్ను బాధించడు, హింసించడు. అపురూపంగా చూసు

కుంటాడు. అలా చూసుకోకపోతే నువ్వతని అధీనంలో ఉండనవసరంలేదు."

"రవీ! ఏమిటి నువ్వనేది?" అంది లలిత. ఆమె కన్నులలో నీరు తిరిగింది.

"చాలా స్పష్టంగా చెప్పాను లలితా" అన్నాడు రవి.

"అవును నిజమే. కానీ నా ప్రేమకిదా ప్రతిఫలం? నిన్ను ప్రేమించిన తప్పుకి ముక్కూ ముఖం ఎరుగని మగవాడికి స్వాధీనమైపోవాలా? నా అన్నవారు, లేని నాకు నువ్వైనా వున్నావనుకున్నాను. కానీ నీ కడుపులో నా గురించి ఇలాంటి ఊహలున్నాయనుకోలేదు" అంది. చాలా బాధగా వచ్చాయామాటలామె నోటివెంట.

"మామూలు ఆడదానికిలా మాట్లాడకు లలితా! నన్ను ప్రేమించిన తప్పు అంటున్నావు. అంటే నన్ను ప్రేమించడం ద్వారా తప్పు చేశానని అనుకుంటున్నావా? నా మీద ఎంతో విశ్వాసమున్న నీవు- నేను నీకు సరైన వరుణ్ని చూడననుకుంటున్నావా? నీకూ నాకూ వివాహం కానంతమాత్రాన నా ప్రేమ భగ్నమైపోవాలా? ఇదేనా నీ ప్రేమ?" అన్నాడు రవి.

లలిత- అతను అలాగే అయిదునిమిషాలసేపు వాదించుకున్నారు. రవి తర్కంముందు లలిత నిలబడలేకపోయింది. "సరే పద రవీ. నీ సంతోషంకోసం నేను త్యాగం చేస్తాను...." అందామె.

# 15

"నేనెవరో నీకు తెలుసా మిస్టర్ రవీ!" అన్నాడు వీరభద్రం.

"తెలుసు. మీరు నీరజకు తండ్రి" అన్నాడు రవి.

"నీరజకు సంబంధించినంతవరకూ తండ్రినే. కానీ నీకు సంబంధించినంత వరకూ యముణ్ణి...." అన్నాడు వీరభద్రం.

"నేను యముడికి భయపడే రకంకాదు. షాజహాన్ తెలుసా మీకు?" అన్నాడు రవి.

వీరభద్రం మాట్లాడకుండా ఒక్క నిముషం పూరుకుని తర్వాత "తెలుసు ఏం?"

"అతనుకూడా నాకు భయపడతాడు."

వీరభద్రం తడబడ్డాడు. తర్వాత తమాయించుకుని "ఇలాంటి కబుర్లు చాలా విన్నాం. నువ్వు మాత్రం నీరజ జోలికి రాకు" అన్నాడు.

సమాధానంగా "నీరజా!" అన్నాడు రవి. వీరభద్రం ఆశ్చర్యంగా చూస్తూండగా గదిలోకి నీరజ వచ్చింది.

"అయితే అమ్మాయిని బయట నిలబెట్టి నువ్వు లోపలకు పెళ్ళిమాటలకు వచ్చావన్నమాట" అన్నాడు వీరభద్రం కోపంగా.

"నీరజా! మీ నాన్నగారికి నీ నిర్ణయం తెలియజెయ్యి" అన్నాడు రవి.

"నాన్నా నేనితన్ని ప్రేమిస్తున్నాను. మా ఇద్దరికీ మీరు వివాహం జరిపిస్తే సరేసరి. లేదా మేము రిజిస్ట్రాఫీసులో పెళ్ళి చేసేసుకుంటాం. ప్రస్తుతం ఇద్దరం హోటల్ శాంతినివాస్‌లో పదకొండో నెంబర్ గదిలో ఉంటున్నాం. సాయంత్రలోగా మీ నిర్ణయం మాకు తెలియజేయండి" అంది నీరజ.

నీరజ తండ్రి ఎదుటపడి ఎన్నడూ అలా మాట్లాడలేదు. వీరభద్రం ఆమె మాటలకు మ్రాన్పడిపోయాడు.

ఆయన తేరుకునేలోగా ప్రేమికులిద్దరూ వీధిలోకి వెళ్ళి పోయారు.

"ఎంత ధైర్యంగా మాట్లాడావు నీరజా..." అంటూ అభినందించాడు రవి.

"ఈ ప్రపంచంలో ఏమైనా సాధించగల భర్త నీవుండగా నాకింకెవరన్నా భయం పోయి ఓ కొత్త ధైర్యం నన్నావహించింది" అంది నీరజ.

"క్వీ పిటవ్...." అన్నాడు రవి.

"అన్నట్లు చెప్పడం మరిచిపోయాను రవీ. శంకరానికి లలితను అప్పగించేక ఆయన నాకో ఉచిత సలాహా పారేశాడు. నువ్వు చేసిన పనులవల్ల షాజహాన్‌కు చాలా నష్టం వాటిల్లిందట. అతను నీమీద పగబట్టవచ్చునట. మన మార్గం నిష్కంటకం కావాలంటే షాజహాన్ని చంపేయడం మంచి మార్గమన్నాడాయన..." అంది నీరజ.

ఆమె మాటలు వింటూ రవి క్షణంపాటు ఏదో ఆలోచించి "నాతోరా నీరజా ఇది జరిగింది నిన్నకదా ఈ రోజు నిన్ను షాజహాన్ దగ్గరికి తీసుకువెళ్ళాలి..." అన్నాడు.

"ఎందుకు?"

"షాజహాన్ నా మేలుకోరే వ్యక్తి. అతను నాకెన్నడూ అపకారం తలపెట్టడు. నావల్ల అతనికి అపకారం జరిగిందని నువ్వంటూంటే నాకు చాలా బాధగా వుంది. అదే నిజమైతే నేను తల బద్దలుకొట్టుకు చచ్చిపోతాను. షాజహాన్‌కు నిన్ను చూపిస్తాను. జరిగినదంతా చెబుతాను నేను కావాలని, తెలిసి అతనికి నష్టం కలిగించాలని ప్రయత్నించలేదని చెబుతాను. అతను నమ్మి నన్ను మన్ని

స్తేనే మన జీవితం కొనసాగుతుంది. లేకపోతే నేనుండను. నువ్వే వుంటావు!''

నీరజ మాట్లాడలేదు. షాజహాన్ అంటే రవికి చాలా అభిమానమని ఆమెకు తెలుసును కానీ మరీ ఇంత ఎక్కువగా అది వుందని ఆమెకు తెలియలేదు.

ఇద్దరూ టాక్సీ ఎక్కారు. రవి చెప్పిన ప్రకారం టాక్సీ సత్యప్రకాష్ హోటల్ వద్ద ఆగింది. ఇద్దరూ టాక్సీ దిగారు.

''షాజహాన్ పనులు ఎక్కువగా అతని అనుచరులే చేస్తూంటారు. అతను కొన్ని ముఖ్యమైన వాటిలోనే జోక్యం చేసుకుంటాడు. అయినప్పటికీ అతనికి కొన్ని నిర్ణీత సమయాలూ, నిర్ణీత స్థలాలూ ఉన్నాయి. ఉదాహరణకు ఈ రోజు సోమవారం కదా. ఈ రోజు ఈ సమయంలో అతను సత్యప్రకాష్ హోటల్లో ఏడో నంబరు గదిలో వుంటాడు...'' అన్నాడు రవి.

అయితే రవి అంచనా తప్పయింది. రిసెప్షన్ కౌంటర్లో చెప్పిన ప్రకారం ఏడో నెంబర్ గదిలో ఎవరూ లేరు. అది ఖాళీగావుందిట. నిరుత్సాహంగా ముఖం పెట్టిన రవిని—

''ఆర్ యూ మిస్టర్ రవీ!'' అనడిగాడు రిసెప్షనిస్ట్.

రవి తల ఊపాడు.

''ఏడో నంబర్ గదిలోని తనకోసం వచ్చిన రవి అనే అతనికివ్వమని ఒక కవరిచ్చాడతను...'' అంటూ రవికి కవరు అందించాడు రిసెప్షనిస్టు.

అది తీసుకుని ఆక్రమించి బయటపడ్డాడు రవి. నీరజ అతన్ననుసరించింది. ఇద్దరూ శాంతినివాస్ హోటల్లో పదకొండో నంబర్ గదికి వెళ్ళారు.

రవి తిన్నగా బాత్రూంలోకి వెళ్ళాడు. అక్కడ సింకునిండా నీళ్ళుపట్టాడు. తన జేబులోంచి ఒక చిన్న సీసాతీసి అందులోని పొడిని కొద్దిగా నీటిలో వేశాడు. తర్వాత సీసాను జేబులో వేసుకున్నాడు. నీటిని బాగా చిలకరించి అందులో కవరు పడేశాడు. బాగా నీటిని పీల్చేలా దాన్ని అందులో కదిపాడు. తర్వాత కవరు తీశాడు.

దానిమీద "ఫ్రం షాజహాన్" అని వుంది. పక్కనే ఉన్న నీరజకు అది చూపించి "ఈ ట్రీట్‌మెంట్‌వల్ల కవరుమీద చిరునామా కనబడుతుంది. కవర్లోని తెల్ల కాగితాలమీద అక్షరాలు పుడతాయి. ఇది మా సీక్రెట్ పద్ధతి!" అన్నాడు.

నీరజ ఆశ్చర్యంగా అతని మాటలు విని, చేష్టలు చూస్తోంది.

కవరు తెరిచాడు రవి. కాస్త పెద్ద ఉత్తరమే ఉంది. అందులోని వివరాలు చదివి రవి, నీరజ కూడా ఆశ్చర్య పడ్డారు. షాజహాన్ రాసిన ఆ పెద్ద ఉత్తరంలోని ముఖ్య వివరాలివి:

షాజహాన్ లలితను ప్రేమించాడు. ఆమెను తన మతాలో జేర్చుకుందామనుకున్నాడు. ఆమె సాయంతో పెద్దఎత్తున నేరాలు చేయాలనుకున్నాడు. నేరాలకూ లలిత మన స్తత్వానికీ సరిపడదని అతనికి తెలిసింది. నయానా భయానా ఆమె తనకు లొంగదని కూడా తెలిసి పోయింది.

లలితకోసం అతను తన జీవనపధాన్ని మార్చుకో వాలనుకున్నాడు. మామూలు మనిషిగా మారాలను

కున్నాడు. ఆ సమయంలో నే లలిత రవిని ప్రేమిస్తోందనీ, రవి, నీరజను ప్రేమిస్తున్నాడనీ __ లలిత, నీరజ రవికోసం ఏమైనా చేయగలరనీ అతను గ్రహించాడు. తను మామూలు మనిషిగా మారడానికి రవిచేత కొన్ని పనులు చేయించాలని అతననుకున్నాడు.

కానీ అప్పటికి రవి మనసు షాజహాన్ అధీనంలోంచి తప్పిపోయింది. ఏంచేయాలో తెలియక సతమతమైపోయిన షాజహాన్ చివరకు రవిని బెదిరించాడు. మొండిఘటం రవి బెదరలేదు. అప్పుడు షాజహాన్ శంకరం అవతార మెత్తి నీరజను బెదిరించి, రవిద్వారా తనకు కావలసిన వన్నీ సాధించుకున్నాడు.

అతను ఇప్పుడు నా కిండియా వెళ్ళిపోయి సామాన్య జీవితం ప్రారంభించదల్చుకున్నాడు. ఇంక అతను రవికి కనిపించడు.

"రవీ! నీరజపై నీకున్న ప్రేమ అపూర్వం. ఆ ప్రేమను నా ప్రేమకోసం ఉపయోగించుకున్నాను. నేను కోరిన వన్నీ సాధించడంద్వారా నీ గురించి నాకూ రెండు విష యాలు తెలిశాయి. అన్నివిధాలా నువ్వు నాకంటె సమర్థుడివి. నేను నీకు బాస్ గా వుండటానికి తగను. ఇది నేను తెలుసుకున్న మొదటి విషయం. ఏ పరిస్థితిల్లోనూ నువ్వు నన్ను మోసం చేయవు. నాకు అపకారం తలపెట్టవు. నీవంటి వాడిని అనుచరుడిగా పొందడం నా అదృష్టం. ఇంకా నిన్ను అనుచరుడి స్థాయిలో వుంచడం నా తప్పు కూడా. ఇది నేను తెలుసుకున్న రెండవ విషయం. జీవితంలో మరెన్నడూ నేరాల జోలికి పోకు. హాయిగా జీవితం వెళ్ళబుచ్చు. నీకూ నీరజకూ నా శుభాకాంక్షలు" అంటూ ముగించాడు షాజహాన్ ఆ ఉత్తరాన్ని.

"నీద్వారా నేను షాజహాన్ నుపయోగపడుతున్నా నన్న అనుమానం నాకుంది. అయితే ఆ శంకరం షాజహాన్ ని చంపమని సలహాఇచ్చాడం టేమాత్రం కలవరపడి విషయం తెలుసుకోవాలనుకున్నాను..." అన్నాడు రవి. ఒక్క క్షణం ఆగి "నీరజా షాజహాన్ నాకంటె సమర్థుడో కాదో నాకు తెలియదు. కానీ అతను నాకు బాస్ గా ఉండతగ్గవాడు. నాలాంటి వాణ్ణెలా ఉపయోగించుకో వాలో అతనికి బాగా తెలుసు" అన్నాడు రవి.

"నీలాంటి వాణ్ణెలా ఉపయోగించుకోవాలో నాకు బాగా తెలుసు..." అంది నీరజ నవ్వి.

"అవున్లే షాజహాన్ వెళ్ళిపోయినా నా ఉద్యోగం మాత్రం మారలేదు. అప్పుడతని అనుచరుడిని. ఇప్పుడు నీ అనుచరుడిని..." అన్నాడు రవి.

అప్పుడే ఎవరో తలుపు తట్టారు. నీరజ వెళ్ళి తలుపు తీసింది.

నీరజ తండ్రి వీరభద్రం నవ్వుతూ లోపలకు వచ్చాడు.

-: ఐ పో యిం ది :-

# అజ్ఞాత శత్రువు

అజీజ్

"సార్జంట్!"

"ఎస్ సార్!" స్ప్రింగ్ డోర్స్ తోసుకుంటూ డేవిడ్ లోనికి వచ్చేడు.

రిస్టు వాచీ చూసుకున్నాను. సాయంత్రం ఐదు గంటలు!

"ఆరు గంటలకి జనతా పబ్లిషింగ్ హౌస్‌లో, జీవన జ్యోతి వార పత్రిక సంపాదకుడు అమృతరావు సన్మాన సభ వుంది. వెళ్ళాలి. అమృతరావుతో నాకు చిరకాల పరిచయం వుంది. వెళ్ళకుంటే బావుండదు. ఏదైనా ఎమర్జెన్సీ మెసేజ్ వస్తే రిసీవ్ చేసుకో!" అన్నాను లేస్తూ.

సాగంటే తలూపేడు.

టేబిల్ మీది క్యాప్ అందుకుని బైటికి నడిచేను.

మోటర్ బైక్ ఎక్కి బయలుదేరేను.

అమృతరావు పత్రికా సంపాదకుడే కాదు. మంచి రచయితకూడా! అతని సాహిత్య జీవనం పధ్నాలుగేళ్ళ ప్రాయంలోనే ప్రారంభమయిందిట.

అతని కలం ఎప్పుడూ పేదప్రజల సాధక బాధకాలని చాటి చెప్పడానికే తాపత్రయపడుతుంది. పత్రికా ప్రపంచంలోనే కాక అతనికి చిత్ర పరిశ్రమలోనూ ప్రవేశముంది.

అతను రాసిన నాలుగైదు కథలు సినిమాలుగా రూపొంది, ఘన విజయాలు సాధించేయి.

మిగతా రచయితలకు భిన్నంగా తనదంటూ ఒక శైలీ, బాణీ ఏర్పరచుకున్న అమృతరావు, తెలుగునాట పిన్నా పెద్దా అనే భేదం లేకుండా లక్షలాది అభిమానుల్ని సంపాదించేడు. దానికి తోడు శత్రువుల్నీ కూడ గట్టుకున్నాడు.

అతని రచనల్లో తమ నిజరూపాలు బట్టబయలైనట్టు తెలిసిన పెద్దమనుషులెందరో అతనికి అజ్ఞాత శత్రువులై కూర్చున్నారు.

ఏది ఏమైనా, అమృతరావు అమృత హృదయుడు. స్నేహశీలి. సౌమ్య స్వభావి. ఇంతాజేసి అతని వయసు నలభై లోపే! ఇంత పేరు సంపాదించీ, అపార ధనం ఆర్జించీ అతనింకా పెళ్ళి చేసుకోలేదంటే ఎవ్వరైనా ముక్కుమీద వేలు వేసుకోక మానరు!

అతను బ్రహ్మచారిగా ఉండిపోడాని కారణం. యవ్వనంలో అగ్రకులానికి చెందిన ఓ అమ్మాయిని

ప్రేమించేడనీ, ఆ అమ్మాయి తాలూకు పెద్దలు కుల గోత్రాల రూపంలో వారిమధ్య కందుగోడలుగా మారి ఆమెని మరొకరికిచ్చి పెళ్ళిచేసేరనీ, దాంతో అతనిమనసు విరిగి ఆజన్మ బ్రహ్మచారిగా ఉండిపోయేడనీ, ఓ కథ ప్రచారంలో ఉంది.

మొత్తానికి, సాహిత్య కర్షకుడిగా అతనీ రంగంలో పాతికేళ్ళు పూర్తిచేసుకున్న సందర్భాన అతని అభిమానులూ, పబ్లిషర్లూ కలిసి ఈరోజు ఘనంగా సన్మానం ఏర్పాటు చేసేరు.

అమృతరావు నవలలు ప్రచురించే జనతా పబ్లిషింగ్ హాల్లో సన్మాన సభ వుంది. కళ్యాణ చెట్టీ, ముత్తులింగం అనే పబ్లిషర్లు ఆ సంస్థ యజమానులు. అమృతరావుకి వాళ్ళిద్దరూ ప్రాణమిత్రులు కూడా....

ఇల్లు సమీపించేసరికి ఆలోచనలు చెదిరిపోయేయి.

గబగబ యూనిఫాం విడిచి బాత్‌రూంలో దూరేను. స్నానం అదీ అయ్యేక, బీరువాలోంచి నల్ల పాంటూ తెల్ల షర్టూ తీసి తొడుక్కున్నాను. నవంబర్ నెలగనక చీకటి పడగానే చిరు చలి ప్రారంభమౌతోంది. వెచ్చగా వుంటుందని తోలు జర్కిన్ తీసి తొడుక్కున్నాను.

ఇంకా పదిహేను నిమిషాలే వుంది టైం!

గబగబ ఇంట్లోంచి బైటపడి, మోటర్ బైక్ ఎక్కి పాండీబజార్ వైపు పోనిచ్చేను. జనతా పబ్లిషింగ్ హౌస్ అక్కడే ఉంది.

## 2

పది నిమిషాల్లో జనతా పబ్లిషింగ్ హౌస్ చేరుకున్నాను.

ఆవరణలో అనేక వాహనాలు ఆగివున్నాయి. బైక్ ఆపి దిగుతుండగా, ఓ ఫియట్ కారు వచ్చి ఆగింది నా పక్కన.

అందులోంచి దిగుతున్న వ్యక్తిని చూచి—"హలో!" అన్నాను.

"హలో, ఇన్‌స్పెక్టర్! హౌ ఆర్ యూ?" అన్నాడతను చెయ్యి చాపి.

"క్వైట్, వెల్!"

ఆయన ఎవ్వరో కాదు. ప్రైవేట్ డిటెక్టివ్ ఉదయ కుమార్! జటిలమైన అనేక హత్య కేసులు పరిష్కరించి బాగా పేరు సంపాదించేడు. అప్పుడప్పుడూ స్థానిక పోలీసులు కూడా ఆయన సహాయ సహకారాలు అర్థిస్తూంటారు.

"సభకు వచ్చారా?" అడిగేడు ఉదయకుమార్ నవ్వుతూ.

తలూపి, "పదండి. టైం అవుతోంది," అన్నాను హాలువైపు నడుస్తూ.

అప్పుడే మరో కార్లోంచి దిగుతున్న వ్యక్తిని చూసి కాస్త ఆశ్చర్యపోయేను. అతను మాజీ ఎం. ఎల్. ఏ. విష్ణుపాదం! అమృతరావుమీద అతనికున్న కక్ష జగద్విదితం!

ఎమ్. ఎల్. ఏ. పదవిలో అతను చేసిన అనేక అక్రమాలని తన పత్రికలద్వారా, రచనలద్వారా అమృతరావు చాటిచెప్పడంవల్లే ప్రజల కళ్లు తెరుచుకుని, గత ఎన్నికల్లో అతను ఘోర పరాజయాన్ని చవిచూడవలసి వచ్చింది.

అటువంటి బద్ధశత్రువైన అమృతరావు సన్మాన సభకు అతను రావడం విడ్డూరమే మరి!

ప్రవేశ ద్వారంలో, ఆత్మప్రకాశ్ నిల్చుని అతిథులకు స్వాగతం పలుకుతున్నాడు. అతను అమృతరావు తాలూకు పత్రికల సబ్ ఎడిటర్!

మమ్మల్ని చూసి—"సుస్వాగతం సార్! ఇంత క్రితమే రావుగారు మిమ్మల్ని అడిగేరు," అన్నాడు నవ్వుతూ.

హాలంతా అతిధులతో నిండివుంది అప్పటికే.

విశాలమైన ఆ హాలు నలువైపులా ఎత్తైన బుక్ షెల్ఫులుండేవి. ఈ రోజు అతిధులు కూర్చోడానికి ఇబ్బంది కలుగుతుందని కుడివైపు గోడకానించి ఉండే షెల్ఫును ఎడంవైపున్న గోడదగ్గరి షెల్ఫు కానించి ఉంచేరు. వాటి కెదురుగా ఎత్తైనబల్లలు పేర్చి, స్టేజి తయారుజేసేరు.

స్టేజి మధ్య మైక్. దాని వెనుక నాలుగైదు కుర్చీలు. మధ్యలో అమృతరావూ, అతని కిరుపక్కలా సినీపరిశ్రమకు చెందిన ముఖ్య అతిధీ, పత్రికా జర్నలిస్టులూ ఆసీనులై ఉన్నారు.

హాలంతా అర్ధచంద్రాకృతిలో కుర్చీలు పేర్చి ఉన్నాయి. నేను రావడం ఆలస్యమైంది. దాదాపు కుర్చీలన్నీ అతిధులతో నిండిపోయేయి. చాలామంది గోడ కానించి ఉన్న బుక్ షెల్ఫులదగ్గరే నిల్చుని చూస్తున్నారు స్టేజివైపు.

కూర్చున్నవారిలో అక్కడక్కడా ఒకటీ అరా కుర్చీ ఖాళీ ఉన్నా, ఈ జన సమూహాన్ని దాటుకుంటూ అక్కడివరకూ చేరుకోవడం చాలా కష్టం.

"రండి, ఆ చివర ఖాళీ కుర్చీలని ఆక్రమిద్దాం" అన్నాడు డిటెక్టివ్ ఉదయకుమార్.

"మీరు వెళ్ళి కూర్చోండి. నేనిక్కడే నిల్చుని చూస్తాను. స్టేజి క్లియర్‌గా కనిపిస్తోంది" అన్నాను.

ఆయన జన సమూహాన్ని చీల్చుకుంటూ అటు వెళ్ళేడు.

అతిథులింకా వస్తూనే ఉన్నారు లోనికి. కొద్ది సేపట్లోనే హాలంతా ఇసుక వేస్తే రాలని జనంతో నిండిపోయింది.

ఆరుంబావుకి సభ ప్రారంభమౌతుంది.

ముందు పబ్లిషర్ ముత్తులింగం స్టేజిమీదికి వచ్చి అమృతరావు గుణగణాలనీ, అతనితో తమకున్న వ్యక్తిగత పరిచయాన్ని ఉటంకిస్తూ ప్రసంగించి, నిలువెత్తు పూల హారంతో, అతని కంఠాన్ని అలంకరించేడు.

తరవాత సభాధ్యక్షుడైన సినీ ప్రముఖుడు లేచి, అమృతరావు రచనా వైవిధ్యాన్నీ, ఆ రచనలద్వారా ఆయన సమాజానికందించే సందేశాలనీ ఉదహరిస్తూ కాసేపు ప్రసంగించి, పట్టు శాలువతో రచయితను సత్కరించేడు.

ఆహుతుల కరతాళ ధ్వనులతో హాలు మారుమోగింది.

ముత్తులింగం తప్ప, జనతా పబ్లిషింగ్ హౌస్ రెండవ యజమాని కళ్యాణచెట్టి స్టేజిదగ్గర కనిపించకపోవడం నాకాశ్చర్యాన్ని కలిగించింది.

చప్పట్లు సన్నగిల్లేక అమృతరావు హుందాగా మైక్ దగ్గరికి వచ్చి కంఠం సవరించుకున్నాడు.

"గౌరవనీయులైన సభాధ్యక్షులకూ, మిత్రులకూ, శ్రేయోభిలాషులకూ, అభిమానులకూ నా వందనాలు!

ఈ రోజు నా జీవితంలో అత్యంత ఆనందదాయక మైన రోజని చెప్పవచ్చు. నా జీవితంలో మరవలేని సంఘటనలెన్నో జరిగినా, ఈ రోజుకు ఓ ప్రాధాన్యత ఉంది. అదే, నా సాహిత్యజీవనం పాతికేళ్ళు పూర్తి చేసుకోవడం.

ప్రతి మనిషీ, బాల్యంలోనే తన భవిష్యత్తుకంటూ కొన్ని లక్ష్యాలని ఏర్పరచుకుంటాడు. కొందరికి అదృష్టమూ, అవకాశమూ తోడై ఆ లక్ష్యాలను దిగ్విజయం గావిస్తే, మరికొందరికి..." అమృతరావు వాక్యం ఇంకా పూర్తికాలేదు.

"ఢాం!" మనే శబ్దంతో హాలు గింగురుమంది.

అంతవరకూ మైక్ ముందు నిల్చుని ప్రసంగిస్తున్న అమృతరావు చెయ్యి ఛాతీవైపు వెళ్ళింది. అతను వేసు కున్న లాల్చీమీద, గుండెదగ్గిర ఉబుకుతున్న రక్తాన్ని చూడగానే దిగ్భ్రాంతితో నా నోరు తెరుచుకుంది!

అమృతరావు చూస్తూ, చూస్తూనే అమాంతంగా స్టేజి మీద పడిపోయేడు, బోర్లా! క్షణంపాటు హాల్లో ఉన్న ప్రేక్షకులకి ఏం జరిగిందో, ఏం జరుగుతుందో ఓ పట్టాన అర్థంకాలేదు.

అమృతరావు దబ్బున క్రిందపడ్డాక గానీ జరిగిందేమిటో బోధపడలేదు అందరికీ.

# 3

హత్య! నిండు సభలో, దాదాపు రెండువందలమంది చూస్తుండగా ఒక ప్రముఖ వ్యక్తి హత్య!

హాల్లో భయోత్పాతం, కోలాహలం చెలరేగింది. ఒక

ర్నొకరు తోసుకుంటూ స్టేజి దగ్గరికి పరిగెత్తసాగేరు.

మెరుపులా ప్రవేశద్వారాన్ని సమీపించి, తలుపులు మూసేశాను. ఈ సమయంలో ఎవ్వరినీ బైటికెళ్ళనివ్వకూడదు. అప్పుడే, డిటెక్టివ్ ఉదయకుమార్ జనంలోంచి నా దగ్గరికి పరిగెత్తుకొచ్చేడు.

"గుడ్ ఇన్‌స్పెక్టర్! లోపలున్నవారిలోనే హంతకుడున్నాడు. ఎవ్వర్నీ బైటికెళ్ళనివ్వకూడదు," అన్నాడు రొప్పుతూ.

"మీరిక్కడ నిల్చోండి. నేను అమృతరావు పరిస్థితి చూస్తాను," అంటూ స్టేజివైపు పరిగెత్తేను.

స్టేజిమధ్య అమృతరావు నిశ్చలంగా పడున్నాడు. కళ్ళూ, నోరూ సగం తెరిచి ఉన్నాయి. కుడిచెయ్యి ఛాతీ కింద మడిచి ఉంది.

అతను మరణించేడు!

అప్పుడు గమనించేను, అంతవరకూ కనిపించని కళ్యాణ చెట్టి మిగతా జనంతోబాటు శవందగ్గిర ఉండటం!

అతిథులు ఎవ్వరికి తోచినట్టు వారు మాట్లాడుకుంటున్నారు.

"శబ్దం వెనకవరసలోంచి వచ్చింది!"

"మీరు చూసేరా, హంతకుణ్ణి?"

"లేదు! శబ్దం ఏవైపునించి వచ్చిందో మాత్రం తెలుసు!"

"ఏవైపునించి వచ్చింది?"

"గోడవారగా నిల్చొబెట్టారే, ఆ బుక్‌షెల్ఫ్‌ల దగ్గర్నుంచి!"

వారి మాటలు వింటూ, తలెత్తి బుక్ షెల్ఫ్‌లవైపు చూసేను. వెనక వరసలో గోడవారగా అనించివున్నాయి అవి. రెండూ పుస్తకాలతో నిండి ఉన్నాయి.

"ఈ భవనానికి వెనకవైపున ఏదైనా ద్వారం ఉందా?" అడిగేను.

"ఉందండీ! ఆ పక్క గదిలోంచి లోనికెళ్తే కనిపిస్తుంది."

చటుక్కున లేచి అటు నడిచేను. సింహద్వారం దగ్గర డిటెక్టివ్ కాపలా ఉన్నాడు. హంతకుడికి వెనక ద్వారం విషయం తెలిసివుంటే తప్పక ఆ దార్న జారుకోడానికి ప్రయత్నిస్తాడు.

గబగబ ఆ గదిలో అడుగుపెట్టేను. ఆ గదిలోంచి మరో గదిలోకెళ్ళడానికి తలుపుంది. 'బుక్ బైండింగ్ రూం' అనే బోర్డు వేళాడుతోంది.

తలుపుగుండా గదిలో అడుగుపెట్టి నివ్వెరబోయేను. నా అంచనా తప్పలేదు. చిరు చీకట్లో ఓ ఆకారం ఆ గదిలోంచి బైటకెళ్ళే తలుపువైపు వెళుతోంది. నా అడుగుల శబ్దం విని గిరుక్కున వెనుదిరిగింది.

మెరుపులా గోడ తడిమి లైటు వెలిగించేను.

మగాడు కాదు! ఆడది!!

ముప్పై, ముప్ఫై అయిదేళ్ళుంటాయామెకి. పచ్చని మేలి బంగారాన్ని జ్ఞప్తికి తెచ్చే నిండైన ఒళ్ళు, యవ్వన దశ దాటినా, మొహంలో విపరీతమైన ఆకర్షణ. చెంపలకి లేత గులాబీ రంగు. పెదాలకి లిప్‌స్టిక్. అందంగా వేసుకున్న జుత్తుముడి. నుదుట ఎర్రని తిలకం. చేతిలో హాండ్ బాగ్.

నన్ను చూడగానే ఆమెలో ఎటువంటి ఖంగారూ

కనిపించకపోగా, కళ్ళల్లో నీటి పొర చూసి నివ్వెర బోయేను. ఉబికి వస్తున్న దుఃఖాన్ని మునిపంటితో తొక్కిపెడుతున్నట్టు ఆమె ముక్కు పుటాలు అదురుతున్నాయి.

"ఎవ్వరు మీరు? ఈ దారిన ఎక్కడికెళ్తున్నారు?" అడిగేను.

అతి కష్టంమీద ఆమె పెదాలు విచ్చుకున్నాయి. "నేనిక్కడ ఒక్క క్షణం వుండలేను. సింహద్వారం మూసివుంది. అందుకే ఈ దారిన పోతున్నాను" అంది.

"ఇది హత్యా ప్రదేశం! లోపలున్న వాళ్ళల్లోనే ఎవ్వరో ఆ హత్య చేశారని మా నమ్మకం! అనుమతి లేకుండా ఇలా దొంగచాటుగా వెళ్ళిపోడానికి ప్రయత్నించడం అనుమానానికి దారితీస్తుంది మరి!"

ఆమె నిట్టూర్చింది. "నిజమే! నా పరిస్థితి మిగతా వారికి భిన్నంగా వుంది. తన కళ్ళు గప్పి నేనీ సభకి వచ్చేనని నా భర్తకి తెలిస్తే మా మధ్య నానా గొడవలూ తలెత్తుతాయి.

అమృతరావుగారితో నాకు వ్యక్తిగత పరిచయం వుంది. ఆయన లక్షలాది అభిమానుల్లో నేనూ ఒకర్తిని. నా భర్తకి అది ఇష్టంలేదు. నేనతన్ని కలుసుకోవద్దని అనేక ఆంక్షలు పెట్టేరు.

ఐనా, నేను అమృతరావు స్నేహాన్ని వదులుకోలేక అడపాదడపా అతన్ని కలుసుకుంటున్నాను. అంతటి నా అభిమానుణ్ని ఈరోజు సన్మానిస్తున్నారని తెలిసి, ఆ వేడుకను కళ్ళారా చూడాలని వచ్చేను.

ఇంతలో ఈ ఘోరం జరిగిపోయింది. ఈ సభలో నేనూ పాల్గొన్నట్టు నా భర్తకి తెలియడం నాకిష్టంలేదు. అందుకే ఇలా వెళ్ళిపోతున్నాను."

"మీ భర్త ఎవ్వరు?"

"అపోలో థియేటర్ యజమాని, వేణుగోపాల రావు!"

"మీ పేరు తెలుసుకోవచ్చా?"

"మందహాసిని!"

ఆమెని చూస్తోంటే, హత్య చెయ్యగలిగే వ్యక్తిలా కనిపించడంలేదు. పైగా, స్టేజి సమీపంలో వున్న మొదటి వరసలోనే ఆమె కూర్చున్నట్టు జ్ఞాపకం! పిస్తోలు శబ్దం వెనక వరసనించి వచ్చింది. తన ఇబ్బం దుల్ని ఇంత స్పష్టంగా చెప్తున్న ఆమెను ఆపడం బావుండదు.

దేనికైనా మంచిదని—"మీ హాండ్ బాగ్ ఓమారు చెక్ చెయ్యాలనుకుంటున్నాను. ఆ తరవాత మీరు వెళ్ళి పోవచ్చు" అన్నాను చెయ్యి చాపుతూ.

ఆమె సంకోచించకుండా బ్యాగ్ అందించింది.

తెరిచి చూసేను. హాండ్ కర్చీఫ్, చిన్న మనీపర్స్, బాల్ పెన్, లిప్ స్టిక్, పాకెట్ మిర్రర్ తప్ప మరేం లేవు.

బ్యాగ్ తిరిగి ఆమెకిస్తూ—"మీ చిరునామా ఇచ్చి వెళ్ళండి." అన్నాను.

ఆమె బ్యాగ్ లోంచి కాగితం, కలం తీసి, ఎడ్రస్ రాసి అందించింది.

"ఆల్ రైట్! మీరిక వెళ్ళవచ్చు."

'థాంక్స్' చెబుతూ తలుపు తెరుచుకుని వెళ్ళి పోయింది.

గడియవేసి హాల్లోకి నడిచేను.

# 4

డిటెక్టివ్ ఉదయకుమార్ ఇంకా తలుపు దగ్గరే నిల్చుని, ఎక్స్‌రే కళ్ళతో అందర్నీ పరిశీలిస్తున్నాడు.

వెంటనే స్థానిక పోలీసులకి ఫోన్ చేసి పిలిపించాలి. వాది క్రయిం బ్రాంచ్ విభాగం. ఏ రేంజ్‌లో ఏ నేరం జరిగినా, ఆ రేంజి తాలూకు లోకల్ పోలీసులే మొదట్లు కేసు నమోదు చేసి, దర్యాప్తు ప్రారంభిస్తారు. ఆ కేసు వాళ్ళకి దుస్సాధ్యమైనప్పుడే మాకప్పగించడం జరుగుతుంది.

హత్య నా సమక్షంలో జరిగింది గనక, స్థానిక పోలీసులకు నేను వ్యక్తిగతంగా సహాయపడటం ధర్మం!

డిటెక్టివ్ ఉదయకుమార్ని సమీపించి—"మీరు వెళ్ళి లోకల్ స్టేషన్‌కి ఫోన్ చెయ్యండి. నేనిక్కడే నిల్చుంటాను" అన్నాను.

"ఫోన్ ఎప్పుడో చేశారు. వాళ్ళిపాటికి వస్తూంటారు" అన్నాడాయన.

సిగరెట్ అంటించాలని జేబులోంచి సిగరెట్ కేస్ తీసేను. దాన్ని తెరుస్తుండగా చేతిలోంచి జారి, వెనక వరసలో వున్న కుర్చీలకింద పడింది. రెండు మూడు సిగరెట్లు దొర్లుకుంటూ కిందికెళ్ళాయి.

వంగి వాటిని ఏరుకోబోయిన నా దృష్టి హఠాత్తుగా నాలుగో కుర్చీకింద కనిపిస్తున్న వస్తువు మీద పడగానే ఉలిక్కిపడ్డాను. అది పిస్తోలు!

లైటు కాంతిలో నిగనిగ మెరుస్తున్న పిస్తోలు!!

"ఉదయకుమార్ గారూ! ఇలారండి!" అన్నాను వెంటనే.

ఆయనతోబాటు మిగతా జనంకూడా అక్కడ పోగయ్యేరు. కుర్చీలు పక్కకి జరిపేను. కింద పడున్న పిస్తోలు చూడగానే అందరూ ఒకరి మొహాలొకరు చూసుకోసాగేరు.

హాండ్ కర్చీఫ్ దానిమీద వేసి, జాగ్రత్తగా అందుకున్నాను. అది .32 కాలిబర్ పిస్తోలు! విరిచి చూసేను. ఆరు గుళ్ళు ఉండవలసిన ఛేంబర్ లో ఐదే వున్నాయి!

అదే క్షణంలో ఓ నడివయసావిడ గుంపులోంచి గబగబ నన్ను సమీపించింది. "హంతకుడెవరో నాకు తెలుసండి! అదుగో, అతనే! అతను పిస్తోలుతో కాలుస్తుండగా నా కళ్ళారా చూసేను" అంది వేలితో చూపిస్తూ.

నాతోబాటు అందరూ ఆ వ్యక్తివైపు చూసి నివ్వెరబోయేరు. అతను ఎవ్వరో కాదు.

అమృతరావు సబ్ ఎడిటర్ ఆత్మప్రకాశ్!

"చూస్తారేం? పట్టుకోండి. పారిపోతాడు" అంటోందామె.

అంత పెద్ద నేరం నెత్తినపడుతున్నా, ఆత్మప్రకాశ్ లో ఎటువంటి మార్పు లేకపోగా, నింపాదిగా అడుగులు వేస్తూ నన్ను సమీపించేడు.

"రాజారెడ్డిగారూ! గురుతుల్యులైన అమృతరావు గార్ని హత్యచేసే అవసరం నాకేమిటి? నేను నిరుద్యోగిగా అష్టకష్టాలు పడుతున్న రోజుల్లో తన దగ్గర

ఉద్యోగం ఇచ్చి, నా జీవనోపాధికి మార్గదర్శకుడైన ఆ మహనీయుణ్ని చంపేంతటి విశ్వాస ఘాతకుణ్ణీ, కిరాతకుణ్ణీ కాను నేను.

బహుశా, ఈవిడకి వేరే విషయంలో అపార్థం జరిగి వుంటుంది'' అంటూ జేబులోంచి, సిగరెట్ కేస్ ప్రమాణంలో వున్న నల్లని కెమెరా తీశాడు ఆత్మప్రకాశ్.

"నేను వెనకవరసలో నిల్చుని, ఈ కెమెరాతో అమృతరావుగారి ఫోటోలు తీస్తున్నాను, మా పత్రికల్లో ప్రచురించడానికి. ఫోటోలు తియ్యమని ఆయనే నన్ను ఆదేశించారు. నా చేతిలో ఈ కెమెరా చూసి, ఈవిడ పిస్తోలు అని భ్రమపడుంటారు!''

అందరూ నిట్టూర్చారు ఒక్కసారి! అంతవరకూ హంతకుడు పట్టుపడ్డాడు కదా అని ఆనందించిన జన సమూహం అతనిచ్చిన సంజాయిషీతో నిరుత్సాహపడింది.

ఆ సంజాయిషీ సమంజసంగానే తోస్తోంది. పైగా అతనికి అమృతరావుని చంపే అవసరం ఏమీ కనిపించడం లేదు.

సాలోచనగా తలూపుతూ, చేతిలోవున్న పిస్తోలు అటూ ఇటూ తిప్పి చూడసాగేను. నా దృష్టి పిడిమీద నిలిచిపోయింది!

కొత్తగా ఏదైనా స్టీలుగిన్నె కొన్నప్పుడు షాపువాళ్ళు, దానిమీద ఖాతాదారు పేరు చెక్కియిస్తారు, ఉచితంగా. అలా చెక్కివుంది పేరు పిస్తోలు పిడిమీద!

"విష్ణుపాదం!"

ఆ పేరు చూడగానే సడన్ గా జ్ఞాపకం వచ్చింది, నేను లోనికి వస్తుండగా మాజీ ఎమ్.ఎల్.ఏ. విష్ణుపాదం కూడా కారు దిగుతుండటం!

ఉదయకుమార్‌కు చూపేను ఆ పేరు.

"కేసు తేలిపోయింది ఇన్‌స్పెక్టర్! విష్ణుపాదం ఇక్కడికి రావడమే ఏదో అవాంతరానికి మూలసంకేతం!" అన్నాడాయన మెరిసే కళ్ళతో.

ఇద్దరం చుట్టూ కలయజూశాం. విష్ణుపాదం కనిపించేడు.

"ఒకసారిలా రండి!" అన్నాను అతన్ని సంబోధించి.

అతని కనులు ముడివడ్డాయి. జనాన్ని తప్పుకుంటూ వచ్చేడు మా దగ్గరికి.

కర్చీఫ్‌లో వున్న పిస్తోలు పిడి చూపేను.

పక్కలో పిడుగుపడ్డట్లు అదిరిపడ్డాడు.

"ఇది మీ పిస్తోలేనా?" అడిగేను.

"ఔను! నాదే!"

"అమృతరావు దీనితోనే చంపబడ్డాడని రూఢి అయింది. అతని గుండెలో దిగిన గుండునూ, ఈ పిస్తోలునూ నిపుణులచేత పరీక్ష జేపిస్తే ఆ విషయం స్పష్టమౌతుంది. ఇది మీ దేనని మీరే ఒప్పుకుంటున్నారు గనుక, అమృతరావుని చంపింది కూడా మీరే!" అన్నాను గంభీరంగా.

హాల్లో సూది పడితే వినిపించే నిశ్శబ్దం!

"ఇన్‌స్పెక్టర్ గారూ! నా మాట నమ్మండి. నాకేం తెలీదు. నేనిక్కడికి పిస్తోలు తీసుకరాలేదు. ఇంట్లో వుండవలసిన పిస్తోలు ఇక్కడికెలా వచ్చిందో ఊహించలేకుండా వున్నాను" అన్నాడు విష్ణుపాదం చమట్లు కక్కుతూ.

చిన్నగా నవ్వేను. "విష్ణుపాదంగారూ! అమృతరావు మీద మీకున్న కక్ష జగద్విదితం. శాసన సభ్యుడిగా మీరు చేసిన నిర్వాకాలు తన పత్రికద్వారా, రచనల

ద్వారా ఆయన నిర్భయంగా చాటడంవల్లే, ప్రజలకు మీ నిజరూపం వెల్లడై, గత ఎన్నికల్లో డిపాజిట్ కూడా దక్కలేదు మీకు.

ఇంత వైరం వున్న ఆయన సన్మానసభలో మీరు వేం చేయడమేమిటి? అక్షరాలా మీ ఆయుధమైన ఈ పిస్తోలు ఇక్కడ పడుండటమేమిటి? మీ మాటలు ఎవ్వరు నమ్మేది?''

విష్ణుపాదం నిట్టూర్చేడు. ''మీరు చెప్పింది నిజమే! అమృతరావుమీద నేను పగబట్టిన సంగతీ వాస్తవమే! కాని, అది ఒకనాటి విషయం! ఏనాడైతే నేను ఎన్నికల్లో ప్రజలచేత తిరస్కరించబడ్డానో, ఆ తరువాత నాలో మార్పు వచ్చింది.

ఆ రోజుల్లో నేను చేసిన పనులకు ఎంతో పశ్చాత్తాపం చెందేను. నాకు కనువిప్పు కలిగించిన అమృతరావుపట్ల రాగద్వేషాలు మాని గౌరవాభిమానాలు పెంచుకున్నాను మేమిద్దరం స్నేహితులమయ్యాం!

ఈ రోజు నా స్నేహితుడి సన్మానసభకు వచ్చానే గానీ అతన్నేదో చెయ్యాలని రాలేదు. హత్య చెయ్యాలనుకుంటే, ఈ నిండుసభ తప్ప మరోచోటు దొరకలేదా నాకు? హత్య నేనే చేసివుంటే పేరు చెక్కివున్న నా పిస్తోలు ఇలా దేనికి పారేస్తాను? ఆలోచించండి ఇన్‌స్పెక్టర్!''

నా బుర్ర చురుగ్గా పనిచేస్తోంది. అతను చెప్పిందాంట్లో నిజం లేకపోలేదు. హత్య అతనే చేసివుంటే పిస్తోలు అలా దేనికి పారేస్తాడు? అదీ స్పష్టంగా పేరు చెక్కివున్న పిస్తోలు!

"ఐతే, ఎవ్వరో మీ ఇంట్లోంచి దీన్ని దొంగిలించి, హత్యచేసి ఇక్కడ పారేశారంటారా?" అడిగేను.

"ముమ్మాటికీ అంతే!" అన్నాడు విష్ణుపాదం ఖచ్చితంగా.

"మీ ఇంట్లో మీ పిస్తోలు ఎక్కడ వుంటుందో, అది దొంగిలించడానికి అవకాశమున్న వ్యక్తులు...ఐ మీన్ మీ ఇంటికి వచ్చేపోయే స్నేహితులు ఇంత మందిలో ఎవరెవరో చెప్పగలరా?" అడిగేను.

విష్ణుపాదం ఓ మారు అందర్నీ కలయచూసి "వీరిలో కళ్యాణచెట్టీ, ముత్తులింగం, ఆత్మప్రకాశ్ లు తప్ప తరచూ మా ఇంటికి వచ్చే స్నేహితులెవ్వరూ లేరు. వీళ్ళలోనే నా పిస్తోలు దొంగిలించిన వారున్నారని నా అర్థంకాదు. మీ ప్రశ్నకి నా సమాధానం ఇది!" అన్నాడు కర్ర విరక్కుండా పాముని చంపినట్టు.

వెంటనే అందుకున్నాడు ఆత్మప్రకాశ్. "కళ్యాణ చెట్టీ, ముత్తులింగంగార్ల సంగతేలావున్నా, నేను మాత్రం అమృతరావుగారివెంట తప్ప, విడిగా ఎన్నడూ వీరి ఇంటికెళ్ళలేదు. ఏమంటారు విష్ణుపాదంగారూ?"

విష్ణుపాదం తలూపేడు.

కర్చీఫ్ లో పిస్తోలు చుట్టి నా జర్కిన్ జేబులో వేసుకుంటూ ఆత్మప్రకాశ్ తో ఏదో అనబోయేను.

అదే సమయంలో స్థానికపోలీస్ సబిన్స్పెక్టర్ తన బలగంతో వచ్చేశాడక్కడికి. నన్ను చూడగానే సెల్యూట్ కొట్టేడు. అతన్ని పక్కకి తీసికెళ్ళి జరిగిందంతా పూసగుచ్చినట్టు వివరించి, ఏం జెయ్యాలో సూచనలిచ్చేను.

పోలీస్ ఫోటోగ్రాఫర్స్, ఫింగర్ ప్రింట్ ఎక్స్‌పర్ట్స్ చకచక పని ప్రారంభించేరు. శవం రిగర్ మార్టిస్ రికార్డ్ చేసుకున్నాడు డాక్టర్. అంతా అయ్యాక శవాన్ని అంబులెన్స్‌లో పోస్ట్‌మార్టంకు తరలించేరు.

తలుపు దగ్గర ఇద్దరు కానిస్టేబుళ్ళని నియమించాం.

"జంటిల్‌మన్! ఇక్కడ ప్రాథమిక విచారణ పూర్తయ్యేవరకూ ఎవ్వరూ బైటికెళ్ళకూడదు. ఈవిధంగా మీకు ఇబ్బంది కలిగిస్తున్నందుకు మన్నించాలి!" అన్నాను.

# 5

"మిస్టర్ విష్ణుపాదం! మీరూ, కళ్యాణచెట్టిగారూ, ముత్తులింగంగారూ, ఆత్మప్రకాశ్ దయచేసి నాతో ఆఫీస్‌గదిలోకి రండి" అన్నాను హాలుపక్కనున్న ఆఫీస్ వైపు నడుస్తూ.

ఆ నలుగురితోబాటు స్థానిక సబిన్‌స్పెక్టర్, డిటెక్టివ్ ఉదయకుమార్లు కూడా నా వెంట ఆఫీస్‌లో ప్రవేశించేరు.

భవనం తలుపులన్నీ మూసేయడంవల్లా, నాలో కలుగుతున్న ఎక్సైట్‌మెంట్‌వల్లా, తొడుక్కున్న జర్కిన్‌తోనూ ఉక్కబోస్తున్నట్టు తోస్తోంది. చల్లగా ఉంటుందని, జర్కిన్ విప్పి తెరిచి ఉన్న ఆఫీసు గది తలుపు రెక్కకి వేళాడదీసేను.

"ప్లీజ్, టేక్ యువర్ సీట్స్!" అంటూ ఓ కుర్చీలో చతికిలబడ్డాను.

అంతా కూర్చున్నారు.

కళ్యాణచెట్టివైపు తిరిగి "చెట్టిగారూ! స్టేజిమీద అమృతరావును సన్మానిస్తున్న సందర్భంలో మీరక్కడ

కనిపించలేదు. నిజానికి మీరక్కడ ఉండవలసింది! ఏమంటారు?" అడిగేను.

చెట్టి తడుముకోకుండా జవాబిచ్చేడు. "సన్మానం తరవాత ఆహుతులకు తేనీటివిందుకూడా ఏర్పాటుచేశాం. ఆ అరేంజ్ మెంట్స్ చూసుకోడంలో బిజీగా ఉన్నందుకల్ల నేనక్కడ కనిపించలేదు. పిస్తోలు పేలిన శబ్దం విని పరిగెత్తుకొచ్చేను."

"ఆల్ రైట్, ముత్తులింగంగారూ! మీరు స్టేజిమీద అమృతరావు పక్కనే ఉన్నారు కదా, అక్కణ్ణించి హాల్లో ఉన్న ప్రతి వ్యక్తి కనిపిస్తాడు కదా, పిస్తోలు ఎవ్వరు పేల్చారో చూచాయగానైనా చూడలేదా మీరు?"

"అంత హఠాత్తుగా అటువంటి సంఘటన జరుగుతుందని ఎవ్వరు కలగన్నారు? పిస్తోలు శబ్దం వెనకవరసలోంచే వచ్చినట్టు లీలగా తోచింది నాకు" అన్నాడు ముత్తులింగం.

అతని జవాబుతో మెరుపులా ఓ ఆలోచన తట్టింది నాకు. ప్రతి వ్యక్తీ పిస్తోలు శబ్దం వెనక వరసనించి వచ్చిందని చెబుతున్నాడు. వెనకవరస దగ్గరే ఉన్నాయి రెండు బుక్ షెల్ఫులు. ఆ రెంటిమధ్యా కొద్ది ఖాళీస్థలం ఉంది.

హంతకుడు ఆ సందులోనే నక్కి, పుస్తకాలమధ్య నించి షూట్ చేసేడా? అందుకే అతన్ని ఎవ్వరూ చూడలేకపోయేరా? హత్య జరిగేక హాల్లో కోలాహలం ప్రారంభమయ్యేక, హంతకుడు బుక్ షెల్ఫుల మధ్యనించి బైటపడి ఏమీ ఎరగనట్టు తిరిగి జనంలో కలిసిపోయి ఉంటాడు...

నా ఆలోచనాస్రవంతిని తుంచివేస్తూ ఆత్మప్రకాశ్ కంఠం వినిపించింది. "ఇన్‌స్పెక్టర్ గారూ! మీతో ఓ ముఖ్య విషయం మాట్లాడాలి!"

తలెత్తేను.

అతని కళ్ళల్లో చిన్న మెరుపు!

"రండి బైటికి!" అంటూ లేచి, అతన్ని వెంటబెట్టుకుని బైటికి నడిచేను.

సబిన్‌స్పెక్టర్ కూడా వెనకే వచ్చేడు అతనేం చెబుతాడో విందామని.

"చెప్పండి, ఏమిటి?" అడిగేను కుతూహలంగా.

ఆత్మప్రకాశ్ నా దగ్గిరికి జరిగి "ఈ హత్యకీ, నేను చెప్పబోయే విషయానికీ ఎంతవరకూ సంబంధముందో మీరే నిర్ణయించాలి. వారంరోజుల క్రితం వెనకా ముందూ ఆలోచించకుండా అమృతరావుగారు ఓ వీలునామా రాసేరు," అన్నాడు.

"వీలునామా రాశారా? నాకు తెలిసి ఆయనకు వారసులంటూ ఎవ్వరూ లేరే? ఎవ్వరి పేర్న రాసేరు?"

"కల్యాణచెట్టీ, ముత్తులింగం పేర్న!"

ఆశ్చర్యంతో నోరు తెరిచేను. "ఈ సంగతి మీకెలా తెలుసు."

"రాసేటప్పుడు నేను వాళ్ళదగ్గిరే ఉన్నాను!"

"సమయానికి చాలా ముఖ్యమైన విషయం చెప్పేరు. ఆల్‌రైట్ మీరు వెళ్ళి, డిటెక్టివ్ ఉదయకుమార్ గార్ని పంపించండి," అన్నాను ఆత్మప్రకాశ్‌తో.

అతను లోనికెళ్ళి డిటెక్టివ్‌ని పంపేడు బైటికి.

ఆయనకు ఆత్మప్రకాశ్ చెప్పిన విషయాలు వివరించి "మీ అభిప్రాయం ఏమిటి?" అడిగేను.

"ఆత్మప్రకాశ్ చెప్పినట్టు అమృతరావు, కళ్యాణచెట్టి, ముత్తులింగం పేర విల్లు రాసింది నిజమే అయితే, అమృత రావుని హత్యజెయ్యడానికి వాళ్ళకే ఎక్కువ కారణం కనిపిస్తోంది.

అమృతరావు ఇటు తన పత్రికలద్వారా, రచనల ద్వారా, సినీఫీల్డుద్వారా చాలా డబ్బు గడించేవుంటాడు. పెళ్ళీ పెటాకులూ లేని బైరాగి, వారసులంటూ ఎవ్వరూ లేరు. తన మరణానంతరం యావదాస్థీ తన ఆప్తమిత్రులైన కళ్యాణచెట్టీ, ముత్తులింగాలకు చెందేట్టు విల్లు రాసినా రాసి ఉండవచ్చు.

వాళ్ళిద్దరికీ విష్ణుపాదంతో పరిచయం ఉంది. తరుచూ వాళ్ళు తనింటికి వస్తూ పోతుంటారని అతనే ఒప్పు కున్నాడు. వాళ్ళే అతని పిస్తోలు దొంగిలించి, అమృత రావుని చంపి, అనుమానం అతనిమీదకు మళ్ళేలా పిస్తోలు కుర్చీలకింద పడేసి ఉంటారు. టూకీగా ఇదీ నా ఊహా గానం!" అన్నాడు ఉదయకుమార్.

"ఆ విషయాలన్నీ నేను వాళ్ళతో మాట్లాడి కను క్కుంటాను. ఈలోగా మీరు చిన్నపని జేసిపెట్టాలి. హంతకుడు హాల్లో గోడవారగా నిలబెట్టివున్న బుక్ షెల్ఫుల మధ్య నిల్చుని పిస్తోలుతో కాల్చి ఉంటాడని నా అనుమానం. మీరొకసారి అక్కడికెళ్ళి నా అను మానానికి ఆస్కారం ఎంతవరకు ఉందో పరిశీలించండి."

డిటెక్టివ్ తలూపి "ఔను! అందుకే పిస్తోలు పేలు స్తుండగా ఎవ్వరూ ఎవ్వర్నీ చూడలేకపోయేరు. మీరు మీ పని కానివ్వండి. నే వెళ్ళి చూసొస్తాను" అంటూ హాలువైపు నడిచేడు.

సబిన్‌స్పెక్టర్‌తో తిరిగి గదిలో ప్రవేశించేను.

"కళ్యాణచెట్టిగారూ! ఈమధ్య అమృతరావు మీ పేర వీలునామా రాసేడని విన్నాను, నిజమేనా?" అడిగేను.

ఆ ప్రశ్నతో ముత్తులింగం, కళ్యాణచెట్టీ ఉలిక్కిపడ్డారు. తరవాత ఏదో అర్థమైనట్టు ఆత్మప్రకాశ్ వైపు చూసేరు.

కళ్యాణచెట్టి తేరుకుని నావైపు తిరిగేడు. "నిజమే! అదంతా వేళాకోళంలో జరిగిపోయింది. ఈరోజు దానికింత ప్రాముఖ్యం వస్తుందని ఆనాడు మేమెవ్వరంఅనుకోలేదు. నిజానికది చట్టబద్ధమైన వీలునామా కాదు!

ఆరోజు అమృతరావూ, ఆత్మప్రకాశ్ ఇక్కడికి వచ్చి మాతో మాట్లాడుతూ కూర్చున్నారు. మాటల మధ్య ముత్తులింగం నవ్వుతూ, 'అమృతరావ్! నువ్వు రాత్రింబవళ్లూ కష్టపడి ఇంత సంపాదిస్తున్నావు కదా? ఎవ్వరికోసం. నీ తదనంతరం ఆ డబ్బంతాఎవ్వరు అనుభవించేది?' అన్నాడు.

అందుకు అమృతరావు నవ్వి—"ఈ రోజు నేనీస్థితిలో ఉన్నానంటే దానికి మూలకారకులు మీరే! నా తొలి నవల ప్రచురించి, పాఠక ప్రపంచానికి పరిచయం చేసింది మీరే. ఆనాడు పేరులేని కొత్త రచయితనైన నా స్క్రిప్టును మీరు ధైర్యంతో స్వీకరించి వుండకపోతే, బహుశా నేను మళ్ళీ ఎన్నడూ కలం ముట్టుకునేవాణ్ని కానేమో! ఆ నవల ప్రచురింపబడ్డందుకే నాలో సాహిత్య పిపాస శాశ్వతంగా వేళ్లు పాతుకుంది.

ఇంతటి ఆత్మీయులైన మీరిద్దరూ వుండగా, నాకు

వారసులు లేరంటారేమిటి? నా తదనంతరం నా డబ్బంతా మీరే అనుభవించాలి!'' అన్నాడు.

మేము పకపక నవ్వేశాం!

దాంతో అమృతరావు ఉడికిపోయేడు. 'నా మాట మీద నమ్మకం లేకుంటే చూడండి, ఇప్పుడే, ఈ క్షణం లోనే మీ పేర విల్లు రాసిపారేస్తాను' అంటూ కాగితం కలం అందుకుని గబగబ రాసి సంతకం పెట్టేడు.

అందుకు ముగ్గురు సాక్షులుగా ఆత్మప్రకాశ్ చేతా, ఇక్కడ పనిచేసే నా క్లర్కులచేతా సంతకాలు కూడా చేయించేడు...ఆ కాగితం ఇంకా ఇక్కడే వుంది, చూపిస్తానుండండి...'' అంటూ టేబిల్ సొరుగు లాగి, చుట్టి వున్న ఓ అరఠావు సైజు కాగితం తీసి అందించేడు కళ్యాణశెట్టి.

మడత విప్పి చదివేను.

"మైనంపూడి అమృతరావైన నేను, నా బుద్ధి పూర్వకంగా, ఎవ్వరి బలవంతమూ ఒత్తిడీ లేకుండా, పూర్తి ఆయురారోగ్యాలతో ఈ పత్రం రాస్తున్నాను.

దురదృష్టవశాత్తూ ఏ దుర్ఘటనలోనైనా నేను మరణించడం జరిగితే నా యావదాస్తీ, వస్తు సమేతంగా, బ్యాంకులోని నాలుగు లక్షల నగదుతోసహా నా మిత్రులూ, జనతా పబ్లిషింగ్ హౌస్ యజమానులూ అయిన శ్రీ కళ్యాణశెట్టిగారికీ, శ్రీ ముత్తులింగంగారికీ సరిసమానంగా చెందగలదు!''

—కింద అమృతరావు సంతకం, సాక్షుల సంతకాలూ వున్నాయి.

చట్టరీత్యా ఇది వీలునామా కింద గుర్తించబడక

పోయినా, అమృతరావు వేరే వీలునామా ఏదీ రాసి వుండకపోతే దీనికి ప్రాముఖ్యత లభిస్తుంది!

దాన్ని మడతపెట్టి సబిన్‌స్పెక్టర్ కిస్తూ—"ఆ తలుపు రెక్కకి వేలాడుతున్న జర్కిన్ జేబులో హంతకుడుప యోగించిన పిస్తోలుంది. దాన్ని కూడా స్వాధీనం చేసుకో!" అన్నాను.

అతను కాగితం మడిచి భద్రంగా జేబులోకి తోస్తూ, లేచి తలుపువైపు నడిచేడు.

జర్కిన్ జేబులన్నీ వెదికి—"పిస్తోలు ఎక్కడ?" అన్నాడు ఆశ్చర్యంగా.

"బాగా చూడు! కుడి జేబులో వుంటుంది" అన్నాను.

అతను మరోమారు వెదికి—"నో! ఏమీ లేదే!" అన్నాడు.

ఒక్క ఉదుటున వెళ్ళి జేబులన్నీ తడిమేను.

పిస్తోలు మాయం!

కోపంతో నా మొహం జేవురించింది. నేనూ, డిటెక్టివ్ ఉదయకుమార్, సబిన్‌స్పెక్టర్ గదిబైట మాట్లాడుకుంటున్న సమయంలోనే ఎవ్వరో దాన్ని కాజేసి వుంటారు. నలుగురి బట్టలూ విప్పి సోదా చేస్తే సరి! నిప్పులు కక్కుతూ వాళ్ళవైపు తిరిగేను.

అదే క్షణంలో, బైట ఏదో ప్రళయం ముంచుకు వచ్చినట్టు ఆర్తనాదాలూ, గావు కేకలూ వినిపించేయి.

డిటెక్టివ్ ఉదయకుమార్ హడావుడిగా లోనికి వచ్చి—"ఇన్‌స్పెక్టర్! బెండింగ్ రూంలో మంటలు లేచాయి. ఎవ్వరో బుద్ధిపూర్వకంగా నిప్పంటించినట్టుంది

త్వరగా రండి'' అన్నాడు తొందరపడుతూ.

క్షణ క్షణానికీ జనం అరుపులు శృతిమించుతున్నాయి బైట. "అందరూ బైటికి రండి'' అంటూ జర్కిన్ అందుకుని పరుగుతీసేను.

# 6

ఆఫీస్ పక్కనే వున్న బైండింగ్ రూంలో భగ భగ మండుతున్నాయి అగ్ని శిఖలు! బైండింగ్ కోసం కట్టలు కట్టలుగా పేర్చివున్న ప్రింటు ఫారాలన్నీ తగలబడి పోతున్నాయి. అన్ని గదుల్లోకి దట్టంగా కమ్ముకుం టోంది పొగ.

దగ్గులతో, అరుపులతో భవనంలోని వాతావరణం భీభత్సంగా తయారైంది.

"ఉదయకుమార్జీ! వెంటనే వెళ్ళి ఫైర్ బ్రిగేడ్ వాళ్ళకి ఫోన్ చెయ్యండి. నేనీలోగా అందర్నీ భవనం లోంచి బైటికి పంపేస్తాను. మంటలు ఇతర గదుల్లోకి వ్యాపించేలా వున్నాయి'' అన్నాను డిటెక్టివ్‌తో.

హాల్లో వున్నవాళ్ళందర్నీ బైటికెళ్ళమని ఆదేశించేను. మరుక్షణం ఒకరిమీద ఒకరు పడుతూ లేస్తూ బైటికి పరుగుతీసేరు. వాళ్ళ వెనకే నేనూ ఇవతలికి వచ్చేను.

రోడ్డుమీద ట్రాఫిక్ జామ్ అయివుంది.

సాఫీగా సాగుతున్న మా దర్యాప్తును దారి మళ్ళించ డానికే ఈ గందరగోళం సృష్టించబడింది. దీనితో లోప లున్న అతిధులంతా బైటపడ్డమేగాక వారిమధ్య కలిసి పోయి హంతకుడు కూడా బయటపడ్డాడు!

"ఫైర్ బ్రిగేడ్ వాళ్ళు మరో నిమిషంలో వచ్చేస్తారు'' అన్నాడు డిటెక్టివ్ ఉదయకుమార్ నన్ను సమీపించి.

కానిస్టేబుళ్ళు చుట్టూవున్న జనాన్ని వెనక్కి జరుపుతున్నారు. అంతలో గణగణ గంటలు మోగిస్తూ వచ్చేసింది ఫైరింజన్.

దాని ఇంఛార్జ్ కు, లోపల ఏ గదిలో మంటలు లేచాయో వివరించేను. మరుక్షణం వాళ్ళంతా తమతమ సరంజామాతో లోనికి దూరేరు.

చూస్తూ చూస్తూనే లోపల పొగ సన్నగిల్లసాగింది. హత్యా సమయంలో భవనంలో వున్న వాళ్ళంతా ఇప్పుడు బైటపడ్డారు. ఈపాటికి సగంమంది ఎవరిదారిన వారు వెళ్ళిపోయుంటారు.

ఇక చేసేదేమీ లేదు. ఈ రాత్రంతా కేసును క్షుణ్ణంగా స్టడీచేసి రేపు ఓ పద్ధతి ప్రకారం దర్యాప్తు ప్రారంభించాలి. అక్కడ మిగిలిన కొద్దిమందినీ వెళ్ళి పొమ్మని చెప్పాను.

భవనం ముందు ఇద్దరు కానిస్టేబుళ్ళని నియమించేను కాపలాకి. అంతవరకూ డిటెక్టివ్ ఉదయకుమార్ నాకు తోడుగా వున్నాడు. ఇప్పటికే రాత్రి పదిన్నర దాటింది. ఇంకా అతన్ని ఆపడం బావుండదు.

"మీ సహకారానికి మెనీ థాంక్స్! ఇక వెళ్ళండి మీరు. రేపుదయం ఓమారు మిమ్మల్ని కలుసుకుని కేసు గురించి చర్చిస్తాను" అన్నాను షేక్ హాండ్ ఇస్తూ.

"హత్య మన కళ్ళముందు జరిగింది. హంతకుణ్ణి మనమే పట్టుకు తీరాలి. లేకుంటే, మన వృత్తికే అపవాదు. రేపు నేనే క్రైం బ్రాంచికి వచ్చి మిమ్మల్ని కలుసుకుంటాను. గుడ్ నైట్!" అని కారెక్కి వెళ్ళిపోయేడు ఉదయకుమార్.

# 7

సిగరెట్ అంటించి రెండు దమ్ములు లాగేక వచ్చింది ఆలోచన. ఓమారు ఆ బుక్ షెల్ఫ్ మధ్యకెళ్ళి చూడాలని.

కానిస్టేబుళ్ళను బైటే వుండి చూస్తుండమని చెప్పి, భవనంలో ప్రవేశించేను.

హాల్లో లైటు వెలుగుతోంది. తలుపు మూసి, గోడ వారగా వున్న బుక్ షెల్ఫులవైపు నడిచేను. కేవలం ఒకే ఒక వ్యక్తి అదీ అడ్డంగా వెళ్ళగలిగేంతటి సందు మాత్రం వుంది ఆ రెంటి మధ్య!

ఆలోచిస్తూ కొద్ది కష్టంతో, అడ్డంగా సందులో ప్రవేశించగలిగేను. బుక్ షెల్ఫ్ అరల్లో వరసగా పుస్తకాలు పేర్చివున్నాయి. కిందినుంచి మీదివరకూ అరలు చూసుకుంటూ జరగసాగేను.

బుక్ షెల్ఫ్ మధ్య చేరుకోగానే హఠాత్తుగా కాళ్ళు నిలిచిపోయేయి. అక్కడ, పై అరలో ఓ లావుపాటి పుస్తకం తీసేసినట్టు స్థలం ఖాళీగా వుంది.

విచిత్రం ఏమిటంటే, ఆ అర నేలనించి ఏడడుగుల ఎత్తులో వుంది. హంతకుడు అక్కడి పుస్తకం తీసి, ఆ ఖాళీ స్థలంలో పిస్తోలు వుంచి షూట్ చేశాడనుకుంటే అనేక ప్రశ్నలు ఉత్పన్నమవుతాయి.

మొదటి ప్రశ్న—హంతకుడు కింది అరమీద కాలు మోపి ఆ అరలోంచి పిస్తోలు ఉపయోగించేడనుకున్నా, ఈ సందులో కాలు మడవడానికే ఆస్కారం లేనప్పుడు కింది అరమీద కాలుపెట్టి నిల్చునే ప్రసక్తి లేదు! మరి? అంతెత్తు అరమధ్య పిస్తోలుపెట్టి, గురి చూడకుండా ఎలా కాల్చగలిగేడు?

ఒకేఒక సందర్భంలో అలా జరగడానికి వీలుంది. హంతకుడు చాలా పొడుగైనవాడై వుండాలి. నా హైట్ ఐదడుగుల పదంగుళాలు. ఇంత పొడుగున్న నాకే ఆ అర అందడంలేదు. అంటే, హంతకుడి హైట్ ఆరడుగుల ఐదంగుళాల వరకూ ఉండివుండాలి!

సభలో పాల్గొన్నవారిలో అంత పొడుగు ఎవరున్నారా? అని ఆలోచిస్తూ మెల్లిగా సందులోంచి బైటికి వచ్చేను. బుక్ షెల్ఫ్ ముందుకెళ్ళి చూసేను. ఇప్పుడు పుస్తకం తీసివున్న అర క్లియర్‌గా కనిపిస్తోంది.

కింది అరమీద కాలుపెట్టి ఎక్కి, ఆ అరను పరిశీలించేను. అందులో 'ఇన్‌సైక్లోపీడియా' గ్రంథాల సెట్టు పేర్చబడి వుంది. ఆ సెట్టులోంచే నాల్గవ సంపుటికి చెందిన గ్రంథం తీసివెయ్యబడింది. 'ఇన్‌సైక్లోపీడియా' గ్రంథాలెప్పుడూ పూర్తి సెట్టుగా అమ్మబడతాయి. ఒక్కో గ్రంథాన్ని విడిగా అమ్మరు. అమ్మినా ఎవ్వరూ తీసుకోరు.

ఐతే, హంతకుడు హత్యా సౌకర్యంకోసం సెట్టులోంచి ఆ పుస్తకం తీసివుంటే అది ఇక్కడే ఎక్కడో పడుండాలి. అరలన్నీ వెదికేను. ఓ ప్రక్కన కనిపించింది.

అప్పుడే ఆ ఆలోచన మెరిసింది. హాల్లో వెలుగుతున్న లైటార్పి, ఆ అరలో పుస్తకం తీసిన చోట పెన్ టార్చి పెట్టి చూడాలి. దాని వెలుగు స్టేజిమీద అమృతరావు నిల్చుని ప్రసంగించిన చోట పడితే, ఖచ్చితంగా హత్య నేనూహించినట్టే జరిగిందని రూఢి అవుతుంది.

గోడలో వున్న స్విచ్ దగ్గరికెళ్ళి లైటార్పేశాను. జేబులోంచి పెన్ టార్చి తీసి వెలిగించేను. షెల్ఫ్

మధ్య కెళ్ళి, కింది అరమీద కాలు పెట్టి ఎక్కి, పుస్తకం తీసివున్న ఖాళీ స్థలంలో టార్చి పెట్టి స్టేజి వైపు చూసేను.

చీకట్లో టార్చి కాంతి సరిగ్గా మైక్ దగ్గిర పడు తోంది.

అమృతరావు హత్య జరిగింది అక్కడే!

టార్చి అందుకుని, హాల్లో లైటు వెలిగిద్దామనుకుం టుండగా లోపల ఎక్కడో ఏదో చప్పుడై, చటుక్కున ఆగిపోయేను.

చేతిలో వెలుగుతున్న పెన్ టార్చి ఆర్పి చెవులు రిక్కించేను.

## 8

ఎవ్వరో హాలువైపు వస్తున్నట్టు సన్నని అడుగుల సవ్వడి! పిల్లిలా బుక్ షెల్ఫ్ పక్క కెళ్ళి నిల్చుని, ఊపిరి బిగబట్టి చూడసాగేను.

అప్పటికే నా కళ్ళు చీకటికి అలవాటుపడ్డాయి. ఓ ఆకారం అడుగులో అడుగు వేసుకుంటూ బుక్ షెల్ఫ్ దగ్గరికి వచ్చింది. అతనెవ్వరో చీకట్లో సరిగ్గా అంచనా వెయ్యలేకపోతున్నాను.

అప్పుడే అతని చేతిలో టార్చి వెలిగింది. ఆ కాంతిలో అతన్ని గుర్తించి అదిరిపడ్డాను.

అతను అమృతరావు సబ్ ఎడిటర్ ఆత్మప్రకాశ్! టార్చి ఫోకస్ షెల్ఫ్ మీద వేస్తూ ఏదో చూస్తున్నాడు కిందా మీదా చూసుకుంటూ షెల్ఫ్ మధ్య వచ్చి ఆగేడు. అతని టార్చి ఫోకస్ పై అరలో పుస్తకం తీసి వున్న ఖాళీ స్థలంలో నిలిచిపోయింది!

కాసేపు దాన్ని పరీక్షగా చూసి, సాలోచనగా తలూపి, షెల్ఫ్ అటువైపునుంచి వెనక వున్న సందును పరిశీలించసాగేడు.

అందరితోబాటు వెళ్ళిపోయిన ఆత్మప్రకాశ్, దొంగ చాటుగా భవనంలో దేనికి ప్రవేశించేడు? ఎలా ప్రవేశించేడు? అమృతరావును చంపింది అతనేనా? షెల్ఫ్ లోంచి తీసిన పుస్తకాన్ని తిరిగి పెట్టడానికి వచ్చేడా?

నా ఆలోచనలింకా పూర్తి కాకముందే, ఆత్మప్రకాశ్ వెనుదిరిగి వచ్చిన దారినే వెళుతూండటం కనిపించింది. ఆశ్చర్యమేమిటంటే, నేనూహించినట్టు అతను బుక్ షెల్ఫులో ఏ పుస్తకమూ పెట్టలేదు. ఎలా వచ్చేడో తిరిగి అలా వెళ్ళిపోతున్నాడు.

అతన్ని కొద్దిదూరం పోనిచ్చి, అడుగులో అడుగు వేసుకుంటూ అనుసరించేను. ఆత్మప్రకాశ్ రెండు గదులు దాటి, మూడో గదిలో ఉన్న దొడ్డి తలుపులు తెరుస్తున్నాడు.

ఈ దారినే వచ్చాడన్న మాట! అగ్ని ప్రమాదం జరిగిన సమయంలో, గడియ తీసిపెట్టి ఉంటాడు. ఆ హడావుడిలో దీనిగురించి పట్టించుకోలేదు.

ఆత్మప్రకాశ్ బైటికెళ్ళి, తిరిగి దగ్గరగా చేరవేసేడు తలుపుని. రెండు నిమిషాల వ్యవధి ఇచ్చి, మెల్లిగా తలుపు తెరిచేను.

అది విశాలమైన సందు. ఆ సందుగుండా కుడివైపు తిరిగి, భవనం ముందుకి రావచ్చు.

ఆత్మప్రకాశ్ సందులోపడి గబగబ వెళుతున్నాడు. అతను సందు మలుపు తిరిగేవరకు జాగ్రత్తగా వెంబడించి "ఆత్మప్రకాశ్" అన్నాను గట్టిగా.

మలుపు తిరుగుతున్నవాడల్లా ఉలిక్కిపడి వెనుదిరిగేడు. నన్ను చూడగానే శిలాప్రతిమలా నిల్చుండిపోయేడు.

"దొంగచాటుగా భవనంలో దేనికి ప్రవేశించావ్?" అడిగాను.

కాసేపు అతని నోట మాట పెగల్లేదు. తరవాత తేరు కుని "మీరూ లోపలే ఉన్నారన్నమాట! నాకు మొదట నించీ ఆ బుక్ షెల్ఫుల దగ్గరేదో మిస్టరీ దాగుందని అను మానం పీకసాగింది.

మీరు గమనించారా? ముందున్న బుక్ షెల్ఫు పై అరలో ఓ పుస్తకం తీసిన ఖాళీస్థలాన్ని? హంతకుడు అక్కణ్ణించే పిస్తోలు ఉపయోగించి ఉంటాడు.

అమృతరావుగారికి నేనెంతో ఋణపడి ఉన్నాను. ఆయన ఆకస్మికమరణం నాపై గట్టి దెబ్బతీసింది. ఆయన్ని చంపిన కిరాతకుణ్ణి ఉరికంబంమీద వేళ్ళాడుతూ చూడందే నాకు నిదరపట్టదు. అందుకే, నా తరఫున దర్యాప్తు చెయ్యడానికి ఇలా వచ్చేను. నన్నపార్థం చేసుకోకండి!" అన్నాడు ఆత్మప్రకాశ్ తొణకకుండా.

"సరే, మీరు వెళ్ళండి. అవసరం కలిగినప్పుడు పిలిపి స్తాను" అన్నాను రిస్టువాచీ చూసుకుంటూ.

ఒంటిగంట అవుతోంది!

ఇద్దరం భవనంలోంచి బైటికి వచ్చాం. ఆత్మప్రకాశ్ ఓ టాక్సీ ఎక్కి వెళ్ళిపోయేడు.

అప్పుడు తట్టింది నాకు ఓ ఆలోచన. దాన్ని గనక దిగ్విజయంగా అమలుజరిపితే, హంతకుడు తనంత తాను వచ్చి నా ఉచ్చులో చిక్కుకుంటాడు!

వెంటనే మోటర్ బైక్ ఎక్కి ఇంటికి బైలుదేరాను.

ఇంట్లో నా పెర్సనల్ గదిలో కూర్చుని, బల్లసొరుగు లోంచి లెటర్ పేడ్, పెన్ తీసేను. సిగరెట్ అంటించి, పేడ్ మీద గబగబ రాయసాగేను.

"మిస్టర్...

నిన్ను హంతకుడిగా నిరూపించే అభేద్యమైన ఆధారం నా దగ్గరుంది. అది కావాలనుకుంటే, నా నోరు మూయించాలనుకుంటే, రేపు రాత్రి ఎనిమిది గంటలకి మీనంబాకం విమానాశ్రయం పక్కనున్న శిథిలాలవద్దకు, పదివేల నెట్ క్యాష్ తీసుకురా!

నీ శ్రేయోభిలాషి!"

—అని రాసి దానిని కవర్‌లో పెట్టి, అంటించి, పైన ఓ చిరునామా రాసి, బైక్ మీద జనరల్ పోస్టాఫీస్ చేరు కుని, దానిని పోస్ట్ చేసేను.

అది లోకల్ ఉత్తరం గనక, రేపు పదిగంటల పోస్టులో అతడికి అందుతుంది.

# 9

శిథిలాల దగ్గర నిల్చుని రిస్టువాచీ చూసుకున్నాను.

ఏడుగంటలు!

చలికాలం గనక అప్పటికే పరిసరాలు చీకట్లో మునిగిపోయేయి. ఆ చుట్టుపక్కల జనసంచారం ఉండదు' కీచురాళ్ళ రొద తప్పితే వేరే అలికిడిలేదు.

నేను ఊహించినట్లు హంతకుడు అతనే అయి ఉండి ఉంటే, నేను రాసిన ఉత్తరం చదివి అదిరిపోయి ఉంటాడు. డబ్బిచ్చి రాజీ కుదుర్చుకోడానికో, లేదా శాశ్వతంగా నా నోరు మూయించడానికో తప్పక వచ్చి తీరతాడు.

ఆలోచిస్తూ వెనుదిరిగి శిధిలాల్లో ప్రవేశించేను.అక్కడ మరీ అంధకారం! విరిగి శిధిలమైన మొండిగోడలూ,రాళ్లూ రప్పలతో నిండిన ప్రదేశం! నాకు అనుకూలమైన చోటు ఎన్నుకుని చీకట్లో నక్కి, చూస్తూ నిల్చున్నాను.

ఎనిమిదికి పదినిమిషాలుందనగా, ఎవ్వరో శిధిలాలవైపు వస్తున్న అడుగుల శబ్దం వినిపించసాగింది. నా గుండె గతి వేగం అందుకుంది.

శిధిలాల కవతల ఆగిపోయింది శబ్దం!

"ఏయ్ మిస్టర్! ఎక్కడున్నావ్?" పిలుస్తున్నాడతను.

బదులివ్వకుండా ఊపిరి బిగబట్టి నిల్చున్నాను.

"డబ్బు తెచ్చాను...పలకవేం" తిరిగి వినిపించింది కంఠం.

అంతకీ నేను జవాబివ్వలేదు. చివరికి అతనే అడుగులో అడుగు వేసుకుంటూ శిధిలాల్లో ప్రవేశించాడు.

జేబులోంచి త్రీ సెల్స్‌టార్చి, పిస్తోలూ తీసి రెడీగా పట్టుకున్నాను. అతను చీకట్లో అటూయిటూ చూసుకుంటూ నేనున్నవైపు వస్తున్నాడు. కొద్దిగా దగ్గరకు రానిచ్చి, చటుక్కున ఫోకస్ వేసేను మీద.

అతను ఎవ్వరో కాదు.

డిటెక్టివ్ ఉదయకుమార్!

టార్చి వెలగ్గానే అదిరిపడి నావైపు తిరిగేడు. నాకు తెలుసు అతని చేతిలో పిస్తోలు ఉంటుందని. ఆ పిస్తోలుకింకా పని దొరక్కముందే నా పిస్తోలు పొగలుకక్కింది.

"ఢాం!" అనే శబ్దంతో బాటు నేనూ పక్కకు గెంతేను. గుండు ఉదయకుమార్ జబ్బలో దిగింది. అత

నింకా షాక్‌లోంచి తేరుకోకముందే, నాలుగు వైపులా టార్చిలైట్లు వెలిగేయి.

అంతవరకూ శిధిలాల్లో పొంచివున్న సార్జంట్ దేవిడ్ నలుగురు కానిస్టేబుళ్ళూ మెరుపులా డిటెక్టివ్‌ని చుట్టు ముట్టి, అతన్ని అదుపులోకి తీసుకున్నారు.

# 10

"డియర్ డిటెక్టివ్! నీమీద నాఅనుమానం ఎప్పుడు మళ్ళిందో తెలుసా? ఆ రెండు బుక్‌షెల్ఫుల మధ్య, సందులో ఒక మనిషి నిటారుగా నిల్చోడం తప్ప, కాలూ చెయ్యీ మడవలేదు. కాలూ చెయ్యీ మడవందే కింది అరమీద కాలుపెట్టి పై అరలోంచి కాల్పులు జరప లేదు.

ఐనా, హత్య పై అరమధ్యనించే జరపబడిందని రూఢీ అయింది. హంతకుడు చాలా పొడవై వుంటేతప్ప ఆ అరలోంచి గురిచూసి కాల్చలేడని నిశ్చయించుకు న్నాను. ఆ సభకు హాజరైన వారిలో నీవుతప్ప అంత పొడగరి ఎవ్వరూ లేరు!

పోతే అమృతరావుని నీవు దేనికి చంపవలసి వచ్చిందో కారణాలు నాకు తెలీవు. అవి చెప్పే బాధ్యత నీది. ప్రైవేట్ డిటెక్టివ్వి గనుక, మేము దోషులచేత యెలా నిజాలు కక్కిస్తామో నీకు బాగా తెలిసిందే!" అన్నాను అతన్ని తీక్షణంగా చూస్తూ.

ఉదయకుమార్ పలకలేదు. చాలాసేపు తలవంచుకుని మౌనంగా కూర్చున్నాడు. తరువాత ఒక నిశ్చయానికి వచ్చినట్లు, గట్టిగా నిట్టూరుస్తూ తలెత్తాడు.

"ఆల్ గైట్ ఇన్ స్పెక్టర్! ఒప్పుకుంటాను. ఆ హత్య నేనే చేశానని ఒప్పుకుంటాను. అందుకు కారణంవుంది.

అమృతరావు ఇంతవరకూ పెళ్ళి చేసుకోక పోడానికి ఓ కథ ప్రచారంలోవుంది. మీకు తెలుసా?

అతను టీన్ ఏజ్ లో ఓ అమ్మాయిని ప్రేమించాడు. కులగోత్రాలు అడ్డుపడి వారి వివాహం జరగలేదు. ఆ అమ్మాయి తలిదండ్రులు ఆమె ఇష్టానికి వ్యతిరేకంగా మరో వ్యక్తితో ఆమె పెళ్ళి జరిపించేరు. ఆవ్యక్తి ఎవ్వరో కాదు ఇన్ స్పెక్టర్ నేనే!

అప్పుడు నేనింకా కాలేజీ విద్యార్థిని. చదువు పూర్తయ్యేక, ఈ వృత్తిలో శిక్షణపొంది, సతీ సమేతంగా మద్రాసువచ్చి, ప్రాక్టీసు ప్రారంభించేను. పేరు తెచ్చుకున్నాను.

ఇన్నేళ్ళ తరువాత, హఠాత్తుగా అమృతరావు మళ్ళీ తటస్థపడ్డాడు నా భార్యకు, ఇదే నగరంలో! తనవల్లే అతను ఆజన్మ బ్రహ్మచారిగా ఉండిపోయేడని తెలిసిన నాభార్యకు అతనిపట్ల సానుభూతీ, ప్రేమా తిరిగి ప్రజ్వరిల్లేయి!

వారిమధ్య ఏర్పడ్డ పరిచయం, నానాటికీ అసహజంగా ఎదుగుతున్నట్టు అనుమానం కలిగింది నాకు. దాంతో రహస్యంగా వారిమీద ఓ కన్నేసి ఉంచేను.

అప్పుడే తెలిసిందినాకు వారి మాజీ ప్రణయం గురించి. అతన్ని మళ్ళీ ఎన్నడూ కలుసుకోవద్దని నా భార్యకు గట్టిగా చెప్పేశాను.

దాంతో వారి కలయిక రహస్యంగా కొనసాగడం ప్రారంభమైంది. ఇద్దరూ లైంగిక సంబంధంకూడా ఏర్పరచు కున్నట్టు నా పరిశోధనలో స్పష్టమైంది.

అప్పుడు పడింది నాలో హత్య చెయ్యాలన్న విష బీజం! పథకం రూపొందించేను. నేరాన్ని విష్ణుప్రసాదం మీదికి తోసెయ్యాలని రెండురోజులు క్రితం ఓ కేసు విషయమై అతన్ని కలుసుకున్నప్పుడు అతని పిస్తోలు దొంగిలించాను.

ఆ బుక్ షెల్ఫులమధ్య నిల్చొని అమృతరావుని షూట్ చేసి, దాన్ని కుర్చీలకింద పడేశాను.

తరువాత మీరూ, సబిన్ స్పెక్టర్, ఆత్మప్రకాశ్ ఆఫీస్ బైటనిల్చొని మాట్లాడుకుంటున్నప్పుడు, మిమ్మల్ని తికమక పెట్టడానికి మీ జేబులోంచికూడా పిస్తోలు కాజేసిందికూడా నేనే!

తరువాత మీరు బుక్ షెల్ఫులు చెక్ చేసి రమ్మన్నప్పుడు బైటికెళ్ళి బైండింగ్ రూంలో నిప్పంటించిదీ నేనే! అయినా మీ ఎక్సరే కళ్ళనుండి నేను తప్పుకోలేకపోయాను'' అన్నాడు ఉదయకుమార్ భారంగా నిట్టూరుస్తూ.

—: ఐపోయింది :—

# పెంపుడు కొడుకు

గీతారాణి

అప్పుడే సెకండ్ షో వదిలారు.

హాల్లోంచి, బయటపడ్డ జనంలో కొందరు వాసు కిళ్లీ కొట్టుదగ్గరకు పరిగెట్టారు.

ఒకరు సిగరెట్లుకావాలని, మరొకరు కిళ్లీలు కావాలని మరొకరు చాక్లెట్లు కావాలని, వాసుమీద పడుతున్నారు.

వాసు సహనంగా అందరికీ అన్నీ అందిస్తున్నాడు.

ఓ పావుగంట అతను ఊపిరి పీల్చుకొందుకే నానా యాతన పడ్డాడు.

ఆ పావుగంట అయేక వాసు కొట్టుముందు సందడి తగ్గిపోయింది.

సెకండ్ షో అయ్యాక ఇంక తన కొట్టుకు జనం రారని అతనికి తెలుసు. ఇంకా తన కొట్లో కూర్చోవటం శుద్ధ దండగ అనుకొని, ఆ రోజు వచ్చిన డబ్బులన్నీ జేబులో వేసుకొని, కొట్టుకు తాళం పెట్టి, ఇంటి దారిపట్టాడు.

అతను ఇంటికి రాగానే రోజూ, తలుపులని ఓ పావుగంట కొడుతాడు. అది మొదట్లో చాలా చిరాకుగా అనిపించినా, రాను, రానూ, అది అలవాటుగా మారి పోయింది.

క్రొత్తలో పావుగంట తరువాత తల్లో, తండ్రో, తమ్ముళ్ళో, చెల్లెళ్ళో వచ్చి తలుపులు తీస్తే అరగంట నుంచి కొట్టి, కొట్టి, చేతులు నొప్పి పడుతున్నాయి, తలుపులు తియ్యరేం? అని తలుపులు తీసిన వాళ్ళమీద చిన్నగా విసుక్కునేవాడు.

రోజూ తలుపులు కొట్టటానికి అలవాటు పడిపోయిన అతను ఆ మాటలు కూడా అనటం మానేశాడు.

ఈ రోజు ఆఖరి తమ్ముడు, లోపలనుంచే అన్నని పెద్దగా తిట్టుకొంటూ వచ్చి, తలుపులు తీసి, అలాగే వెళ్ళి పడుకొన్నాడు.

వాసు తలుపులు గడియపెట్టి, కాళ్ళూ, చేతులు కడుక్కొని, తన గదిలోకి వెళ్ళి, బట్టలు మార్చుకొని వంటింటిలోకి వెళ్ళి అన్నం గిన్నె మూత తీసి చూసాడు.

మూడేమూడు పిడికెళ్ళ అన్నం ఉంది. దాని ప్రక్కన నాలుగే నాలుగు దుంప ముక్కలు, చిన్న గిన్నెలో చారు వున్నాయి.

ఆ అన్నం చూస్తూనే వాసు ముఖం చిన్నబోయింది.

బయటకే చిన్నగా నిట్టూర్పు విడిచి, ఆ గిన్నెమీద

మూత పెట్టేసి ఓ గ్లాసు తీసుకొని కుండలో నీళ్ళు కడుపు నిండుగా త్రాగేసి, వంటింటి తలుపులు మూసి వేసి తన గదిలోకి వచ్చాడు.

తను విప్పిన ప్యాంట్ చేతిలోకి తీసుకొని, నేలమీద చతికిలబడి ప్యాంట్ జేబులోంచి చిల్లరని, రూపాయి నోట్లని క్రిందకు వంపాడు.

ఆ రూపాయినోట్లమధ్య చిన్న కాయితం ముక్క లాంటిది వాసు చురుకైన కళ్ళకు కనిపించింది.

వాసు ఆశ్చర్యపోతూ ఆ చీటీని చేతిలోకి తీసుకొని చూసాడు.

"మై డియర్ వాసూ!

రేపు సాయింత్రం ఆరు గంటలకు శ్రీదేవ్ విలాస్‌కు రా. నీకు ఒక రహస్యాన్ని చెప్పాలి. వస్తావు కదూ!

ఇట్లు,
నీ శ్రేయోభిలాషి"

వాసు ఆ లెటర్‌ని నాలుగైదుసార్లు చదివి చాలా ఆశ్చర్యపోయేడు.

ఈ చీటీ తన జేబులోకి ఎలా వచ్చింది? తన జేబులో ఎవరు వేసారు? ఆ చీటీ తన జేబులో వెయ్యాలంటే కనీసం తన ప్రక్కనుంచి ఎవరైనా వెళ్ళితీరాలి. తను కోట్టు కట్టేసి వస్తున్నపుడు చాలా వీధులు నిర్మానుష్యంగా వున్నాయి. కొన్ని వీధుల్లో వాహనాలు మాత్రమే వెళుతున్నాయి. మరికొన్ని వీధుల్లో జనం పాద సంచారులైనా, తన ప్రక్కగా ఎవరూ నడవలేదు. తనకి బాగా గుర్తు వున్నది. మరి ఈ చీటీ తన జేబు లోనికి ఎలా వచ్చింది?

ఒకవేళ ఆ శ్రేయోభిలాషి తన కోట్లో ఏ కిల్లీనో, సిగరెట్ ప్యాకెట్టో కొని, రూపాయి నోటుతో సహా ఈ చీటీని తనకు అందజేశాడేమో?

యస్. కరెక్ట్. ఈ చీటీ తన జేబులోకి రావాలంటే అదొక్కటే మార్గం. తను గాబరాగా అందరికీ అన్నీ అందిస్తూ, ఈ చీటీనికూడా అందుకొని వుంటాడు.

అయితే ఇంతకీ ఎవరా శ్రేయోభిలాషి? తనకు రహస్యాన్ని చెప్పాలి అంటూ వ్రాశాడు. ఏమిటా రహస్యం? ఆ రహస్యాన్ని తెలుసుకోవాలంటే రేపు తను శ్రీదేవ్ విలాస్‌కు వెళ్ళితీరాలి. ఆ శ్రేయోభిలాషి చెప్పబోయే రహస్యాన్ని విని తీరాలి.

వాసు ఆ చీటీని, డబ్బులని తిరిగి ప్యాంట్ జేబులో పడేసి, చాప పరచుకొని ప్రశాంతంగా నిద్దురపోయాడు.

## 2

ఆ మర్నాడు వాసు ఉదయాన్నే లేచి, త్వరత్వరగా తన పనులు ముగించుకున్నాడు.

అద్దంలో చూసి, తల దువ్వుకొంటూంటే ఆ ఇంటి పెద్దకొడుకు గిరి, సావిత్రమ్మ అక్కడకు వచ్చారు. మిగిలిన వాళ్ళుకూడా మెల్ల మెల్లగా అక్కడకు చేరుకొన్నారు.

“ఏరా, రాత్రి ముద్ద తినలేనట్లు వుంది., ఎవరిమీద తమరి అలుక?”

విసురుగా ప్రశ్నిస్తున్న తల్లివంక అదోలా చూసాడు.

“ఆ చూపేమిటి? అడిగినదానికి సమాధానం ఇవ్వకుండా.”

గిరి చిర చిరలాడుతూ అన్నాడు.

వాసు షర్టు వేసుకొంటూ మౌనం వహించాడు.

"వాడి తిక్క సంగతి నీకు తెలిసిందేకదా సావిత్రీ, మనం ఎన్ని వాగినా ఆయనగారు మాత్రం రాజాగారిలా నోరైనా విప్పడు."

సుందర్రావు కొడుకుమీద మండిపడుతూ అన్నాడు.

"మరీ రాతి మనిషి. ఒక్క మాట మాట్లాడడు. ఇలాంటివాడు అడవిలో మానుగా పుట్టాల్సింది."

"అది మడ్డితనం కాదు, పొగరు మోతుతనం."

పెద్దవాళ్ళూ, చిన్నవాళ్ళూ తనపై పాస్ చేస్తున్న కామెంట్స్‌ని చాలా నెమ్మదిగా, శాంతంగా వింటున్నాడు వాసు.

అతడి తత్వం చాలా చిత్రమైనది.

ఎవరు ఎన్ని మాటలు అన్నా తనని కాదన్నట్లు, అసలు ఆ మాటలను విననట్లు ప్రవర్తిస్తాడు.

అది తిక్క స్వభావంకాదు. తనవాళ్ళు అనే మాటల్ని వినే శక్తిని కోల్పోయాక అలా వుండటం నేర్చుకొన్నాడు.

తనకన్నా పెద్దవాడైన గిరిని కానీ, తనకన్నా చిన్నవాళ్ళు అయిన తమ్ముళ్ళు, చెల్లెళ్ళని కాని ఏనాడు కసిరి కూడా ఎరుగరు తల్లి తండ్రీ.

చిన్ననాటినుంచి తన వాళ్ళందరూ విసిరే విసురులతో వేసే మెతుకులతో ఇంతవాడు అయాడు.

తల్లీ, తండ్రీ, అన్న అనే మాటలకు పసితనంలో విసురుగా సమాధానాలు చెప్పేవాడు. కానీ యుక్త వయసు వచ్చాక వాసు వాళ్ళ మాటల్ని శ్రద్ధగా వినేసి, అన్ని మాటలకు సమాధానంగా చూచినట్లు ఒకే ఒక

సమాధానాన్ని చెప్పటమో లేక ఒకసారి వాళ్ళ ముఖాల లోకి చూసి బయటకు వెళ్ళిపోవటమో చేసేవాడు.

క్రొత్తలో తల్లీ తండ్రీ తనని దూషించటం, మిగతా వార్ని ప్రేమగా చూడటం చూసిన వాసు కంటినిండా నిద్రపోకుండా అంతా నన్ను ఎందుకిలా వేరుగా చూస్తున్నారు అని విచారించేవాడు.

వాసు టెన్త్ క్లాసు ఫస్ట్ క్లాసులో పాసయ్యాడు.

ఇంటర్ మీడియట్ లో జాయిన్ అవుతానని అంటే, తండ్రి నాలుగు చీవాట్లు పెట్టి, ఓ కిల్లీ కొట్టు అద్దెకు తీసుకొని, వాసుని ఆ కొట్లో కూర్చోబెట్టాడు.

మొదటిసారి ఆ కిల్లీ కొట్లో కూర్చున్న వాసు బోరున ఏడ్చేసాడు, తన దురదృష్టానికి.

ఏ ఇంజనీరో, ఏ డాక్టరో చదవాలని కన్న కలలు అలా కిరాణా కొట్లో ఓమూల కూర్చోనేసరికి అతనికి అంత చిన్న వయసులోనే జీవితం మీద విరక్తిలాంటిది కలిగింది.

ఎవరికి ఎంత ప్రాప్తమైతే అంతే అనుకొని, ఆ కిల్లీ కొట్టు జీవితానికి అలవాటు పడిపోయేడు.

ఉదయంనుంచి రాత్రివరకూ ఆ కిల్లీ కొట్లో గడిపి, సంపాదించే సంపాదన అతను ఏనాడూ తన స్వంత ఖర్చులకు వుపయోగించుకోలేదు. రాత్రి సంపాదించిన పైకాన్ని, ఉదయాన్నే తల్లి లాక్కొంటుంది.

ఏనాడైనా మిత్రులు ఎవరైనా సినిమాకు రమ్మని బలవంతం చేస్తే, వాసూ సినిమాకు బయలుదేరితే ఆ రోజు యుద్ధమే ఇంట్లో.

ఇవ్వటానికి చేతులు రాని తల్లి, ఎలాగో ఇచ్చాక అన్న

మిగిలినవాళ్ళ పోరాటం, తండ్రి దూషణ భూషణాలు.

ఇన్నింటిలో చూసే ఆ సినిమా ఏనాడూ వాసు తలకి ఎక్కదు. అందుకే అతను ఏనాడూ సినిమాల జోలికి పోడు.

ఇది వాసు జీవితం. అతను సాగిస్తున్న జీవనం.

“వాసూ! తిండి ఎందుకు తినలేదూ? అని ప్రశ్నిస్తే సమాధానం చెప్పాలని తెలియదా?”

తండ్రి గొంతులో ధ్వనించిన తీవ్రతకి, తండ్రివంకే చూస్తున్న వాసు తన జేబులో వున్న నోట్లు, చిల్లరా, తల్లి చేతుల్లో పోస్తూ—

“ఆకలి వెయ్యలేదు. అందుకే తినలేదు” అని అనేసి, బాగా అరిగిపోయిన చెప్పుల్లో కాళ్ళు దూర్చాడు.

“ఎలా వేస్తుంది ఆకలి! ఆ కొట్లో కూర్చుంటాడు. ఎంత డబ్బు వస్తుందో, మనకు తెలియదు. వచ్చిన డబ్బులో సగం దాచేసి, మిగిలిన సగం మన ముఖాన కొడతాడు. తను మస్తుగా హోటలులో మింగేస్తాడు. మనం అర్ధాకలితో సగం చస్తూ, బ్రతుకులు ఈడ్చాలి!...”

అన్న గిరి మాటలకు, చెప్పుల్లో కాళ్ళు దూరుస్తున్న వాసు ఓసారి అతన్ని చూసేసి, బయటికి నడిచాడు.

“చూసారా, వాడి పొగరు? తనకన్నా పెద్దవాళ్ళు ప్రశ్నిస్తే ఒక్క సమాధానం ఇచ్చాడా? పైగా ఆ లెక్క చెయ్యని చూపులొకటి. ఛ! ఛ! ఇదంతా మన తెలివితక్కువతనంవల్లే జరుగుతున్నది. మధ్యాన్నం ఆ వెధవ ఇంటికి రానియ్యండి. పళ్ళు రాలగొట్టి, ఎంత డబ్బు వచ్చిందో అని అడిగితే, చచ్చినట్లు బదులిస్తాడు.”

గిరి అంటున్న మాటలు వాసు చెవుల్లో పడుతు న్నాయి.అన్నయ్య మాటలు చెవుల్లో పడకూడదని అతను త్వర త్వరగా అడుగులు వేసుకొంటూ తన ఇంటిని దాటి పోయాడు.

సావిత్రమ్మ నోట్లని లెక్కిస్తుంటే, నోట్ల మధ్య కాయితంలాంటిది కనిపించింది.

ఆ చీటీ తీసి "గిరీ! ఈ చీటీ ఏమిటో చదువు. వాసూ ఇచ్చిన డబ్బులతో కలిసిపోయి వుంది"అని అతడికి చీటీని అందించింది.

గిరి ఆ చీటీలోని సారాంశాన్ని బయటకే చదివాడు.

"మైడియర్ వాసూ,

రేపు సాయంత్రం ఆరుగంటలకు శ్రీవిలాస్ దగ్గరకు రా, నీకు ఒక రహస్యాన్ని చెప్పాలి. వస్తావు కదూ.

ఇట్లు
నీ శ్రేయోభిలాషి."

"నేను చెప్తే విన్నారా, మీ రెండవకొడుక్కి వెనుక ఏదో వుందని?" గిరి వ్యంగ్యంగా అన్నాడు.

సుందరరావు ఏదో ఆలోచనల్లో పడ్డాడు.

కొడుకు చేతుల్లోంచి ఆ చీటీని లాక్కొని మరోసారి చదివాడు.

"గిరీ, వాసుని ఇకనుంచి జాగ్రత్తగా గమనించాలి," అన్నాడు.

"నాన్నా, ఈ చీటీ అసలు ఎప్పటికి వ్రాయ బడిందో?" చిన్నకొడుకు వెంకటేష్ అనుమానంగా అడిగాడు.

"రఘూ, ఈ చీటీ ఇంతకుముందు రోజుకు సంబంధించి

నదే అయితే అన్నయ్య సాయంత్రం వేళలో కొట్లో వుండకూడదు. కానీ అన్నయ్య ఏనాడూ కొట్టు వదలి పోలేదు. ఈ చీటీ ఈరోజుదో, రేపటిదో'' అంది డిటెక్టివ్ కథలు బాగా చదివే సుమ.

గిరి చెల్లెలివంక మెచ్చుకోలుగా చూస్తూ ''గుడ్! చాలా తెలివిగా చెప్పావు'' అని అన్నాడు.

''గిరీ! సుమ అన్నట్లుగా ఈ చీటీ ఈరోజుదో, రేపటిదో, అయివుండాలి. అలా కాని అయితే వాసు ఈ సాయంత్రం కాని, రేపు సాయంత్రంకాని, ఆ శ్రేయోభిలాషిని కల్సుకొంటాడు. కనుక వాసు బయటికి వెళతాను అని అడిగితే ఎవ్వరూ కాదనకండి. వాడు ఆ శ్రేయోభిలాషిని కల్సుకొని, ఏం మాట్లాడుతాడో, ఆ శ్రేయోభిలాషి వాసుతో ఏ రహస్యాన్ని చెప్తాడో విని తీరాలి,'' అన్నాడు సుందర్రావు.

## 3

మధ్యాహ్నం యింటికి వచ్చిన వాసు భోజనం చేస్తూ—

''అమ్మా, ఈ ఒక్క పూటా అన్నయ్యని షాపు చూడ మనవూ?'' అని దీనంగా ముఖంపెట్టి అడిగాడు.

అంతా మొదటే ప్లాను వేసుకోవటంతో ''అలాగే వాసూ, గిరి ఫ్రెండ్ ఇంటిలో పార్టీ వుందని అంటున్నాడు వెంకటేష్‌ని చూడమంటానులే'' అని అంది సౌమ్యంగా.

తల్లి అంత సౌమ్యంగా మాట్లాడటం అదే మొదటి సారి కావటంతో అతను ఖంగు తిన్నాడు.

''అవును కానీ, వాసూ, సినిమాకి వెళతావా? డబ్బులు ఏమైనా కావాలా?''

తల్లి అలా అడిగేసరికి తబ్బిబ్బుపడ్డ వాసుకు పాల మారింది.

"మంచినీళ్ళు త్రాగు నాయనా, ఎవరో తలచుకొంటున్నట్లు వున్నారు" అని సావిత్రమ్మ కొడుక్కి మంచినీళ్లు అందించింది.

గ్లాసుడు నీళ్లూ గటగటా తాగేసి, "సినిమాకు కాదు. ఓ ఫ్రెండ్‌ని కలవాలి" అని అన్నాడు.

అతను భోజనం చేసేసి, తన గదిలోకి వెళ్ళి, కొట్టు తాళాలు తమ్ముడి చేతికి ఇచ్చి, శ్రేయోభిలాషి తనకు వ్రాసిన చీటీకోసం వెతికాడు. ఆ చీటీ ఎక్కడా కనిపించలేదు. అతనికి తెలియదు ఆ చీటీని తనవాళ్ళ చేతుల్లో పడేసానని.

అయినా ఆ చీటీనిగురించి అతను అంతగా పట్టించుకోలేదు. చాప పరచుకొని ఆదమరచి నిద్రపోయేడు.

నాలుగున్నరకు నిద్రలేచి, నూతిదగ్గర చల్లటినీళ్ళతో స్నానంచేసి, తనకు వున్న మూడు జతల్లో కాస్త మంచిది ఓ జత తొడుక్కొని, వుంగరాల క్రాఫ్‌ని నొక్కి దువ్వి, తల్లితో చెప్పి, బయటికి నడిచాడు.

అతను బయటకు వెళ్ళిన రెండు నిముషాలకే గిరి, అతన్ని నీడలా అనుసరించాడు.

అతను శ్రీదేవి విలాస్‌కు చేరుకొనేసరికి సరిగ్గా పది నిముషాలు తక్కువ ఆరు అయింది.

ఆ హోటల్ దగ్గర నిలబడి చుట్టూ పరికించి చూశాడు.

ఆ శ్రేయోభిలాషి ఎలా వుంటాడో తెలియదు.

ఏ గుర్తునైనా పెట్టుకు వస్తానని వ్రాయలేదు.

అలాంటప్పుడు శ్రేయోభిలాషిని తను గుర్తించటం ఎలా?

వాసూ సందిగ్ధావస్థలో పడిపోయాడు.

అతను ఆ అవస్థలో కొట్టుమిట్టాడుతుండగా ఒక టాక్సీ అతని ముందుకు వచ్చి ఆగింది.

ఆ టాక్సీలోంచి ఒక సూట్‌వాలా క్రిందకు దిగి, టాక్సీ డ్రైవర్‌కు మీటర్ చార్జ్ ఇచ్చివేసి, వాసూ దగ్గరకు వచ్చాడు.

"వాసూ! నా పేరే శ్రేయోభిలాషి. నేనే నిన్ను ఇక్కడకు రమ్మని వ్రాసినది" అని అన్నాడు.

ఆ వ్యక్తిని కలవరంగా చూసాడు వాసు.

"పార్కులో మాట్లాడుకొందాం పద."

ఆ వ్యక్తి అలా అని ముందుకు నడిచాడు.

అతని ప్రక్కగా నడుస్తూ, ఓరగా అతన్ని గమనించాడు వాసు.

ఆ వ్యక్తికి యాభై ఏళ్ళు వుంటాయని గ్రహించాడు. ముఖంలో అక్కడక్కడ ముడతలు పడ్డాయి. కళ్ళ క్రింద నల్లటి చారలు, చెంపమీద చిన్న గాటు, ఆ వ్యక్తి ముఖంలోకి సూటిగా చూస్తే ఎన్నో జీవితానుభవాలు రంగరించుకొన్న వ్యక్తి అని తెలిసిపోతుంది.

ఇలాంటి వ్యక్తికి నాతో ఏం పని చెప్మా? అని లోలో ఆశ్చర్యపోయేడు వాసు.

ఇద్దరూ పార్కులోనికి వచ్చి గుల్షన్‌విల్లా గుబుర్ల వెనుక కూర్చున్నారు.

"వాసూ! నీ కథంతా చెప్పి, నిన్ను ఒక ఒడ్డుకు చేరుస్తాను. అయితే నీకు ఈ సహాయం చేసినందుకు నాకు పాతిక వేల రూపాయలు ఇవ్వాలి."

అతని మాటలు వింటున్న వాసు మొట్టమొదటిసారిగా పడి, పడి, నవ్వాడు.

"వాసూ! నా వర్డ్స్ విట్టీగా విన్పించాయా?"

"యస్ సార్, నా జీవితంలో తొలిసారిగా ఇంత చక్కటి విట్ విని, మనసునిండుగా నవ్వే తొలిరోజు ఇదే" వాసు మృదువుగా నవ్వాడు.

"ఇది విట్ కాదు వాసూ, నీ జీవితాన్ని పూబాటలో నడిపే తొలిమాట."

వాసు వింతగా చూసాడు.

"నీకు రాజా జగపతిగార్ని తెలుసా?" సూటిగా ప్రశ్నించాడు.

"ఆయన్ని ఎన్నడూ చూడలేదుకానీ, ఆయన్ని గురించి చాలా మంది గొప్పగా చెప్పుకోవటం విన్నాను..."

"మిస్టర్ వాసూ! ఇప్పుడు నేను చెప్పబోయే మాటలు వింటే నువ్వు ఏమైనా కావచ్చు.విన్న తరువాత ఎలాంటి ఆవేశానికి గురికాకూడదు."

"చెప్పండి" వాసు పచ్చటి గడ్డిపరకలను తుంచుతూ అన్నాడు.

"నువ్వు రాజా జగపతిగారి బిడ్డవు ... రాజా రమేష్‌వి."

వాసు, ఆయనవంక పిచ్చిపట్టినవాడులా చూసాడు.

ఆ చూపుల్లో రక, రకాల భావాలు కలగాపులగంగా కదలాడాయి.

"మీరూ...మీరూ..."

వాసు ఇంకా ఆ షాక్ నుంచి తేరుకోలేనివాడిలా తన మాటలను పూర్తి చెయ్యలేక పోయాడు.

"ముందే చెప్పాను. ఎలాంటి ఆవేశానికి గురి కావద్దని."

"నేను ఆవేశపడటంలేదు. ఆశ్చర్యపోతున్నాను. నేను రాజా జగపతిగారి బిడ్డనని ఎలా చెప్పగలుగుతున్నారు. నాకు జన్మని ప్రసాదించినవాళ్ళు సావిత్రమ్మ, సుందర్రావుగారు. మరీ, మీరూ..." అని అంటూ అర్థోక్తిలో ఆపేసి ఆ వ్యక్తి ముఖంలోకి అయోమయంగా చూసాడు.

"వాసూ! నీ గురించి పూర్తిగా చెప్పాలంటే ముందు నన్ను గురించి చెప్పుకోవాలి. నీ చరిత్ర నాతో ముడిపడి వుంది. అయితే నా చరిత్ర విని నాకు ఎలాంటి హానీ తల పెట్టనని నువ్వు మాట ఇవ్వాలి."

వాసు ఆ వ్యక్తి ముఖంలోకి నిశ్చల దృక్కులతో చూశాడు.

"నా జన్మ రహస్యాన్ని చెప్పబోతున్నారు కాబట్టి, మీ చరిత్ర ఎలాంటిదైనా, నా గుండెల్లోనే దాచుకొంటాను," అని అన్నాడు.

ఆవ్యక్తి ముఖంలో సంతృప్తి కనిపించింది.

"నాపేరు విల్సన్. నా వృత్తి దొంగతనం. అందరి ఇళ్ళలోదూరి, ఖజానాలు కొల్లగొట్టి, నాపొట్ట, నా కొడుకుపొట్ట పోసుకు జీవించే వాడిని. రెండో మూడో హత్యలు చేసినట్లుకూడా గుర్తు."

విల్సన్ తన మాటన్ని ఆపి, వాసూ ముఖంలోకి చూసాడు.

అతని ముఖంలో చిన్న బెరుకుదనం లాంటిది కదలాడుతున్నది తన ఎదురుగా వున్నది ఒక హంతకుడని తెలుసుకునే సరికి. అతనికి జంకులాంటిది కలిగింది.

# 4

విల్సన్ పేరుమోసిన గజదొంగ!

అతనికి ముఠా అంటూ ఏదీ లేదు.

అతని కొడుకు డేవిడ్, విల్సన్ సహాయకుడు.

డేవిడ్ ని కన్న ఇరవై రోజులకే అతడితల్లి మెర్సీకన్నుమూసింది. ఆమె పోయిన నాటినుంచి విల్సన్ డేవిడ్ ని కంటికి రెప్పలా కాచుకుని పెద్దచేశాడు. తన కొడుకు తనకన్నా గొప్పవాడు కావాలనే తపనతో అరోయేటనుంచి డేవిడ్ ని తనతో దొంగతనాలకు తీసుకొని పోయేవాడు. తండ్రి నేర్పరితనాన్ని బాగా అలవర్చుకొన్న డేవిడ్ ఎనిమిదో ఏటనుంచి చాలా ట్రిక్స్ గా దొంగతనాలు చెయ్యటం మొదలుపెట్టాడు.

పగలంతా వీధుల్లోతిరిగి సాయంత్రానికి జేబునింపుకువచ్చే కొడుకుని తన గుండెలకు హత్తుకొని, ముద్దులవర్షాన్ని కురిపించేవాడు విల్సన్. రాత్రిళ్ళు భోజనాలు అయ్యాక కొడుకుని తనదగ్గర కూర్చోబెట్టుకుని "డేవిడ్! నువ్వు ఎవరితోనయినా దొంగతనానికి పోతే,పొరపాటున పట్టుబడ్డావనుకో నీ ప్రాణాలు పోయినాసరే నీ ప్రక్కవ్యక్తిని గురించి పోలీసులకు చెప్పకూడదు. ఇది మన వృత్తికి ఆయువు పట్టులాంటి ముఖ్యసూత్రం" అని చెప్పేవాడు.

డేవిడ్ తండ్రిమాటలను చాలా శ్రద్ధాసక్తులతో వినేవాడు.

ఆ నీతిని పాటిస్తానని తండ్రికి ప్రమాణంకూడా చేశాడు.

డేవిడ్ కు పదిహేను ఏళ్ళువచ్చాయి.

కొడుకు పెద్దవాడు అవుతుంటే విల్సన్ ఆశకూడా పెరిగిపోసాగింది.

తన కొడుకు లక్షాధికారి కావాలన్న ఆశతో ఓరోజు జగపతిగారి బంగళాకి కన్నంవేశాడు.

డేవిడ్ నికూడా వెంట తీసుకుపోయాడు.

బయటవున్న కాపలాదారులకు మత్తుమందు వాసన చూపించి, తెలివిని తప్పించాడు.

రాజాగారి ఖజానావున్న గదిలోకి వచ్చారు ఇద్దరూ. తమ దగ్గరున్న మారుతాళాలతో నగలపెట్టె తెరచి నగలన్నీ రెండు మూటలు కట్టారు.

ఆ సమయంలో పక్కగదిలో పసికందైన రాజాగారి కుమారుడు ''రమేష్'' ఏడుపు లంకించుకున్నాడు.

వసుంధరాదేవి నిద్ర మేల్కొంది.

ఆమెకు పక్కగదిలో శబ్దాల్లాంటివి వినిపించి భర్తను లేపింది. రాజా జగపతిగారు వంటవాడిని, పక్కగదుల్లో వున్న నౌకర్లని లేపారు. అంతాకలసి విల్సన్ వాళ్ళువున్న గదివైపు నడిచారు.

బయట అడుగుల ధ్వనివిని విల్సన్, కొడుకుతో బయటికి పరుగు తీశాడు.

ముందు విల్సన్, ఆ వెనుక డేవిడ్ పరిగెడుతూంటే, రాజా జగపతిగారు ఆయన నౌకర్లు వారివెనుక పరిగెట్టారు.

విల్సన్ తాము వేసుకుని వుంచుకున్న తాడు సహాయంతో క్రిందకు జారిపోయి, కొడుకు వస్తాడన్న ఆశతో ఓ పొదలో నక్కివున్నాడు.

అయితే అతను వూహించినట్లు డేవిడ్ తండ్రిని చేరుకో లేక పోయాడు.

పరిగెడుతుండగా కాలికి ఏదో అడ్డంపడి, తూలి ముందుకు పడిపోయి నౌకర్లకు దొరికిపోయాడు.

రాజా జగపతిగారు వుగ్రులైపోతూ డేవిడ్ చెంప మీద బలంగాకొట్టి—"నీతో వచ్చినవాడు ఎవడు" అని ప్రశ్నించాడు.

డేవిడ్ తలవంచేసాడేకానీ నోరు విప్పలేదు.

అతడి మౌనాన్ని చూసి, రాజా జగపతిగారు రెచ్చి పోయేరు.

"ఈ వెధవని పోలీసు స్టేషనుకు అప్పజెప్పండి. వాళ్లు వీడి నోట్లోంచి నిజాన్ని కక్కిస్తారు" అని అరిచాడు.

డేవిడ్ భయంతో కంపించిపోయాడు.

తను దొరికిపోతే, తనచేత తనతండ్రి ఎక్కడున్నదీ పోలీసులు చెప్పిస్తారని భయపడిపోయాడు.

తన శరీరాన్ని వుక్కుకడ్డిలా బిగించి, తనని పట్టు కొన్నవారిని ఒక్కవిసురు విసిరి ఖంగారుగా ముందుకు పరిగెట్టాడు.

అంతా డేవిడ్ వెంటపడ్డారు.

అతడికి ఎటూ పోవటానికి మార్గం కనిపించలేదు.

ఆఖరికి వారికి దొరికిపోవటం ఇష్టంలేక మేడమీద నుండి కిందకు దూకేసాడు.

తన కొడుకు వస్తాడని ఎదురుచూస్తూన్న విల్సన్ కొడుకువేసిన హృదయ విదారకమైన కేకనువిని గాబ రాగా పొదల్లోంచి బయటకు వచ్చి చూశాడు. డేవిడ్ రక్తపు మడుగులో పడివున్నాడు.

విల్సన్ ఆక్షణాన తను ఒక దొంగను అన్న విష యాన్ని పూర్తిగా మరచిపోయాడు. ఒక కన్నతండ్రిలా పరుగునవెళ్ళి డేవిడ్ శవంమీదపడి రోదించాడు.

రాజా జగపతిగారు తదితరులంతావచ్చి విల్సన్ పారి పోకుండా బంధించి, ఆ దుఃఖసమయంలో అతన్నిపోలీసు స్టేషనుకు అప్పగించారు.

జైలు గోడలమధ్య కూర్చున్న విల్సన్ రాజా జగపతి గారిమీద కత్తికట్టాడు. తన కొడుకును తనకు దక్క నీయకుండా చేసినందుకు వారి కుమారుడు రమేష్‌ను ఎత్తుకుపోవాలని అనుకొన్నాడు.

విల్సన్ తోటి ఖయిదీ సహాయంతో జైలునుంచి పారి పోయాడు.

పోలీసులు అతడికోసం వేట ప్రారంభించారు.

విల్సన్ వారంరోజులు రహస్య ప్రదేశంలో దాక్కొని వారం తరువాత తన వేషాన్ని పూర్తిగా మార్చుకొని బయటకు వచ్చాడు.

భుజాలవరకూ గిరజాల జుత్తు, చెవులకు కమ్మలు, నుదు టన విభూతినామాలు, మెడలో రుద్రాక్షమాలలు, కాషాయరంగు వస్త్రాలు, చేతిలో జపమాల.

ఈ మేకప్‌లోవున్న విల్సన్‌ని ఎవ్వరూ పోల్చుకోలేక పోయారు.

మర్రిచెట్టుక్రింద పులి చర్మపుతోలు పరచుకొని, దాని మీద కూర్చొని, తనకు తెలిసిన వాళ్ళందరి జాతకాలను చెప్పేవాడు.

అతను చెప్పే ప్రతివిషయం జరిగి వుండడంతో అంతా అతన్ని మహాయోగి అని, భక్తిశ్రద్ధలతో కొలువసాగేరు.

ఈ సంగతి రాజా జగపతిగారికి, వసుంధరాదేవికి తెలిసింది.

ఆ ఇద్దరికి స్వాములంటే అమితమైన భక్తి.

తమ వూరికివచ్చిన విల్సన్‌ని తమ ఇంటికి విందుకు ఆహ్వానించారు.

పంచభక్ష్య పరమాన్నాలతో విందునొసంగి విల్సన్‌ని ఆ రాత్రికి తమయింట విశ్రాంతి తీసుకోమన్నారు.

విల్సన్ ఆ సమయం కోసమే ఎదురు చూస్తున్నాడు.

ఈ ఒక్క రాత్రి చాలు తను అనుకొన్న పని సిద్ధించటానికి.

వసుంధరాదేవి, అతను విశ్రమించేందుకు గదిని చూపించి, ముగ్గురు నౌకర్లను ఇద్దరు దాసీలను వుంచి, వెళ్ళింది.

విల్సన్ పరుపుమీదవాలి నిద్ర నటించాడు.

సరిగ్గా పన్నెండు గంటలు అయ్యాక లేచాడు. తన చుట్టూవున్న వారికి, నౌకర్లకు మత్తుమందు వాసన చూపించాడు.

తన కాషాయ వస్త్రాలని వదిలేశాడు. లోపల ఫుల్ సూట్ వున్నది. విగ్గుతీసి మంచంపై పడేసి, రివాల్వర్ తీసి చేతోపట్టుకొని రాజా జగపతిగార్ని, వసుంధరాదేవిని నిద్రలేపాడు. విల్సన్‌నిచూసి యిద్దరూ అదిరిపడ్డారు.

వసుంధరాదేవి పక్కలోవున్న చిన్నారి రమేష్‌ని చటుక్కున తీసుకొని "రాజా జగపతి గారూ! ఆ గోణా నానుంచి నా బిడ్డని వేరుచేసారు. అందుకే మీమీద కక్షతో మీ కొడుకుని ఎత్తుకుపోతున్నా. నాలాగేమీరు

మీ బిడ్డకోసం కుళ్ళికుళ్ళి ఏడవాలి. అప్పటికిగాని వొక తండ్రి గుండెల్లో ఎంతటి వేదనను రగిలించినది మీరు తెలుసుకోలేరు'' అని అన్నాడు.

''విల్సన్ నీకు ఇది న్యాయం కాదు. దొంగతనాలకు వచ్చిన మిమ్మల్ని పట్టుకోవాలని అనుకోవటం నేరంకాదు నీ కొడుకు తనంత తానుగా చనిపోతే, అందులకు బాధ్యులం మేముకాదు. నీకు కసిగావుంటే నన్నుకాల్చి చంపు. అంతేకాని, మాకువున్న ఒకేఒక వంశాంకురాన్ని మాకు దూరంచెయ్యకు. ఆ బిడ్డతెప్పించి, మరోబిడ్డపుట్టే అదృష్టంలేని నాభార్యకు పుత్రశోకాన్ని కలుగజేయకు.''

రాజా జగపతిగారు కన్నీటితో దీనంగా అర్థించారు.

విల్సన్ పడి, పడి నవ్వాడు.

''ఇలాగే బాధపడండి, రాజాసాబ్! అంతస్తుల్లో ఆదమరచి నిద్రపోయి, అష్టఐశ్వర్యాలను అనుభవించి పంచభక్ష పరమాన్నాలను ఆరగించే మీరు, కన్న కొడుక్కు దూరమైన హృదయవేదననికూడా తెలుసుకోవాలి.''

విల్సన్ ట్రిగర్ మీద వేలుంచి, ''మీరిద్దరూ ఏమాత్రం కదిలినా, ఈ పసివాడి ప్రాణాలు గాలిలో కలిసిపోతాయి, జాగ్రత్త!'' అని హెచ్చరించి బయటికివచ్చి, గది తలుపులు బయట గడియపెట్టి, వీధిలోకి నడిచాడు.

చిన్నారి రమేష్ మెడలో బంగారు గొలుసు, దానికి పెద్ద పతకం, ఆ పతకంలో రాజా జగపతిగారిది, వసుంధరాదేవిది చిత్రపటం వుంది.

విల్సన్ ఆ గొలుసు తీసేసి ఒక రహస్య ప్రదేశంలో దాచాడు.

అతడి మెదడులో రకరకాల ఆలోచనలు పరిగెడుతున్నాయి.

చిన్నారి రమేష్ బ్రతికివుంటే తనకు ఎప్పటికైనా లాభం వుందని అనుకొన్నాడు.

ఈలోగా పోలీసులు అతన్ని గురించి వెతకటంలో విల్సన్ ఆ పసికందుతో ఒక ట్రైన్ ఎక్కాడు.

ట్రైన్‌లో అతనికి సుందరరావు, సావిత్రమ్మ పరిచయమైనారు. సావిత్రమ్మ చేతుల్లో సంవత్సరం పిల్లడు గిరి ఆదమరచి నిద్రపోతున్నాడు.

విల్సన్ ఒక నిశ్చయానికి వచ్చి, తన సూట్‌కేసులోంచి పదివేల రూపాయలు తీశాడు.

"సుందరరావుగారూ! తల్లిలేని నా బిడ్డని మీరెండో కొడుకులా పెంచితే, యీ పదివేలు మీకిస్తాను. అంతేకాక, ప్రతిఏటా కొంత సొమ్ము పంపుతాను. ఏమంటారు?" అన్నాడు.

ఆ ఇద్దరూ డబ్బాశతో రమేష్‌ని పెంచుకొందుకు సిద్ధపడ్డారు. విల్సన్ తన డైరీలో వారి చిరునామా వ్రాసుకొన్నాడు.

ఆ తరువాత విల్సన్ ఒక సంవత్సరం మాత్రమే పోలీసుల కళ్ళు కప్పి, దొంగతనాలు చేసాడు.

ఒక హత్య కేసులో మాత్రం పోలీసులకు దొరికిపోయేడు.

కోర్టు అతనికి పదిహేడు ఏళ్ళు కఠిన శిక్షని విధించింది. ఆ శిక్షను అనుభవించక తప్పిందికాదు అతనికి.

ఆ శిక్ష అనుభవించి, బయట ప్రపంచంలోనికి వచ్చాక ముందుగా అతడి స్మృతిపథంలో మెదలింది రాజా రమేష్.

# 5

"వాసూ! జైలునుంచి బయటపడ్డాక తొలిసారిగా నీవే గుర్తువచ్చావు.

నిన్ను పెంచటానికి డబ్బు ఇస్తానని సుందర్రావుతో అన్నాను. కానీ అనుకోకుండా నేను జైల్లో కూర్చున్నాను. నీ పెంపకానికి పైసా ఇవ్వలేదన్న కోపంతో నిన్ను ఎంత హీనంగా చూస్తున్నారో అనుకొంటూ, నీ వూరు వచ్చాను.

నేను మీ ఇంటికి వస్తుంటే నీవు మీ ఇంట్లోంచి వస్తూ కనిపించావు. ఆ ప్రక్క వాళ్ళని నీ గురించి అడిగితే నీ పేరు వాసు అని, సుందర్రావు రెండవ కొడుకని చెప్పారు. నేను నీ వెంట వచ్చి, నీవు సాగిస్తున్న జీవనాన్ని చూసాను.

అంతటి జమీందారు బిడ్డవి — ఒక కిల్లీ కొట్లో కూర్చుంటే నాకు చాలా బాధగా అనిపించింది. అందులో నా స్వార్థం వుందనుకో. ఇప్పుడు నిన్ను నీ తల్లి తండ్రులకు అప్పగించి, నీకు చేసిన మేలుకు ప్రతిగా కొంత డబ్బుని తీసుకొని, ఏదో వ్యాపారాన్ని చేసుకొంటూ ప్రశాంతంగా జీవించాలని అనుకొన్నాను.

చిన్ననాడు నిన్ను ఎత్తుకువచ్చినపుడు నీ మెడలో వుండే గొలుసు నీ జన్మ రహస్యాన్ని తెలిపేందుకు అతి ముఖ్యమైనది. ఆ గొలుసుకోసం నా వూరు వెళ్ళాను.

నేను గొలుసు తీసుకొని, రాజా జగపతిగారికోసం వెళ్ళాను. ఆయన ఆ వూరిలో లేరు. అతి కష్టంమీద ఆయన వివరాలు తెలుసుకొన్నాను. రాజా జగపతిగారు ఇప్పుడు ఈ వూరిలోనే వుంటున్నారు.

నేను ఈ వూరు వచ్చి, ఒక రూమ్ తీసుకొన్నాను. రాజా జగపతిగారి బంగళాని చూసాను. నీతోనే ఆయన దగ్గరకు వెళ్ళాలి. రేపు ఉదయం నువ్వు నా రూమ్‌కు ఎనిమిది గంటలకు వస్తే ఇద్దరం కలిసి రాజా జగపతి గారి బంగళాకు వెళదాం" చెప్పాడు విల్సన్.

వాసు రెప్పలైనా ఆర్పకుండా విల్సన్‌ని చూస్తున్నాడు.

తను రాజా-రమేష్‌ని అని తెలుసుకొన్న అతడి గుండెలు ఆనందంతో ఎగిరెగిరి పడుతున్నాయి.

"విల్సన్! ఆ గొలుసు తెచ్చావా? ఒక్కసారి నా తల్లి తండ్రులను చూసుకొంటాను" అని అడిగాడు ఆశగా.

"లేదు వాసూ! అది నా పెట్లోనే వుంచేసాను. రేపు నువ్వు వస్తే ఇద్దరం నీ తల్లి తండ్రుల ఇంటికి వెళదాం!"

"మీ రూమ్ ఎక్కడుందో చెప్పండి. రేపు వస్తాను."

విల్సన్ తను ఎక్కడున్నదీ వివరాలు చెప్పి, లేచి నిలబడ్డాడు.

వాసూ కూడా లేచి నిలబడి, ప్యాంట్ కంటుకొన్న ధూళిని దులుపుకొన్నాడు.

వాసు చాలా వుషారుగా ఇంటికి వచ్చాడు.

అతను ఇంటికి వచ్చేసరికి అంతా అతడితో మామూలుగానే మాట్లాడారు.

సావిత్రమ్మ వాసుకి ముందు భోజనం పెట్టేసింది.

అతను భోజనం చేసేసి, తన గదిలోకి వెళ్ళిపోయి, తృప్తిగా నిద్రపోయాడు.

వాసు తిన్నాక మిగిలిన వాళ్ళంతా భోజనం చేసేసి, గిరి రాకకోసం ఎదురుచూడసాగారు. ఎనిమిది గంటలకు వచ్చాడు గిరి.

తనవాళ్ళందర్నీ గదిలో కూర్చోబెట్టి, తలుపులు బిగించి, "వాసూ! మీ కొడుకు కాదు కదూ?" అని ప్రశ్నించాడు తల్లి తండ్రులను. ఆ దంపతులిద్దరూ గతుక్కుమన్నారు.

"గిరీ! ఇప్పుడు వాసుని కల్సుకొన్నది విల్సన్ కదూ? వాడికి ఒక్కడికే వాసూ జన్మరహస్యం తెలుసు. ప్రతి ఏటా డబ్బిస్తానన్న వెధవ ఇప్పుడు కనిపించాడా?" అన్నాడు కోపంగా.

"నాన్నా! మీరు అనుకొనేంత తేలికైన జన్మ రహస్యం కాదు వాసుది. వాడు రాజా జగపతిగారి బిడ్డ. రాజా-రమేష్."

అంతా తెల్లబోయారు.

గిరి నెమ్మదిగా వాసు చరిత్రనంతటినీ చెప్పి—

"నాన్నా! వాసు రాజా-రమేష్ అని తెలిసినది, ఒక్క విల్సన్‌కు, వాసుకి. ఆ ఇద్దర్నీ ఎలాగైనా తప్పించేస్తే, మనం కోటికి పడగలెత్తవచ్చు," అని అన్నాడు.

సుందర్రావు కళ్ళు మెరిసాయి. "గిరీ! నిజమే ఈ రాత్రికి ఆ ఇద్దర్నీ చంపేయాలి. నువ్వు రాజా-రమేష్ స్థానంలో నిలబడాలి" అన్నాడు ఉత్సాహంగా.

## 6

వాసుకి హఠాత్తుగా మెలకువ వచ్చింది.

కళ్ళు తెరచి చూసిన అతనికి, ఏదో ఆకారం మెల్లగా తలుపులు తోసుకురావటం కనిపించింది.

చటుక్కున లేచి కూర్చొని—"ఏయ్, ఎవరదీ?" అని ప్రశ్నించాడు గంభీరంగా.

ఆ ఆకారం గాబరాగా పరిగెట్టింది.

వాసు ఆశ్చర్యంగా లేచి వెళ్ళి తలుపులు గడియపెట్టుకొన్నాడు. కిటికీ తలుపులు మూసేసాడు.

అయినా అతనికి గుండెల్లో వణుకు తగ్గలేదు. అంత రాత్రి ఇంట్లో వాళ్ళను లేపటానికి మనసొప్పలేదు.

తన గదిలోనికి వచ్చిన ఆ వ్యక్తి ఎవరు? అతను తన గదిలోకి ఎందుకు వచ్చాడు? తనదగ్గర ఏముందని?

అతను అలా తెల్లవార్లూ మేలుకొనే ఆలోచించసాగాడు. కానీ అతనికి సమాధానం లభించలేదు.

ఉదయాన్నే లేచి, స్నానం అదీ కానించి డ్రెస్ చేసుకొంటున్నాడు వాసు.

సావిత్రమ్మ పాల గ్లాసుతో వచ్చింది.

"వాసూ! రాత్రి సరిగ్గా భోజనం చెయ్యలేదు. ఈ పాలు తాగు బాబూ!" అని పాలగ్లాసును అందించింది.

కాఫీ అయినా సరిగ్గా ఇవ్వని తల్లి, పాలు తెచ్చి ఇచ్చేసరికి వాసు చాలా ఆశ్చర్యపోయాడు.

మౌనంగా తల్లి చేతిలో గ్లాసు అందుకొన్నాడు.

ఆవిడ అక్కడ వుండకుండా వెళ్ళిపోయింది.

వాసు గ్లాసు టేబిల్ మీద పెట్టి, షర్ట్ వేసుకొంటుంటే, టేబిల్ మీద పెట్టిన పాలగ్లాసు క్రిందపడింది. ఒక నల్ల పిల్లి నాలుగు కాళ్ళమీదుగా కూర్చొని, పాలను చప్పరిస్తున్నది.

ఆదే సమయంలో సావిత్రమ్మ లోపలికి వచ్చి, ఆ దృశ్యాన్ని చూసి, పిల్లిని తరిమివేసింది.

ఆవిడ గొంతులో ఏదో నిరాశ ధ్వనిస్తున్నది.

వాసు గబగబా బయటకి వెళ్ళిపోయాడు.

అతను తన వీధిని దాటబోతుండగా ఓ ప్రక్కన అదే నల్లటి పిల్లి నురగలు కక్కుతూ కనిపించింది.

దాని ముందరి కాళ్ళమీద, మీసాలనిండా పాల గుర్తులు కనిపిస్తున్నాయి. వాసు ఆశ్చర్యంగా ఆ పిల్లిని చూశాడు.

ఐదు నిముషాలు ఆ పిల్లి నురగలు క్రక్కి ప్రక్కలు ఎగరేసి- ఆ తరవాత గుడ్లు నిలబెట్టేసింది.

వాసు రోడ్ మీద నడుస్తున్నాడే కాని, అతని మస్తిష్కంనిండా గజిబిజిగా ఏవేవో ఆలోచనలు ఈగల్లా ముసురుతున్నాయి.

పాలు త్రాగినందుకే ఆ పిల్ల చనిపోయిందా?

అలా ఆలోచిస్తూనే విల్సన్ ఇంటికి చేరుకున్నాడు.

విల్సన్ ఇంటిముందు, ఇంటిలోపల చాలా మందిజనం గుమికూడి వున్నారు.

వాసు గాబరాగా అందర్నీ నెట్టుకుంటూ లోపలికి వెళ్ళాడు. మంచంమీద విల్సన్ శవాన్నిచూసి విభ్రాంతితో అలాగే నిలిచిపోయాడు.

విల్సన్ గుండెల్లో పిడివరకూ దిగబడివున్నది కత్తి.

అతని ఎడంచెయ్యి మహావిష్ణువు కాలండర్ని చూపిస్తున్నట్లు వున్నది.

"రవీ! ఈ విల్సన్ మహావిష్ణువు కాలండర్ని చూపిస్తూ మరణించాడంటే, ఇతన్ని మహావిష్ణువు పేర్లుకల వ్యక్తి ఎవరో హత్యచేసాడని తెల్సిపోతున్నది" అన్నాడు ఇన్స్పెక్టర్ రాజశేఖరం.

డిటెక్టివ్ రవీంద్ర, విల్సన్ శవాన్ని మరోసారి పరీక్షగా చూసి, తిరిగి తన చూపులను ఆ కాలండర్ మీద నిలిపాడు.

రాజశేఖరం కానిస్టేబుల్స్ అందర్నీ బయటకుపంపెయ్యమన్నాడు.

ఆ గుంపులోవున్న వాసుకూడా అందరితో బయటకు నడిచాడు.

ఇన్‌స్పెక్టర్ శవాన్ని పోస్టుమార్టమ్ చెయ్యాలనీ, ఇంటిగల ఆయనతో చెప్పి, జీప్ దగ్గరకు నడిచాడు.

డిటెక్టివ్ గోడకువున్న కాలండర్ తీసి, యెందుకో వెనక్కి తిప్పి చూశాడు. ఆత్రంగా చదివాడు.

"మెడియర్ వాసూ, నీవు రాజా రమేష్‌వని తెలుపుడు చేద్దామని ఎంతో ఆశపడ్డాను. కానీ నీ జాతకం అంతగా బాగోలేదు. అది నన్ను కొట్టింది. నిన్నరాత్రి నా ఇంటి తలుపులు ఎవరో తడితే వెళ్ళితీసాను. ఒక వ్యక్తి లోపలకు వచ్చి, అరవకుండా నా నోరు మూసేసి, కత్తితో పొడిచి నీ గొలుసు దొంగిలించి పారిపోయాడు. ఆఖరి క్షణాలలో ఇది వ్రాసాను. నువ్వు నేరుగా ఇక రాజాగారి ఇంటికే వెళ్ళి నీ చరిత్ర చెప్పుకో!

—విల్సన్"

డిటెక్టివ్‌కి అందులో సారాంశం చాలా తికమకగా కనిపించింది.

వ్రాసి వున్నంతవరకూ కట్ చేసి దాన్ని తన జేబులోకి తోసి ఇనస్పెక్టర్ వెంట నడిచాడు.

ఇనస్పెక్టర్ ఏదేదో చెపుతున్నాడు. కాని, రవీంద్ర తలకు అతనుచెప్పే ఏ ఒక్కమాట ఎక్కటంలేదు.

అతడి దృష్టిలో ఆ వృత్తరమే మెదులుతున్నది.

ఎవరా వాసు? అతను రాజా-రమేష్ ఏమిటి? రాజా జగపతిగారి అబ్బాయిని ఎవరో ఎత్తుకుపోయిన సంగతి తనకు తెలుసు. మరి ఆ లేఖలోవున్న సారాంశానికి అర్థమేమిటి? వాసు పేరుగలవాళ్ళు చాలామంది వున్నారు. అందులో ఏ వాసుకి వ్రాయబడింది ఈ లేఖ? అసలు విల్సనే ఇది వ్రాసాడా? లేక వాసు అనే అతను దీనిని సృష్టించుకున్నాడా?

డిటెక్టివ్, జీవ్ పోలీసు స్టేషన్ దగ్గర ఆగేవరకూ ఆలోచిస్తూనే వున్నాడు.

# 7

రాజా జగపతిగారు, వసుంధరాదేవి కూర్చొని వున్నారు.

దివాన్‌గారు వారికి యెదురుగా నిలిచి యేదో చెప్తున్నారు.

"దివాన్‌గారూ! మీకు ఎలా చాతనైతే అలా చెయ్యండి" రాజా జగపతిగారు నిర్లిప్తంగా అంటుండగా వాసు లోపలికి ప్రవేశించాడు.

"ఎందుకోసం వచ్చావు?" దివాన్‌గారు గంభీరంగా ప్రశ్నించారు.

"నేను రాజా రమేష్‌ని. జగపతిగారి బిడ్డని," అన్నాడు వాసు. రాజా జగపతిగారు, వసుంధరాదేవి ఆశ్చర్యపోయారు.

వాసు ఇంకా ఏదో చెప్పబోతుండగా__గిరి చిరిగిన దుస్తులతో అక్కడికి వచ్చి, రాజా జగపతి కాళ్ళదగ్గర పడ్డాడు.

వాసు, గిరిని చూస్తూనే తెల్లబోయాడు.

గిరి కుడిచేతిలో బంగారపు గొలుసు, వ్రేళ్ళాడుతున్నది.

రాజా జగపతిగారు గిరిని పైకి లేవదీసి—

"ఈ గాయాలు ఏమిటి బాబూ! ఎవరు నువ్వు?" అని ప్రశ్నించాడు ఆందోళనగా.

"నాన్నగారూ! నేను మీ అబ్బాయినండీ. రాజా రమేష్‌ని!" అన్నాడు గిరి.

రాజా జగపతిగారు అయోమయంగా చూసారు. వసుంధరాదేవి మతిపోయినట్లు ఆ యిద్దర్నీ చూడసాగింది.

"అబద్ధం!" వాసు పిచ్చిగా అరిచాడు.

గిరి, వాసూవైపు కోపంగా చూశాడు.

"ఏది అబద్ధం? విల్సన్ నా జన్మరహస్యం చెప్పి, ఈ గొలుసు నాకు ఇచ్చాక, ఇన్నాళ్లూ నన్ను పెంచారు కదా అని, నా తమ్ముడివి కదా అని నీకు నా చరిత్ర చెప్పటం అబద్ధమా? నా చరిత్ర విన్నాక ఆ రాత్రి నా గదిలోకి వచ్చి, నన్ను హత్య చెయ్యాలని చూడటం అబద్ధమా? నన్ను బంధించి, కొరడాతో కొట్టి, గొలుసు ఎక్కడ దాచానో చెప్పమని బాధించటం అబద్ధమా?" అన్నాడు కుటిలంగా.

వాసు అవాక్కయిపోయాడు. తన జీవితం ఇంత చిత్రంగా వుంటుందని వూహించుకోలేక పోయాడు అతను.

"బాబూ! గిరీ, జరిగిందంతా చెప్పూ?" వసుంధరాదేవి కలవరంగా ప్రశ్నించింది.

గిరి తన జేబులోంచి చిన్న చీటి బయటకు తీసాడు.

"అమ్మా! విల్సన్ నన్ను ఎత్తుకుపోయి, పోలీసులు వెంబడిస్తూండగా సుందర్రావుగారు, సావిత్రమ్మగారు కలిసారట. వారికి కొంతడబ్బు ఇచ్చి, నన్ను పెంచుకోమని చెప్పి, వారికి అప్పగించాడు. ఆ యిద్దరూ నన్ను కంటికి రెప్పలా పెంచారు. తమకు ఎందరు పిల్లలు పుట్టినా నన్ను ఏనాడూ పరాయివాడిగా చూడలేదు.

విల్సన్ నన్ను వారికి అప్పగించాక పోలీసులకు దొరికి పోయేడట. పదిహేడుఏళ్ళు జైలుజీవితం అనుభవించి, నా దగ్గరకు వచ్చాడు. నా ఇంటి పక్కవాళ్ళని నా గురించి అడిగితే నా పేరు గిరి అని సుందర్రావుగారి పెద్ద కొడుకనని చెప్పారు.

అప్పుడే విల్సన్ నాకు ఈచీటివ్రాసి, యెవరిచేతో పంపాడు. అతను వ్రాసిన ప్రకారం అతన్ని కలుసుకొన్నాను. విల్సన్ నా చరిత్ర అంతా చెప్పి, నాకు ఈ గొలుసు యిచ్చిపంపాడు. వాసూ అంటే నాకు ఎంతో అభిమానం. ఆ అభిమానంతో ముందుగా వాసుకి మాత్రమే నా జన్మరహస్యాన్ని తెలుపుదు చేశాను.

నేను రాజారమేష్‌ని అయ్యాక అమ్మా వాళ్ళను సర్‌ప్రయిజ్ చేద్దామని వాళ్ళకు ఈ రహస్యాన్ని చెప్పలేదు. ఆరాత్రి నాగదిలోకి ఒక ఆకారం వచ్చింది. చీకటిలో అది ఎవరయినదీ గుర్తించలేదు. తెలిసిరావటంతో ఆ ఆకారాన్ని చూసి "ఎవరూ?" అని గట్టిగా కేక వేయటంతో ఆ ఆకారం పారిపోయింది.

ఉదయం ఎప్పుడూ లేనిది వాసు స్వయంగా పాలు తెచ్చి ఇచ్చాడు. పాలు త్రాగబోతుండగా, నా ఫ్రెండ్

ఎవరో పిలవటంతో పాలగ్లాసు టేబిల్ పై పెట్టి, బయటికి వెళ్ళాను. తిరిగి లోపలకి వచ్చేసరికి పిల్లి పాలన్నీ త్రాగేసింది. పాలు తాగిన వెంటనే పిల్లి చనిపోయింది.

అప్పుడే నాకు వాసుమీద అనుమానం కలిగింది. అతను నన్ను చంపి, తనే రాజా-రమేష్‌ని అని నిరూపించుకోవాలని చూస్తున్నాడని గ్రహించి మీదగ్గరకు వస్తుంటే నన్ను ఇద్దరు రౌడీలు వెంబడించారు. గొలుసు ఒకచోట భద్రపరచాను. ఆ ఇద్దరూ ఓ సందులో నన్ను పట్టేసి, నాకు తెలివి తప్పించారు.

తిరిగి నాకు తెలివి వచ్చేసరికి, ఓ స్థంభానికి కట్టబడి వున్నాను. ఎదురుగా వాసూ కొరడాతో నిలిచివున్నాడు. గొలుసు ఎక్కడ దాచానో చెప్పమని కొరడాతో కొట్టాడు. నేను ఎంతకీ చెప్పకపోయేసరికి, "నువ్వు చెప్పినచరిత్రని రాజాగారితో చెప్పుకొంటాను. విల్సన్‌కి నీకూ ఈ చరిత్ర తెలుసు కాబట్టి, మీ ఇద్దర్నీ అడ్డు తొలగించుకొని, రాజా-రమేష్‌గా చలామణి అవుతాను అని బయటికి వెళ్ళిపోయాడు.

నేను నా దగ్గరవున్న లైటర్ సహాయంతో తాడుని కాల్చి, అక్కడనుంచి తప్పించుకొని గొలుసుతో విల్సన్ వ్రాసిన చీటీతో మీదగ్గరకి వచ్చాను" అని అన్నాడు గిరి.

రాజా జగపతిగారూ, వాసూ చెంపని 'చెళ్' మని పించారు.

"నా కొడుకుని చంపి, సమస్త భోగాలను అనుభవించాలని చూస్తావా? నిన్ను తక్షణం పోలీసులకు అప్పగిస్తాను."

ఆయన తీవ్రస్వరాన అని టెలిఫోన్ వైపు నడిచి, ఇనస్పెక్టర్ రాజశేఖరానికి ఫోన్ చేసారు.

నాలుగు ముక్కల్లో అంతా చెప్పి, తన ఇంటికి రమ్మన్నారు.

## 8

రాజా జగపతిగారు, గిరి చెప్పినదంతా డిటెక్టివ్ లకు చెప్పారు.

ఇనస్పెక్టర్ వాసు వంక తీవ్రంగా చూస్తూ—

"విల్సన్ ని నువ్వు చంపావు. విల్సన్ ని హత్యచేసే అవకాశం నీకే వుంది. గిరి తన చరిత్రను ఒక్క నీకే చెప్పాడు. విల్సన్ ని చంపేస్తే నిజం అతనితో మాసిపోతుందని నీకు తెల్సు.

గిరిని కూడా చంపాలని చూశావు. కానీ రెండుసార్లు అతను చావుని తప్పించుకొన్నాడు. విల్సన్ చనిపోయి మహావిష్ణువు కాలండర్ ని చూపించాడు. వాసు నీ పేరు. వాసు కూడా మహావిష్ణువే.

చనిపోయిన విల్సన్ నువ్వు దోషివని నిరూపించాడు. గిరి ప్రత్యక్ష సాక్షి. ఇక నిన్ను అరెస్ట్ చేస్తున్నాను" అన్నాడు గంభీరంగా.

వాసు నిలువునా వణికిపోయాడు.

"ఇనస్పెక్టర్! నేను నిర్దోషినని నిరూపించేందుకు ఒక్క అవకాశం ఇవ్వండి చాలు," దీనంగా అడిగాడు.

ఇనస్పెక్టర్ ఆవేశంగా ఏదో అనబోతుంటే, డిటెక్టివ్ అతన్ని శాంతపరచి, "వాసూ! తప్పకుండా నీకు అవకాశం ఇస్తాం. ఏమిటో చెప్పు" అని అన్నాడు.

అతని ముఖం వెలిగిపోయింది.

"సార్! సుందర్రావుగార్నీ, సావిత్రమ్మగార్ని పిలవండి. వారికి తెలుసు నేను పెంపుడు కొడుకునని" అని అన్నాడు.

డిటెక్టివ్ తన సూదంటు చూపులతో గిరి ముఖంలోకి చూసాడు_ ఆ మాటలకు అతడిలో ఎలాంటి మార్పు వస్తుందో అని.

గిరి ముఖంలో ఎలాంటి మార్పు కనిపించలేదు.

"కరెక్ట్. వార్ని రప్పించండి. మాలో ఎవరు స్వంత కొడుకో, ఎవరు పెంపుడు కొడుకో తేలిపోతుంది" అన్నాడు గిరి కూడా.

వాసు లోలోపల ఆశ్చర్యపోయాడు.

రాజా జగపతిగారు తన నౌకరును సుందర్రావు ఇంటికి పంపించాడు.

పావుగంటలో దంపతులు రాజా జగపతిగారు వున్న గదిలోకి వచ్చారు.

వార్ని చూస్తూనే ఇన్స్పెక్టర్ ప్రశ్నించాడు_

"సుందర్రావుగారూ! మీకు విల్సన్ ఒక బిడ్డని పెంచమని ఇచ్చాడు. ఆ బిడ్డ మీ పెద్ద అబ్బాయా? రెండవవాడా?"

సుందర్రావు గాబరా నటిస్తూ, "ఎందుకు ఇనస్పెక్టర్ ఇలా ప్రశ్నిస్తున్నారు?" అని అడిగాడు.

ఇనస్పెక్టర్ చిరాగ్గా చూసాడు.

"ముందు నేను అడిగినదానికి సమాధానం చెప్పండి. వాసువా? గిరా? ఎవరు మీ స్వంత కొడుకు?"

"ఇనస్పెక్టర్! గిరిని ఏనాడూ పెంపుడు కొడుకుగా చూడలేదు. వాసూకన్నా ప్రేమగా చూసుకొన్నాం.

మా రక్తం పంచుకుపుట్టిన పిల్లలకుకూడా గిరి జన్మ రహస్యాన్ని తెలుపుడు చెయ్యలేదు.''

''మోసం!'' వాసు వెర్రిగా అరిచాడు.

''వాసూ, మోసం ఏమిట్రా'' సావిత్రమ్మ అయోమయంగా అంది.

''అమ్మా! నా జన్మను తెలిసిన విల్సన్ చనిపోయేడు. మీకు నిజం తెలిసినా మీరు చెప్పటంలేదు. ఇంక నేను ఏం చెప్పేది? విల్సన్ పోవటంతో నా జీవితంకూడా పోయింది.''

''అసలు ఏమైందిరా?'' సుందర్రావు అర్థంకానట్లు నటిస్తూ అడిగాడు.

ఇనస్పెక్టర్ నాలుగు ముక్కల్లో అంతా చెప్పి, వాసూ చేతులకు బేడీలు వేసాడు.

సావిత్రమ్మ కొడుకు చేతులు పట్టుకొని, ఏడవటానికి శతవిధాల ప్రయత్నిస్తూ—''వాసూ! విల్సన్‌ని నువ్వు హత్యచేసావా? గిరిని చంపాలని చూసావా? ఇదంతా ఎందుకు చేశావురా?'' అని అంది.

వాసు ఆవిడ ముఖంలోకి చూడలేకపోయాడు.

సిగ్గుతో కాదు, అసహ్యంతో.

ఇనస్పెక్టర్ రాజా జగపతిగార్కి చెప్పి, వాసుని ముందుకు తోసి, 'పద' అన్నాడు. వాసుకి దుఃఖం ముంచుకువచ్చింది.

''గిరీ! విల్సన్ వ్రాసిన చీటీని ఇటు ఇవ్వు'' అడిగాడు డిటెక్టివ్ గంభీరంగా.

గిరి మారు మాట్లాడకుండా రాజా జగపతిగారి జేబు

లోని చీటీ, తీసుకొని రవీంద్ర చేతిలో పెట్టాడు.

ఆ చీటీని తన జేబులోని మరో చీటీని తీసి పరిశీలించాడు. రెండింటి రైటింగ్ వేరు వేరుగా వుంది.

# 9

రాజా జగపతిగారి బంగళాలో, గడియారం పన్నెండు గంటలు కొట్టింది.

గిరి హఠాత్తుగా మేల్కొన్నాడు.

తెలివి వచ్చేసికాదు, ఎవరో తట్టి లేపటంతో.

కళ్ళు తెరిచి ఎదురుగా రివాల్వర్ పట్టుకు నిల్చున్న వాసుని చూసి, వణికిపోయాడు గిరి.

భయంగా "వాసూ!" అని అరిచాడు.

"గిరీ! నువ్వూ, నేనూ తప్పించి, మిగతా వాళ్ళందరూ మత్తుమందు వాసన చూసి, ఆదమరచి నిద్రపోతున్నారు. నువ్వు గొంతు చించుకొని అరచినా, ఏ ఒక్కరు నీ సహాయానికి రారు," వాసు చిరునవ్వుతో అన్నాడు.

"వాసూ! ఇలా రావటంలో నీ వుద్దేశ్యం ఏమిటి?" వణికే కంఠంతో అడిగాడు.

"ఇంకా అర్థంకాలేదా? విల్సన్‌ని చంపానని, నీమీద హత్యాప్రయత్నాలు జరిపానని కోర్టు నాకు మరణశిక్ష విధించి తీరుతుంది. ఒకర్ని చంపినా, ఇద్దర్ని చంపినా, నాకు మరణశిక్ష వేస్తారు. శిక్ష అనుభవించేముందు నీమీద కక్ష తీర్చుకోవాలనుకొని జైలు నుంచి పారిపోయి వచ్చాను.

నేను ఎలాగూ చావవలసినవాడినే. న్యాయంగా నేను అనుభవించవలసిన సంపద నువ్వు అనుభవించటం

అన్యాయం. న్యాయం నీ చేతుల్లో నలిగిపోయింది. అన్యాయం నా చేతుల్లో ఆహుతి కాబోతున్నది. సుందరరావు కొడుకుగా చెప్పుకొనే నేను, రాజా జగపతిగారి కొడుకుగా చెలామణి అవుతున్న నువ్వూ—మన ఇద్దరూ ఈ భూమ్మీద బ్రతకటానికి వీల్లేదు."

వాసు ట్రిగ్గర్ మీద తన వేలుని బిగించాడు.

"వాసూ!" గిరి ఖంగారుగా అరిచాడు.

"వాసూ! జరిగినది అంతా మరచిపో, ఇప్పుడు నేను రాజారమేష్‌ని కాదూ అన్నా ఎవరూ నమ్మరు! నన్ను చంపినా, రాజారమేష్‌వు కాలేవ్!!"

"అందుకే నాతోపాటూ నువ్వూ చావాలంటున్నా?"

"ఇద్దరం చస్తే, ఈ ఆస్తి అంతా అనాధ శరణాలయాలకి పోతుంది. నేను బ్రతికివుంటే, కొద్దిరోజుల్లో ఆస్తి నా పరం అవుతుంది. నీకు కొన్ని లక్షలు ఇస్తాను. ఆ డబ్బుతో దూరదేశాలకు పారిపోయి, సుఖంగా జీవించు. ఇంతకాలం నిన్ను పెంచినందుకైనా అమ్మ ముఖం చూసి నన్ను వదిలిపెట్టెయ్!" దీనంగా బ్రతిమాలాడు.

గిరి మాటలకు వాసు ఆలోచిస్తున్నవాడిలా భృకుటి ముడిచాడు.

"నా మాటలు విను వాసూ! నిన్ను పోలీసుల దృష్టిలో పడకుండా దాస్తాను."

వాసు పక పకా నవ్వాడు. "విల్సన్‌ను నేను చంపానని చెప్పి, నన్ను జైలుకు పంపినవాడివి. నీ మాటలు నమ్మేదెట్లా?"

"విల్సన్‌ని నేనే చంపాను. వుత్తరంకూడా నేనే తారుమారు చేశాను. అవన్నీ మరచిపో వానూ! ఇప్పుడు మనం ఒకటిగా వుందాం!" అన్నాడు గిరి, వానుని ఎలాగైనా నమ్మించాలని.

"థేంక్స్ గిరీ! నిజాన్ని నీ నోటితోనే చెప్పేసావు. ఇప్పుడు శిక్షపడేది నాకుకాదు, నీకు! నీ మాటలన్నీ టేప్ రికార్డరులో భద్రపరచాను."

గిరి, వానూమీదకు ఒక్క ఎగురు ఎగరబోయాడు.

"ఊఁ! గిరీ! ఒక్క అడుగు ముందుకు వేస్తే,చస్తావ్!" గర్జించాడు ఇన్‌స్పెక్టర్, తలుపులు తోసుకొని లోపలికి వస్తూ.

ఎదురుగా ఇన్‌స్పెక్టర్, రాజా జగపతిగారు, వసుంధరాదేవి, డిటెక్టివ్ నిలిచివున్నారు. గిరి ఎలాంటి సాహసాన్ని చెయ్యలేకపోయాడు. అవమానంతో తల దించుకున్నాడు.

ఇన్‌స్పెక్టర్, గిరికి బేడీలు వేసాడు.

"మిస్టర్ గిరీ! వానూ నిజంగా జైలునుంచి పారిపోలేదు. మేమే అలా చెప్పించాం. వానూ జీవనాన్ని తెలుసుకొన్నాం. నువ్వు ఎలా జీవిస్తున్నది తెల్సుకొన్నాను. వానూ కన్నకొడుకే అయితే పెంపుడు కొడుకువైన నిన్ను ప్రేమగా ఎందుకు చూస్తారు. అంతేకాదు, వానుని అరెస్టు చేసినప్పుడు వాళ్ళు కనీసం బాధకూడా పడలేదు.

వాను విల్సన్‌ని కల్సుకొన్నట్లు శ్రీదేవీవిలాస్ దగ్గర బిచ్చగాడు స్పష్టంగా చెప్పాడు. నీ నోటివెంట నిజాన్ని తెల్సుకొందుకే ఈ ప్లాను వేసాం. నిన్నే కాదు, నువ్వు

తప్పటడుగు వేస్తుండగా నిన్ను సరిదిద్దకుండా, వాసు జన్మరహస్యాన్ని దాచిన నీ తల్లి, తండ్రులకికూడా పడతాయి బేడీలు!"

ఇన్‌స్పెక్టర్ గంభీరంగా అంటూంటే, గిరి తల వంచేసుకొన్నాడు.

డిటెక్టివ్ రవీంద్ర, వాసు భుజాన్ని తట్టి, "వాసూ! ఇకనుంచి నీవే రాజారమేష్‌వు" అన్నాడు.

వాసు కళ్ళు మిల, మిలా మెరిశాయి. తల్లిదండ్రులకు పాదాభివందనం చేశాడు.

రాజా జగపతిగారు, వసుంధరాదేవిగారల కళ్ళు అశ్రువులతో నిండిపోయాయి.

—:ఐపోయింది:—

# మృత్యు బహుమతి!

## లలితకుమారి

"మిస్టర్ సారధీ! బహుశా నీకు, అరేబియా సముద్రం లోని కోరాకో దీవి గురించి క్షుణ్ణంగా తెలుసను కుంటాను" అన్నారు మా సి. బి. ఐ. డైరెక్టరు ముఖర్జి గారు పైప్ లో పొగాకు దట్టిస్తూ.

"తెలుసు! చాలా విశాలమైన దీవి అది. ఆఫ్రికా దేశాలకు చేరువలో సముద్రం మధ్యవుంది. భూమధ్య రేఖ దానిమీదుగా ఆఫ్రికా ఖండంవైపు వెళుతుంది. కనక ఆ దీవిలో వేడి అధికం.

అక్కడి ప్రజలు దాదాపు నీగ్రోలను పోలివుంటారు మరీ అంత నలుపు కాకపోయినా! అక్కడ రాజరిక పాలన అమలులోవుంది. ఆ దీవి రాజు పేరు గోరంగో!

అతనికి 32 మంది భార్యలూ, 45 మంది సంతానమూ ఉన్నారుట!" అన్నారు ఆసక్తిగా చూస్తూ.

ఆయన నవ్వి "అంతా బాగానే వుందిగానీ, చాలా ముఖ్యమైన, ఆరాజుకు ప్రపంచ ఖ్యాతి తెచ్చిపెట్టిన అభిరుచి విషయం చెప్పావుకావు!" అన్నారు పైప్ వెలిగిస్తూ.

"ఏమిటది?" అడిగాను కుతూహలంగా.

"ప్రతి రాజుకూ సంస్థానాధీశులకూ కొన్ని విచిత్రమైన హాబీలుంటాయని ఒప్పుకుంటావా? కొరాకో దీవి రాజుక్కూడా ఓ హాబీవుంది.

అతను ప్రపంచంలో ఖ్యాతిగాంచిన విలువైన వజ్ర వైడూర్యాలూ, ఆభరణాలు సేకరించి భద్రం జేస్తుంటాడు. వాటిని అధికార హోదాలో ఏ దేశానికైనా పర్యటన వెళ్ళినపుడు, వెంట తీసికెళ్ళి, ఆ దేశంలోని ప్రముఖ వ్యక్తులముందు ప్రదర్శించి, తన వైభవాన్ని చాటుకుంటూంటాడు.

అందులో అతి విలువైన, అందరూ చూడాలని తహతహలాడే ఒక వైడూర్యం వుంది. దాని పేరు షింగోరా! షింగోరా అంటే ఆదీవి భాషలో నిప్పుకణం అని అర్థం. ఆ వైడూర్యం సరిగ్గా కోడిగుడ్డు ప్రమాణంలో వుండి, రాత్రింబవళ్ళూ నిప్పుకణికలా ధగధగ మెరుస్తూంటుంది. అంతపెద్ద వైడూర్యం ప్రపంచంలో మరెక్కడాలేదు.

దాని ఖరీదు కోటి డాలర్లుంటుందట. ఆయన అధికార పర్యటనకై ఏ దేశమేగినా దాన్ని సగర్వంగా ప్రదర్శించి ప్రముఖుల పొగడ్తలువిని పొంగిపోతుంటాడు.

సరే, ఏవళ్ళపిచ్చి వాళ్ళకానందం గానీ, ఇహ అసలు

విషయానికి వస్తున్నాను. కొరాకో దీవితో మన దేశానికి సన్నిహిత స్నేహ సంబంధాలూ, వ్యాపార వ్యవహారాలూ అనాదిగా సాగుతూ వస్తున్నాయి.

రేపు ఉదయం విమానంలో ఆయన మనదేశంలో ఐదు రోజుల అధికార పర్యటన జరపడానికి ఢిల్లీ రాబోతున్నాడు. ఆనవాయితీ ప్రకారం ఆయన వెంట ఆభరణాలూ షింగారో వైడూర్యంతోబాటు ఆయన భార్యల్లో ముఖ్యులయిన నలుగురు రాణులూ, ఒక రాజకుమారీ, యిద్దరు బాడీగార్డ్స్, ఒక సెక్రటరీ వస్తున్నారు.

తరచూ విదేశీ ప్రముఖులు విడిదిచేసే హోటల్ ఇండియాలో వారి వసతి ఏర్పాట్లు చురుగ్గా సాగుతున్నాయి. మన దేశంలోవున్న కొరాకో రాయబారి మిస్టర్ సామ్రాన్, ఈ సందర్భంలో మన ప్రభుత్వానికి ఓ విన్నపం చేసుకున్నాడు.

రాజుగారు తమవెంట తెస్తూన్న ఆ ఆభరణాలకూ, షింగారో వైడూర్యానికి ప్రదర్శన సందర్భంలో రక్షణ ఏర్పాట్లు చెయ్యాలని. అందుకు ప్రభుత్వం వెంటనే సమ్మతించి, ఆ బాధ్యత మనశాఖకు అప్పగించింది.

నేనా బాధ్యత నీ కప్పజెబుతున్నాను. రాయబారి ఇచ్చిన ప్రోగ్రాం ప్రకారం, రేపు రాత్రి యెనిమిది గంటలకు హోటల్ అంతస్తులోని విశాలమైన హాలులో ఆభరణాల ప్రదర్శన జరుగుతుంది.

తీరికవున్న ఒకరిద్దరు కేంద్రమంత్రులూ, నగరంలోని ప్రముఖ వ్యక్తులూ, సినీ పరిశ్రమకు చెందిన మరికొందరు ఆ విందులో పాల్గొంటారు.

ఆ ఆభరణాలు ఓ గాజు షోకేస్‌లో హాలు మధ్య

ఉంచబడతాయి, అందరూ చూడటాని కనువుగా, నువ్వు దాని చేరువులో నేవుండి ఎటువంటి అనిశ్చిత సంఘటనా జరక్కుండా చూసుకోవాలి. నీకు తోడుగా మన వాళ్ళు నలుగురుంటారక్కడ!"

"ఆ వైడూర్యాన్ని ఎక్కడైనా ఇన్ష్యూర్ చేయించాడా రాజు?" అడిగాను.

"ఔనుట! అమెరికాకి చెందిన ఓ ఇన్ష్యూరెన్స్ కంపెనీ కోటిడాలర్లకు దాన్ని ఇన్ష్యూర్ చేసుకుంది!"

"ఆల్ రైట్! వాటిని కాపాడే బాధ్యత నాది" అన్నాను లేస్తూ.

## 2

ఫ్లోరోసెంట్ దీపాలతో హాలు దేదీప్యమానంగా వెలిగి పోతోంది. అప్పటికే దాదాపు ఎనభయిమంది అతిధులు పోగయ్యారు. ఇంకా వస్తున్నారు.

పలువురు రాజకీయ నాయకులూ, ప్రముఖ పారిశ్రామిక వేత్తలూ, పత్రికా విలేఖరులూ ఉన్నారందులో.

హాలుమధ్య బల్ల. బల్లమీద పొడవాటి గాజు షోకేస్ అందులో వరసగా పేర్చిన, చిత్రవిచిత్ర డిజైన్లలో మలచిన ధగధగ మెరిసే వజ్రాభరణాలు. వాటి నడుమ కోడిగుడ్డు ప్రమాణంలో నిప్పుకణంలా ఎర్రవెలుగును విరజిమ్ముతున్న వైడూర్యం!

బల్లకు కొద్ది దూరంలో ఆరు ఆసనాలు. వాటి మధ్య రాజు గోరంగో, తనదేశ ఆచారాన్ని వ్యక్తంచేసే దుస్తులు ధరించి ఆసీనుడై వున్నాడు. ఏభయ్యేళ్ళు దరిదాపుల్లో ఉంటుంది ఆయన వయను. చామన ఛాయ. నీగ్రోల మాదిరి ఉంగరాలు తిరిగిన జుత్తు. మనిషి ఆజాను బాహుడు.

ఆయన కుడిపక్క రాజకుమారి రమోలా కూర్చుని వుంది. ఇటు రాకుమారికీ, అటు రాజుకూ ఇరుపక్కలా ఇద్దరిద్దరు చొప్పున రాణులు కూర్చునున్నారు. నలుగురు రాణులూ రాజులాగే చామన ఛాయ కలిగి, ఉంగరాలు తిరిగిన పొట్టిజుత్తుతో, మామూలు అందచందాలు కల వారే!

కాని, రాకుమారి రమోలా మాత్రం వారికి భిన్నంగా అపురూప సౌందర్యంతో అతిథుల కళ్ళు చెదర గొడు తోంది. పాలికేళ్ళుంటాయా మెకు. గులాబీరంగు ఒళ్ళు. శేత తమలపాకుల్లాంటి పల్చని పెదాలు. వజ్రాలు కరిగించి పోసినట్టు తళతళ మెరిసే కళ్ళు. పొడవాటి శిరోజాలు.

బహుశా, రాజుగారి 32 మంది భార్యలలో ఏ యూరోపియన్ భార్యకో జన్మించి ఉంటుంది... కాని, ఆమెవి యూరోపియన్‌లా పిల్లికళ్ళూ, రాగి జుత్తూ, తెల్లని శరీరమూ కావు. కనుపాపలూ, కనుబొమలూ, జుత్తూ నల్లగా వున్నాయి!

ఆ ఆసనాల కిరుప్రక్కలా బాడీగార్డ్సు నిల్చును న్నారు. పోతబోసిన విగ్రహాల్లా వున్నాయి వారి శరీరాలు. నడుములకు ఓపక్క రివాల్వర్స్, మరోపక్క కైజార్లు వేళాడుతున్నాయి.

నేను హాలుమధ్య ఆభరణాల షోకేసు దగ్గరే నిల్చుని అందర్నీ గమనిస్తున్నాను. మా డిపార్టుమెంటుకు చెందిన నలుగురు జూనియర్స్ అక్కడక్కడా నిల్చునున్నారు. మా అందరి జేబుల్లోనూ ఆయుధాలున్నాయి.

రాజుగారి శెక్రటరీ భోలాన్, హాలు ప్రవేశద్వారం

వద్ద నిల్చుని అతిథులకు స్వాగతం పలుకుతున్నాడు. వచ్చిన ప్రతి అతిథినీ, రాయబారి సాప్రూన్ రాజు దగ్గరికి తీసికెళ్ళి పరిచయం చేస్తున్నాడు.

రాజా, రాకుమారీ అందరితో కరచాలనం చేసి మాట్లాడుతున్నారుగానీ, రాణులుమాత్రం మౌనంగా చూస్తూ కూర్చున్నారు దిష్టిబొమ్మల్లా. బహుశా వాళ్ళకి ఇంగ్లీషు రాదేమో!

విచిత్రం ఏమిటంటే, రాకుమారి రమోలా అతిథులతో ఆంగ్లంలో అనర్గళంగా మాట్లాడుతుంది. రాజుభాష అంత స్పష్టంగాలేదు. ఆయన మాటల్లో యాస వినిపిస్తోంది. రాకుమారి బహుశా ఆక్స్‌ఫర్డు యూనివర్సిటీ విద్యార్థిని కాబోలు!

ఓ మూల బార్ కౌంటర్ ఏర్పాటు చెయ్యబడింది' రకరకాల తినుబండారాలూ, పానీయాలూ అమర్చి వున్నాయి కౌంటర్లో.

హోటల్ బట్లర్స్ అతిథులకి కావలసిన వస్తువులు అందిస్తున్నారు. వచ్చిన అతిథులంతా సంభ్రమాశ్చర్యాలతో, షో కేస్‌లో మెరిసిపోతున్న ఆభరణాలనూ, వైఢూర్యాన్నీ చూస్తున్నారు.

ఇంతలో ఇద్దరు పురుషులూ, ఒక స్త్రీ హాల్లో ప్రవేశించారు. ద్వారం దగ్గర నిల్చున్న సెక్రటరీ భోలాన్ వారిని సాదరంగా ఆహ్వానించాడు లోనికి. ఆ ముగ్గుర్నీ వెంటనే గుర్తించాను.

ఆ ఇద్దరు పురుషుల్లో ఒకరు హిందీ చిత్రాల్లో పేరు మోసిన హీరో రవీంద్రకుమార్! రెండవవ్యక్తి ప్రఖ్యాత హిందీ చిత్రనిర్మాత బసూ భట్టాచార్య. ఆ స్త్రీ ప్రముఖ హిందీ నటి జనప్రియ!

వారిని చూడగానే, రాయబారి సామ్రాన్ చిర్నవ్వులో ఎదురొచ్చి, సాదరంగా రాజు దగ్గరికి తీసి కెళ్ళి, ఒక్కొక్కర్నీ పరిచయం చెయ్యసాగాడు. రాజూ, రాకుమారీ మందహాసాలతో వారికి షేక్ హాండ్స్ ఇస్తున్నారు.

ఆ నిర్మాతను చూడగానే రాకుమారి మొహం వికసించడం గమనించాను. ఆమె అతనితో కరచాలనం చేస్తూ—"మిస్టర్ బసూ! మీరు తీసిన పిక్చర్స్‌లో నేను ఒకటి రెండు చూడటం జరిగింది. మీ చిత్రాలు వాస్తవికతకు చాలా దగ్గరగానూ, ప్రయోగాత్మకంగానూ ఉంటాయి. అందుకే డాడీతో చెప్పి మీ చిత్రాలను మా దేశంలో ప్రదర్శించడానికి అనుమతి ఇప్పించాను" అంది.

"నా చిత్రాలపట్ల మీకున్న సద్భావానికీ, ఆదరణకీ చాలా కృతజ్ఞుణ్ణి రాకుమారీ! ఇలా అంటున్నందుకు క్షమించాలి...చంద్ర బింబాన్ని మరిపించే మీ ముఖారవిందం ప్రపంచంలోని నటీమణులందర్నీ తలదన్నేలా ఉంది. నా తదుపరి చిత్రంలో మీరు హీరోయిన్ రోల్ వెయ్యడానికి అనుమతించారంటే, అంతకి మించిన మహాద్భాగ్యం మరొకటి ఉండదు" అన్నాడు భట్టాచార్య వినయంలో.

"ఈజిట్!?"

"నా మాట నమ్మండి రాకుమారీ! అపార ధనసంపద ఉన్న మీకు మిగతావారిలా కేవలం ధనం సంపాదించడానికే చిత్రపరిశ్రమలో ప్రవేశించనక్కర్లేదు.

నటన అనేది ఒక కళ! దానికి డబ్బుతో ముడిపెట్ట

నవసరం లేదు. కనీసం కళాత్మక దృష్టితోనైనా మీరు నా ప్రస్తావన ఆలోచించాలి. ఈ రోజుల్లో ప్రపంచ ఖ్యాతి ఆర్జించాలనుకున్న వారికి, సినీ పరిశ్రమను మించిన సాధనం మరొకటి లేదు!"

"నాకు నటనపట్ల ఆసక్తి వుంది. డాడీ అనుమతి లభిస్తే తప్పకుండా మీ చిత్రంలో నటిస్తాను," అంది రాకుమారి నవ్వుతూ.

అంతవరకూ వారి సంభాషణ వింటున్న రాజు నవ్వి "మేమింతవరకూ రాకుమారి కోరినదేదీ కాదనలేదు. ఈ విషయంలోనూ అభ్యంతరం చెప్పదలచుకోలేదు. రాకుమారి చిత్రాల్లో నటించాలనుకుంటే నిస్సంకోచంగా నటించవచ్చు. భట్టాచార్య చెప్పినట్టు ప్రపంచ ఖ్యాతి నార్జించడానికి అదే ఉత్తమ సాధనం!" అన్నాడు రాకుమారిని చూస్తూ.

రాకుమారివైపు రాజు చూసిన ఆ చూపుల్లో నాకు ఏం తోచిందో గానీ, ఒక్కసారి ఒళ్ళంతా ఝ మంది!

ఒక తండ్రి, వాత్సల్యంతో కూతురివైపు చూసే చూపులు కావవి! ఒక ప్రియుడు, ప్రియురాలివైపు చూసే చూపులవి!!

చఛ! ఇంత ఛండాలంగా ఆలోచిస్తున్నానేమిటీ, అనిపించింది నాకే. కళ్ళు మనసులో కదిలే భావాలకి ప్రతిబింబాలు. మనిషి కళ్ళు చూసి, అతనిలో చెలరేగే భావోద్రేకాలని తొంభై శాతం పసిగట్టవచ్చు. ఏది ఏమైనా, రాజు రాకుమారివైపు చూసిన ఆచూపుల్లో ఏదో అసహజత్వం కనిపించిన మాట వాస్తవం!

పరిచయాలయ్యాక, ఆ సినిమా జీవులు ముగ్గురూ బార్ వైపు వెళ్ళి తలో గ్లాసు అందుకుని సిప్ చేస్తూ ఆభరణాలు చూట్టంలో నిమగ్నమయ్యారు.

అదే సమయంలో నా దృష్టి అనుకోకుండా ప్రవేశ ద్వారంవైపు మళ్ళింది. అప్పుడే, బట్లర్ దుస్తుల్లో వున్న ఒకతను చేతిలో ఓ పాకెట్ పట్టుకుని హాల్లో ప్రవేశించి ద్వారం దగ్గర నిల్చున్న రాజు సెక్రటరీ భోలాన్‌కు అభివాదం చేసి, వినయంగా ఏదో అంటూ పాకెట్ అందించాడు.

భోలాన్ తలూపి, పాకెట్ అందుకుని, రాజు దగ్గరికి వచ్చి, ఆయనకు అభివాదం చేసి—"యువర్ హాయ్‌నెస్! ఈ హోటల్ యజమానుల తరఫున తమకోసం ఈ బహుమతి పంపబడింది," అన్నాడు.

రాజులకు అటువంటి బహుమతులు కొత్తేం కావు. నిర్లక్ష్యంగా పాకెట్ అందుకుని ఒళ్ళో పెట్టుకున్నాడు రాజు. దానిమీద ఆకుపచ్చ రంగు కేన్వాస్ కవర్ చుట్టి వుంది. భోలాన్ తిరిగి ద్వారందగ్గరికెళ్ళి నిల్చున్నాడు.

"ఆ పాకెట్‌లో ఏముంది డాడీ?" అడిగింది రాకుమారి.

"ఆఁ, ఏదో అయుంటుంది" అంటూ ఒళ్ళోంచి పాకెట్ అందుకుని, దానిమీద చుట్టివున్న రిబ్బన్ విప్పసాగాడు రాజు.

తరవాత నిర్లక్ష్యంగా కేన్వాస్ కవర్ ఊడదీశాడు. లోపల తళ తళ మెరిసే చిన్న స్టీలు పెట్టె వుంది, రాజు పెట్టెమీద చెయ్యివేసి, కొద్దిగా బటన్ పుష్ జేసి మూత తెరిచాడు. అంతే!

"ఢాం!" మన్న ప్రేలుడుతో హాలు దద్దరిల్లింది.

మరుక్షణం రాజు మొహంలోని సగభాగం ఎగిరి పోయింది!

హృదయవిదారకంగా అరుస్తూ కుర్చీలోంచి కింద పడి పోయాడు. ఆయన కూర్చున్న చోట సరిగ్గా పైన కప్పులో రంధ్రాలు పడి ప్లాస్టర్ కురవసాగింది.

అరక్షణంలో జరిగిపోయిన సంఘటన ఇది! ఎవ్వరూ ఊహించని, కలలోకూడా అంచనా వెయ్యని సంఘటన!!

# 3

మరుక్షణం హాల్లో ప్రళయం ముంచుకువచ్చినట్లు హాహాకారాలు చెలరేగాయి. స్త్రీలు భయంతో గావు కేకలు పెడుతున్నారు. పత్రికా విలేఖర్లు ఆ సంఘటన గురించి తక్షణం తమ తమ పత్రికలకు చెప్పడానికి టెలిఫోన్లవైపు పరిగెత్తుతున్నారు.

దడ దడలాడే గుండెతో మెరుపులా రాజు పడున్న చోటికెళ్ళాను. అప్పటికే ఆయన మొహం రక్తసిక్తమై వికృతంగా మారిపోయింది. కొన ఊపిరిలో వున్నాడు.

విచిత్రం ఏమిటంటే, రాజు కిరుపక్కలా కూర్చున్న రాణులకూ, రాకుమారికీ, బాడీగార్డ్సుకి ఎటువంటి హానీ జరగలేదు. రాజు పరిస్థితి చూడగానే వాళ్ళు గుండెలు బాదుకుంటూ రోదిస్తున్నారు!

అంతవరకూ కంఠం తెగిన కోడిలా గిలగిల తన్నుకుం టున్న రాజు ఇప్పుడు తన్నుకోడం ఆపేశాడు. అను మానం వచ్చి, చటుక్కున చెయ్యి అందుకుని చూశాను. పల్స్ లేదు!

రాజు మరణించాడు!!

జేబులోంచి కర్చీఫ్ తీసి, భయంకరంగా కనిపిస్తున్న అతని సగం మొహంమీద వేశాను. మరుక్షణం అది రక్తంతో తడిసిపోయింది! అప్పటికే హాల్లో వున్న వాళ్ళంతా అక్కడ గుమిగూడారు.

సడన్‌గా ఏదో జ్ఞాపకం వచ్చి, వెనుదిరిగి చూశాను.

అనుమానమే నిజమైంది!

హాలు మధ్య షో కేస్ అద్దాలు పగిలి ఉన్నాయి. షింగారో వైఢూర్యం మాయం!

బట్లర్ దుస్తుల్లో ఆ పాకెట్ తెచ్చిన వ్యక్తే దీనికంతటికీ మూలకారకుడని తెలుస్తూనే ఉంది. ఇప్పుడతని ఛాయలు కూడా లేవు హాల్లో! అద్భుతమైన ప్లాన్ అల్లి వైఢూర్యం కాజేశాడు.

పాకెట్‌లో బాంబు పెట్టి తెచ్చాడు. రాజు చేతిలో అది పగలగానే, అందరిధ్యాసా ఆయనవైపు మళ్ళింది. ఆ వ్యవధిలో షో కేస్ పగలగొట్టి, షింగారోతో అదృశ్యమయ్యాడు.

మరోసారి గుర్తు తెచ్చుకున్నాను అతని రూపాన్ని.

అప్పుడు జ్ఞాపకం వచ్చింది!

అంతక్రితం అతన్నెక్కడో చూసినట్టు. ఎక్కడ? ఎక్కడ? సమయానికి తట్టి చావడంలేదు. ఇప్పుడతని కోసం హోటల్లో గాలించడం వృధా ప్రయాస. ఈ పాటికి ఈ దరిదాపులనించి అదృశ్యమై ఉంటాడు.

ముందిక్కడి పరిస్థితి అదుపులోకి తేవాలి!

"లేడీస్ అండ్ జంటిల్‌మన్! దయచేసి శాంతించండి. కాసేపట్లో పోలీసులు రాబోతున్నారు. వారికి

మీ మీ చిరునామా లిచ్చి మీరు వెళ్ళిపోవచ్చు'' అని లోపలున్న మా డిపార్ట్‌మెంట్ వాళ్ళిద్దర్ని తలుపు దగ్గర కాపలా వుంచి, ఫోన్ వైపు వెళ్ళాను.

పోలీస్ హెడ్‌క్వార్టర్‌కి రింగ్ జేసి, కావలసిన సిబ్బందితో తక్షణం బైలుదేరి రమ్మని చెప్పాను కమీషనర్‌కు. అలాగే వారివెంట బాంబు ఎక్స్‌పర్టునుకూడా తీసుకురమ్మన్నాను.

తరవాత, రాయబారి సాత్రమాన్, సెక్రెటరీ భోలాన్ నిల్చున్నవైపు వెళ్ళాను. నన్ను చూడగానే రాయబారి మండిపడసాగాడు.

''ఇక్కడి సెక్యూరిటీ ఆఫీసర్ డ్యూటీ మీదే కదూ?''

తలూపాను, తప్పుచేసినవాడిలా!

''ఇదా మీ సెక్యూరిటీ ఏర్పాటు? ఇదా మీ ప్రభుత్వం? మీరు మా రాజుగారికి రక్షణ ఇవ్వలేనప్పుడు, వారి నెందుకు ఆహ్వానించాలి? ఆయన ఇదివరకెన్నో దేశాలు పర్యటించారు. అక్కడ ఎన్నడూ, ఏ చిన్న సంఘటనా జరగలేదు.

ఈరోజు మీ దేశంలో ఆయన ప్రాణాలే పోయాయి. నేనీ విషయాన్ని యు. ఎన్. ఓ. వరకూ తీసికెళ్ళందే వదిలిపెట్టను,'' అరుస్తున్నాడతను ఆవేశంగా.

''సర్! జరిగిందానికి నే నెంతో చింతిస్తున్నాను. మీరే ఆలోచించండి. సంఘటన యెవ్వరూ ఊహించని విధంగా మెరుపు దాడిలా జరిగింది. మా ఏర్పాటులో యే లోపమూ ఉంచలేదు.''

''నో, నో! నే నొప్పుకోను. మీ అసమర్ధతవల్లే ఇంత

ఘోరం జరిగింది. నేను మీ ప్రైమ్‌మినిస్టర్‌తో మాట్లాడి, మిమ్మల్ని డిస్‌మిస్ చేయించందే ఊరుకోను" అంటూ రాణిమారీ, రాణులూ రోదిస్తున్న వైపు వెళ్ళాడు రాయబారి.

నిట్టూరుస్తూ సెక్రటరీ భోలాన్ వైపు తిరిగాను. "మిస్టర్ భోలాన్! ఆ పాకెట్ తీసుకొచ్చిన బట్లర్ మీతో ఏమన్నాడు?"

"అందులో విలువైన బహుమతి ఉందనీ, రాజుగారి కోసం హోటల్ యజమానులు పంపారనీ చెప్పాడు. అంతే!"

"మీరతన్ని చాలా దగ్గరగా చూశారు కదా? అతని మొహంలో గుర్తులేవైనా గమనించి ఉంటే చెప్పండి. అతన్ని వెతికి పట్టుకోడానికి సులభమౌతుంది."

భోలాన్ పెదవి విరిచి "హడావుడిలో నేనతన్ని అంత పరీక్షగా చూళ్ళేదు. పాకెట్ అందుకోగానే వెనుదిరిగి, రాజుగారి దగ్గరికెళ్ళాను" అన్నాడు విచారంగా.

ఇంతలో పోలీసులూ, ఇతర సిబ్బందీ వచ్చేశారక్కడికి, రాగానే ఫోటోగ్రాఫర్స్, ఫింగర్ ప్రింట్, బాంబ్ ఎక్స్‌పర్ట్స్ చక చక తమ పని ప్రారంభించారు.

ఆలోగా నేను మా హెడ్‌క్వార్టర్‌కు ఫోన్ చేసి, డైరెక్టర్ ముఖర్జీగారికి వివరాలన్నీ చెప్పేసి, ఆయన చీవాట్లు వినకముందే రిసీవర్ పెట్టేశాను.

పోలీసుల తతంగం పూర్తయ్యాక, స్ట్రెచర్ మీద రాజు శవాన్ని బైటికి తీసికెళ్ళారు. పోలీస్ కమీషనర్, హాల్లో వున్న అతిథులందరి పేర్లూ, చిరునామాలూ రాసుకుని వెళ్ళడాని కనుమతించాడు'

బాంబ్ ఎక్స్‌పర్టు చెప్పిన విషయాలు నన్ను చకితుణ్ణి చేశాయి. ఆ వివరాలతో అంతవరకూ లేని కొత్త సందేహాలెన్నో ఉద్భవిస్తున్నాయి. ఈ సంఘటన కేవలం షింగారో వైఢూర్యం కోసమే సృష్టించబడిందా? లేక ఆ సాకుతో రాజును మట్టుబెట్టారా?

దొంగ ఆ వైఢూర్యాన్నే దొంగలించదలచుకుంటే, బాంబుతో రాజును చంపవలసిన అవసరంలేదు. ఆ ప్యాకెట్‌లో గ్యాస్‌బాంబు పెట్టి, హాలంతా పొగమయం చేసి ఆ గందరగోళంలో సులభంగా దొంగలించవచ్చు!

బాంబ్ ఎక్స్‌పర్టు చెప్పిన వివరాలనుబట్టి, ఆ పెట్టెలో కేవలం దాన్ని తెరిచిన వ్యక్తే తీవ్రంగా గాయపడేలా బాంబు పెట్టబడింది. అందుకే రాజా పెట్టె తెరిచిన మరుక్షణం బాంబు పేలి, ఆయన మొహాన్నీ, హాలు కప్పునీ ఎగరగొట్టిందే తప్ప, ఇంకెవ్వర్నీ గాయపర్చలేదు!

రాజ్యంకోసం, కన్నకొడుకులే తండ్రిని మట్టుపెట్టిన సంఘటనలు కోకొల్లలుగా ఉన్నాయి చరిత్రనిండా. ఈ రాజబంధువుల్లోనే ఎవ్వరో, కొరాకో దీవిలో ఉండి, ఈ హత్య జరిపించలేదు కదా?

బట్లర్ వేషంలో ఆ పాకెట్ తెచ్చిన వ్యక్తి అచ్చాలా భారతీయుడు. నా కళ్ళారా చూశాను. పైగా, ఇదివరకతన్నెక్కడో చూసినట్టుకూడా తోచింది. ఏ పాత నేరస్థుడో అయుంటాడు. ఎవ్వరో వాడికి డబ్బిచ్చి ఉపయోగించుకునుంటారు.

ఈ ఆలోచన రాగానే, అక్కణ్ణించి తక్షణం పోలీస్ రికార్డు రూంకు బెలుదేరాను.

రికార్డ్సు ఇంఛార్జుకు వివరాలు చెప్పి, గబగబ పాత

ఫైళ్ళు తిరగేస్తూ, మాజీ నేరస్తుల ఫోటోలు చూడ సాగాను.

గంట తరవాత కనిపించింది నాక్కావలసిన ఫోటో!

బట్లర్ దుస్తుల్లో బాంబు తెచ్చింది అతనే!!

గబగబ ఫోటో కింద రాసివున్న వివరాలను చదవ సాగాను.

'పేరు_పరశురామ్, వయసు_35_, హైట్_ఐదడుగుల ఆరంగుళాలు. రంగు_చామనఛాయ, ముక్కు_దగ్గర కత్తి గాటు, కళ్ళ రంగు_నలుపు, జుత్తు_నలుపు. బరువు_92 కిలోగ్రామ్స్!

మొదట తాళాలు తయారుచేసే ఓ ఫ్యాక్టరీలో పని చేసేవాడు. రెండుసార్లు ఇళ్ళ తాళాలు తెరిచి పట్టుబడ్డాడు. 16 నెలల శిక్షపడింది. రెండు హత్యకేసుల్లో అనుమానితుడుగా అరెస్టయి, సాక్ష్యాలు దొరక్క విడుదలయ్యాడు.'

రిపోర్టంతా చదివి, తక్షణం అతనికోసం నగరమంతా గాలించే ఏర్పాట్లు చెయ్యవలసిందిగా కోరాను పోలీస్ అధికార్లని.

అట్నుంచి మళ్ళీ హోటల్ చేరుకున్నాను.

అంతవరకూ అతిధులతో కళకళలాడిన హాలు తలుపులు ఇప్పుడు బోసిగా మూసి ఉన్నాయి!

## 4

మునివేళ్ళతో తట్టాను తలుపుమీద.

రెండునిమిషాల తరవాత తెరుచుకుంది. రాజు బాడీ గార్డులలో ఒకడు తెరిచాడు తలుపు.

“సెక్రటరీ భోలాన్ గారు ఉన్నారా?” అడిగాను ఇంగ్లీషులో.

అతను తలూపి, తలుపు పూర్తిగా తెరిచాడు.

హాల్లో అడుగుపెట్టాను.

హాలుమధ్య సోఫాల్లో, సెక్రెటరీ భోలాన్, రాకుమారి రమోలా కూర్చున్నారు విచారకరంగా.

నన్ను చూడగానే, "మిస్టర్ సారథీ! రండి" అన్నాడు భోలాన్.

వాళ్ళను సమీపించి, ఫార్మాలిటీకోసం వంగి రాకుమారికి అభివాదం చేశాను. "ఇటువంటి సమయంలో మీ ఏకాంతానికి భంగం కలిగిస్తున్నందుకు మన్నించండి రాకుమారీ! భోలాన్ గారితో కొన్ని వివరాలు అడిగి తెలుసుకొందామని వచ్చాను. మీరు వెళ్ళి విశ్రాంతి తీసుకోండి."

రాకుమారి పేలవంగా నవ్వి "డాడీ మరణాన్ని కళ్ళారా చూసిన నాకు ఇంకా విశ్రాంతి ఏమిటి? నో! ఆ భీకర దృశ్యం పూర్తిగా మరిచిపోయేవరకూ నాకు నిదరపట్టదు. ప్లీజ్, టేక్ యువర్ సీట్!" అంది సోఫా చూపిస్తూ.

వారికెదురుగా సోఫాలో చతికిలబడ్డాను.

సరిగ్గా అదే సమయంలో తలుపుతట్టిన చప్పుడు వినిపించింది.

భోలాన్, బాడీగార్డుకు సైగ చేశాడు.

అతను వెళ్ళి తలుపు తెరిచాడు.

వచ్చినతనికి ఏభైఏళ్ళుంటాయి. భుజాలవరకూ కత్తిరించుకున్న నెరసిన జుత్తు. తెల్లని గడ్డం. కళ్ళకి అద్దాలు, ఆఫ్ కలర్ సూట్ వేసుకున్నాడు. చేతిలో స్టిక్!

"హలో జంటిల్ మన్! బహుశా నేను రావడం

ఆలస్యమైందనుకుంటాను" అన్నాడు చుట్టూ కలయ జూస్తూ.

"ఎవరు మీరు?" అడిగాడు భోలాన్.

"నన్ను ప్రొఫెసర్ దండావతే అంటారు. ఆగ్రా నగరంలోవున్న మొగల్ మ్యూజియం డైరెక్టర్ని. గతంలో రాజాగారితో నేను జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాల ఫలితంగా ఆయన నాకు తమ ఆభరణాలు చూసే అవకాశాన్ని ప్రసాదించారు.

నేను వజ్రవైఢూర్యాల ఎక్స్‌పర్టుని. ప్రస్తుతం ప్రపంచ ఖ్యాతి గాంచిన వజ్రవైఢూర్యాల గురించి ఓ పుస్తకం రాస్తున్నాను. అందుకే రాజాగారివద్దవున్న షింగోరా వైఢూర్యాన్ని ఓమారు చూట్టానికి వచ్చాను."

"ఐతే మీరు చాలా ఆలస్యంగా వచ్చారు ప్రొఫెసర్ మీకింకా ఇక్కడ జరిగిన సంఘటన గురించి తెలియదనుకుంటాను." అన్నాడు భోలాన్ విచారంగా.

"ఎటువంటి సంఘటన? ఆగ్రాలో నేనెక్కిన విమానము గంట లేటయింది ఢిల్లీ చేరడానికి. నాకేమీ తెలియదు" అన్నాడు ప్రొఫెసర్ ఆశ్చర్యంగా.

భోలాన్ నిట్టూర్చి "రాజాగార్ని ఎవ్వరో హత్యచేసి, వైఢూర్యాన్ని ఎత్తుకుపోయారు" అన్నాడు.

ఈ వార్త వినగానే ప్రొఫెసర్ దండావతే కళ్ళు దిగ్భ్రాంతితో పెద్దవయ్యాయి. కాసేపు శిలాప్రతిమలా నిల్చుండిపోయాడు.

తరువాత తేరుకొని "వెరీ బ్యాడ్ న్యూస్! ఈఘోరం ఎప్పుడు జరిగింది?" అడిగాడు.

"ఇప్పుడే, రెండు గంటల క్రితం!"

"సారీ! అయామ్ వెరీసారీ! చాలా బాధాకరమైన వార్త వినవలసి వచ్చింది. నేను రెండురోజులు ఇక్కడే రాయల్ హోటల్లో రెస్టుతీసుకొని, ఆగ్రా వెళ్ళిపోతాను. ఈ లోపల దొంగిలించబడ్డ ఆ వైఢూర్యం మళ్ళీదొరికితే, దయచేసి దాన్నొకసారి చూసే అవకాశం కల్పించండి నాకు! గాడ్ బ్లెస్ యూ!" అంటూ వెళ్ళిపోయాడా వృద్ధుడు.

"మీ రాకకు కారణం?" అడిగాడు భోలాన్ నావైపు తిరిగి.

"మిమ్మల్ని కొన్ని ప్రశ్నలడిగి సందేహ నివృత్తి చేసుకొందామని వచ్చాను."

"చెప్పండి!"

"షింగోరా వైఢూర్యాన్ని దొంగిలించడం కేవలం అసలు నేరాన్ని కప్పిపుచ్చడానికి వేసిన పథకమని నా అనుమానం. అంటే, హంతకుడు ఖచ్చితంగా రాజుగార్ని చంపడానికే పెట్టెలో బాంబు పెట్టాడు!" అని బాంబు ఎక్స్‌పర్టు నాకు చెప్పిన వివరాలు అతనికి వివరించాను.

"నాకు నమ్మ శక్యంకావడంలేదు. ఇక్కడ రాజు గారికి శత్రువులెవ్వరున్నారని, ఇంతఘాతుకానికి ఒడిగడ తారు?"

"ఇది రాజకీయ హత్య ఎందుకు కాకూడదు? ఇందులో మీ దేశానికి చెందినవ్యక్తి చెయ్యి ఉందనికూడా అనుమానిస్తున్నాను."

"ఏమిటీ? మా దేశానికి చెందిన వ్యక్తి చెయ్యా? అసంభవం! మా దేశవాసులందరూ రాజుగార్ని కన్నతండ్రిలా ప్రేమిస్తారు, గౌరవిస్తారు. ఆయన ఒక్క కనుసైగతో

నిప్పులో దూకడానికి కూడా సిద్ధపడతారు. అటువంటి దేశస్థులా తమ రాజును చంపబూనేది?'' అన్నాడు భోలాన్ ఆవేశంగా.

''నా అభిమతాన్ని మీరు సరిగ్గా అర్థంచేసుకోవడం లేదు. నా అనుమానమల్లా హత్యా సమయంలో పార్టీలో వున్న మీ దేశస్థుల్లోనే ఎవ్వరో ఈ ఘాతుకానికి మూల కారకుడై వుంటాడు!''

''అప్పుడు హాల్లో మా దేశానికి చెందినవారు మొత్తం తొమ్మిదిమంది వున్నారు. వారిలో ఏ ఒక్కరూకూడా ఇటువంటి కిరాతకం జేయించలేదని గట్టిగా చెప్పగలను.''

''ఎలా చెప్పగలరు?''

''ఆ తొమ్మండుగురులో నలుగురు రాణులూ, ఒకరు రాకుమారి. ఈ ఐదుగురికి రాజుగార్ని చంపడం వల్ల ఒరిగేదేమీ లేదు. పైగా ఎన్నో కష్టనష్టాలకు గురవుతారు. కారణం రాజుగారి ప్రేమాదరణల మీదే వారి జీవితాలు ఆధారపడి వున్నాయి.

పోతే, ఈ ఇద్దరు బాడీగార్డులు_గత పదిహేనేళ్ళ నించీ వీరిద్దరూ రాజుగారి నమ్మినబంటుల్లా పనిచేస్తున్నారు. వాళ్ళే కాదు, వాళ్ళ తాత ముత్తాతలు కూడా రాజ అంగరక్షకులుగా, విశ్వాసపాత్రులుగా పనిచేసే వారే!

ఇక మిగిలింది నేనూ, రాయబారి సామ్రాన్!

మా నాన్న రాజమందిరంలో దర్బానుగా పనిచేసేవాడు. ఆయనే నాకు ఉన్నతవిద్య చెప్పించారు.

నేను కష్టపడి చదివి బి. ఇ. డిగ్రీ సంపాదించాను.

దాంతో రాజుగారు నన్ను పెర్సనల్ సెక్రటరీగా

నియమించుకున్నారు. దీన్నిబట్టి ఆలోచించండి, నేనాయన కెంతగా ఋణపడి వున్నానో! వెయ్యి జన్మలెత్తినా తీర్చలేని ఋణం అది!

ఇక రాయబారి సామ్రాన్ గారి స్థితికూడా సరిగ్గా ఇటువంటిదే. ఆయనీ రోజు ఈ స్థితిలో వున్నాడంటే అందుకు రాజుగారి దయాదాక్షిణ్యాలే కారణం! అటువంటి దయామయుడికి ఇంతగా ఋణపడి ఉన్న మేము, ఆయన్ని హత్య చేయించాలనుకోవడం హాస్యాస్పదం!'' అన్నాడు భోలాన్.

''ఒప్పుకుంటాను. నా అంచనా పొరపాటు కావచ్చు సరే, రాజుగారికి మొత్తం 45 మంది సంతానం వున్నారని విన్నాను. నిజమేనా?'' అడిగాను.

భోలాన్ తలూపి—''ఔను, నిజమే!'' అన్నాడు.

''మీ పెద్దన్నయ్య పేరేమిటి రాకుమారీ?'' అడిగాను రాకుమారిని.

''ఆ...ఆయన... పేరా...?''

భోలాన్ వెంటనే అందుకుని—''ప్రిన్స్ జోమింగో!'' అన్నాడు.

''యస్...యస్! డాడీ హఠాత్మరణంలో నా మస్తిష్కం పచ్చిపుండుగా మారిపోయింది'' అంది రాకుమారి వేళ్ళతో కణతలు నొక్కుకుంటూ.

''అందుకే చెప్పాను రాకుమారీ! మీరు విశ్రాంతి తీసుకోడం మంచిదని...'' అంటూ భోలాన్ వైపు తిరిగి—''రాజుగారి తరవాత సింహాసనానికి వారసులెవరు?'' అడిగాను.

''ఆయన పెద్దకుమారుడే!''

"బాగా ఆలోచించి చెప్పండి. మిగతా 44 మంది యువరాజుల్లో ఎవ్వరికీ రాజ్యకాంక్ష లేదా? ప్రపంచ చరిత్రలన్నీ మీరు చదివేవుంటారు. సింహాసనం కోసం కొడుకులు తండ్రులని, అన్నలు తమ్ముళ్ళని నిర్దయగా చంపివేసిన సంఘటనలెన్నో వున్నాయి."

"ఒప్పుకుంటాను. మా దేశ ఆచారం ప్రకారం, పెద్ద కొడుకే సింహాలనానికి వారసుడు. ఇంతవరకూ యిదేరీతి నడుస్తూ వస్తోంది."

"ప్రిన్స్ జోమింగ్ యిప్పుడెక్కడున్నాడు?"

"యూరప్‌లో! బాల్యంనించీ ఆయనకు విలాసాల దురలవాటు పట్టుకుంది. డబ్బును విచ్చలవిడిగా ఖర్చు పెడుతుంటాడు, స్త్రీ లోలుడిగా పేరుపొందాడు. జూదంలో ఆరితేరినవాడు. మద్యపానాల్లో మునిగి తేలుతూ ఎక్కువ భాగం యూరప్‌లోనే గడుపుతుంటాడు.

రాజుగారు ఆయన్ని మంచిమార్గంలోకి తేవడానికి శతవిధాలా ప్రయత్నించారు. ముక్కై వంగనిది మానై వంగుతుందా? దాంతో రాజుగారికి కోపం వచ్చి, ఆయన తన దుర్వ్యసనాలు వదులుకోకుంటే, రెండవ రాకుమారునికి రాజ్యాధికారాన్ని అప్పగిస్తానని బెదిరించారుకూడా!"

"మీ నాలుగో సోదరుని పేరేమిటి రాకుమారీ?" అడిగాను సడన్‌గా రాకుమారిని.

ఆమె ఇంకా జవాబివ్వకముందే అందుకున్నాడు భోలాన్. "ఆయన పేరు ప్రిన్స్ మోరంగో!"

"సారీ... నా తలలో విపరీతంగా పోటు ప్రారంభమైంది. వెళ్ళి రెస్టు తీసుకుంటాను," అంటూ లేచి వెళ్ళిపోయింది రాకుమారి.

క్షణంపాటు ఆమె వెళ్ళినవైపే చూచి, భోలాన్ వైపు తిరిగాను.

"ఆల్ రైట్ మిస్టర్ భోలాన్! హంతకుణ్ణి పట్టుకోడానికి మా సర్వశక్తులూ వినియోగిస్తున్నాం! మీరు నిశ్చింతగా వుండండి. వస్తాను!" అన్నాను లేస్తూ.

భోలాన్ తలూపి..."గుడ్ నైట్!" అన్నాడు.

వడి వడిగా అడుగులు వేస్తూ, బైటికి వచ్చి, లిఫ్ట్ ద్వారా క్రింది అంతస్థు చేరుకున్నాను.

## 5

గంటసేపు క్రింది అంతస్థులో తారట్లాడి, లిఫ్ట్‌లో తిరిగి పైకి చేరుకున్నాను. ఈలోపల హాల్లో కూర్చున్న భోలాన్ తన పడగ్గదిలో కెళ్ళిపోయుంటాడు.

అడుగులో అడుగు వేసుకుంటూ హాలు తలుపువైపు నడిచాను.

మునివేళ్ళతో తట్టాను మెల్లిగా.

వెంటనే తెరుచుకుంది.

"మీరా!" అన్నాడు బాడీగార్డ్.

"ఔను. బైటికెళ్ళాక ఓ విషయం జ్ఞాపకం వచ్చింది రాకుమారిని ఓ ప్రశ్న అడిగి తెలుసుకోవాలి" అన్నాను తాపీగా.

"రాకుమారి విశ్రాంతి తీసుకుంటున్నారు."

"చాలా ముఖ్య విషయమని చెప్పానుగా! హంతకుడు త్వరలో పట్టుబడాలంటే నా సందేహాలు తీర్చుకోడం అత్యవసరం!" అన్నాను ఆతృత నటిస్తూ.

"ఆల్ రైట్! చెబుతాను," అంటూ లోనికెళ్ళిపోయాడు.

ఐదు నిమిషాల తరవాత, తెల్లని స్లీపింగ్ గౌన్ చుట్టు కుంటూ హాల్లోకి వచ్చింది రాకుమారి. ఆమె మొహంలో విసుగు స్పష్టంగా ప్రస్ఫుటమౌతోంది.

"మీ విశ్రాంతికి భంగం కలిగించినందుకు క్షమిం చండి రాకుమారీ! అతి ముఖ్యమైన ఓ సందేహ నివృత్తి కోసం ఇలా రావలసి వచ్చింది. దాదాపు మిగతా అందర్నీ ప్రశ్నించడం జరిగిందికానీ, ఇంతవరకూ రాణుల సంగతే మర్చాను.

అందరిలాగే వారినీ ఓమారు ప్రశ్నించాలి. వాళ్ళకి ఇంగ్లీష్ రాదుకదా, మా మధ్య జరిగే సంభాషణను మీరు తర్జుమా చేసి వినిపించాలి. అందుకే మిమ్మల్ని ఇబ్బంది పెట్టవలసి వచ్చింది" అన్నాను వినయంగా.

"మా బాడీగార్డులకు ఇంగ్లీష్ తెలుసు. వారు తర్జుమా చెయ్యగలరు" అంది రాకుమారి మొహం చిట్లిస్తూ.

"ఆ సంగతి నాకూ తెలుసు. మా మధ్య మీరుం డటం అత్యవసరం!" అంటూ బాడీగార్డ్ వైపు తిరిగి— "దయచేసి, నలుగురు రాణులనూ ఇక్కడికి తీసుకురా!" అన్నాను.

అతను వెళ్ళిపోయాడు మౌనంగా.

"నాకు విపరీతమైన తలనొప్పిగా వుంది, మీరు బాడీ గార్డ్ ద్వారా రాణులతో మాట్లాడండి" అంది రాకుమారి విసుగ్గా.

అంతలో, బాడీగార్డు వెంట రాణులు రానే వచ్చేరు.

"ఇక నీవు వెళ్ళవచ్చు!" అన్నాను అతనితో.

"నో, నో! అతనిక్కడే వుండి, మీ సంభాషణ తర్జుమా చేస్తాడు. నే వెళ్ళి విశ్రాంతి తీసుకుంటాను"

అంటూ కదలబోయింది రాకుమారి.

"మీరు వెళ్ళడానికి వీల్లేదు! నా దేశంలో ఒక ప్రముఖ వ్యక్తి హత్య జరిగింది. హంతకుణ్ని పట్టుకునే బాధ్యత నామీద వెయ్యబడింది. నాతో సహకరించడం మీ బాధ్యత!" అన్నాను ఈమారు కఠినంగా.

రాకుమారి రాతిబొమ్మలా నన్ను చూస్తూండిపోయింది "యూ కన్ గో నౌ!" అన్నాను బాడీగార్డుని ఆదేశిస్తూ.

అతను వెళ్ళిపోయాడు.

"ఇప్పుడు మీరు, నా మొదటి ప్రశ్నగా, రాణులతో అడగండి. వారికి రాజుగారి ఆంతరంగిక శత్రువులగురించి ఏమైనా తెలుసేమో?"

రాకుమారి మొహం ఎర్రబడింది. "మీకు మా దేశ ఆచార వ్యవహారాలు తెలియవు గనుక ఇలా మాట్లాడుతున్నారు. మా దేశంలో ఏకుటుంబంలోనైనా తండ్రులు మరణిస్తే, కొడుకులూ, కూతుళ్ళూ తల్లులతో వారం రోజులపాటు మాట్లాడకూడదు. అందుకే, మీ ప్రశ్నను వారికి వినిపించలేను."

"మీది చాలా చురుకైన బుర్ర రాకుమారీ! క్షణాల మీద సాకులను సృష్టించగలరు. మీరు తర్జుమా చెయ్యలేరని నాకు తెలుసు. కారణం, మీకు వారి భాష తెలియదు.

నీవు నకిలీ రాకుమారివి! పార్టీలో, రాజుగారు నీవైపు చూసిన చూపులే నాలో సవాలక్ష సందేహాలు రేపాయి. ఆ చూపుల్లో పితృ వాత్సల్యానికి బదులు, కామ వాంఛ కనిపించేది...

తరవాత, నేను రాజుగారి కొడుకుల పేర్లడిగితే నీవు

చెప్పలేక తటపటాయించావ్! ఒక సోదరికి, తన అన్నా తమ్ముళ్ళ పేర్లుకూడా తెలియవా?

నిన్ను పరీక్షించడానికే, ఇలా రాణులను పిలిపించాను. నా అనుమానం తీరిపోయింది. ఇక నీ నాటకం కట్టిపెట్టి, నిజం చెప్పేయ్! ఎవరు నువ్వు?''

నా ప్రసంగం వింటూ శిలా ప్రతిమలా నిల్చుండిపోయిందా యువతి! ఆ షాక్‌లోంచి తేరుకోడానికి చాలా సేపు పట్టిందామెకు.

తరవాత నిట్టూర్చి—''ఒప్పుకుంటాను. నేను నకిలీ రాకుమారినని ఒప్పుకుంటాను'' అంది నెమ్మదిగా.

''నీవు ఇండియన్‌వి కదూ?''

''ఔను!''

''ఈ నాటకం ఏమిటి?''

''ఇది నాటకం కాదు! ఒక గేమ్!''

''చెప్పేదేదో కాస్త అర్థమయేలా చెబితే బావుంటుంది!''

''ఇక్కడ కాదు!''

''మరి?''

''నా గదిలో చెబుతాను నింపాదిగా. ముందీ రాణులను పంపెయ్యండి.''

''ఆల్ రైట్!'' అంటూ బాడీగార్డులను కేకేసి, అతని వెంట రాణులను పంపేశాను.

''రండి!'' అంటూ తన గదివైపు దారితీసింది రమోలా.

# 6

గదిలో ప్రవేశించగానే, తలుపు మూసి, ''కూర్చోండి!'' అంది.

ఇద్దరం సోఫాల్లో కూర్చున్నాం.

సిగరెట్ అంటించి— 'ఇప్పుడు చెప్పు!' నీ అసలు పేరేమిటి?'' అడిగాను.

''సరిత!''

''నివాస స్థలం?''

''బొంబాయి!''

''రాజుకూ నీకూ ఏమిటి సంబంధం?''

''సంబంధం ఏమీ లేదు. అతను నా పొందుకోసం తపించేవాడు!''

''ఐతే, నిన్ను తన కూతురిగా దేనికి ప్రచారం చేశాడు?''

''మా ఇద్దరి మధ్య ఓ రహస్య ఒప్పందం కుదిరినందు వల్ల. నాకు బాల్యంనించీ సినిమాల పిచ్చి వుంది. పెద్ద దాన్నయ్యాక, ఎలాగైనా సినీ ఫీల్డులో ప్రవేశించి తార నవ్వాలని నిశ్చయించుకున్నాను. మా నాన్న వ్యాపారం నిమిత్తం బొంబాయి వదిలి కుటుంబ సమేతంగా కొరాకో దీవిలో స్థిరపడ్డారు. నేనక్కడే పెరిగి పెద్దదాన్న య్యాను.

బొంబాయి వదిలినా, సినిమాపిచ్చి మాత్రం నా నించి దూరంకాలేదు. అక్కడ ఒక పార్టీలో రాజుగారు నన్ను చూడటం తటస్థించింది. నా అందచందాలు ఆయన గుండెల్లో మన్మథ బాణాలు దింపాయి. ఆ క్షణంనించీ నా పొందుకోసం శతవిధాలా ప్రయత్నించసాగాడు.

ఆ రోజుల్లోనే కాకతాళీయంగా, బొంబాయి చిత్ర పరిశ్రమకు చెందిన ఓ ప్రొడ్యూసర్ తన చిత్రంలో కొన్ని దృశ్యాలు షూట్ జెయ్యడానికి, ఔట్ డోర్

యూనిట్ తో కొరాకోడివికి రావడం జరిగింది.

దాంతో నాలో సినీస్టార్ కావాలన్న కోరిక ద్విగుణీకృతమయింది. చిత్రపరిశ్రమలో ప్రవేశించడం అంత సులువైన పనికాదు. కొత్తవాళ్ళని బుక్ చేసుకోడానికి, నిర్మాతలు చాలా భయపడతారు. ఎలా? అప్పుడు తట్టింది నాకీ పథకం!

అప్పుడే రాజు భారతదేశ పర్యటనకు వెళ్ళబోతున్నట్టు తెలిసింది. దాంతో నా ప్లాన్ కు మరింత బలం చేకూరింది.

వెంటనే ఆయన్ని కలుసుకుని, నా కోరిక వెల్లడించి, నన్ను పొందాలనుకుంటే తనవెంట నన్ను భారతదేశం తీసికెళ్ళాలనీ, అక్కడ ఓ పార్టీ అరేంజ్ చేసి, ప్రముఖ వ్యక్తులతోబాటు సినీ నిర్మాతలనుకూడా ఆహ్వానించాలనీ, వారికి నన్ను రాకుమారిగా పరిచయం చెయ్యాలనీ చెప్పాను.

రాజు వెంటనే అందుకు ఒప్పుకున్నాడు. దానివల్ల భారతదేశంలో గొప్ప పబ్లిసిటీ లభిస్తుంది. పార్టీకి వచ్చిన ప్రొడ్యూసర్స్ తో, నాకు హిందీ సినిమాల్లో నటించాలనే కోరిక ఉన్నట్టు చెబితే, వారు కళ్ళు మూసుకుని ఒప్పుకుంటారు.

ఒకదేశ రాజకుమారి హిందీ సినిమాలో నటించిందని తెలిస్తే ప్రజలు ఎగబడి చూస్తారా చిత్రాన్ని. ఆ దెబ్బతో నా తొలిచిత్రం బాక్సాఫీస్ దగ్గర ఘన విజయం సాధిస్తుంది. ఆ తరవాత నా ఇంటిముందు రోజూ నిర్మాతల క్యూ తయారవుతుంది.

దానికోసం ఒక్క రాత్రి రాజును సంతోషపెడితే

పోయిందేమిటి? కాని, నా ఖర్మకొద్దీ రాజు ఇలా చని పోయాడు... ఏనా, నాకేమంత పెద్ద నష్టం కాలేదను కోండి. నే నెలాగూ రాఘమోరిగా ఓ హిందీ ప్రొడ్యూ సర్ కు పరిచయమయ్యాను," అంది సరిత.

"నీలో నిజంగా గొప్ప నటనాశక్తి ఉంది. బహుశా ఈ నాటకం రాజా సెక్రెటరీ భోలాన్ కూ తెలుసను కుంటాను."

"ఔను! అతనికే కాదు. రాజు బాడీగార్డు లిద్దరికీ తెలుసు. ఏనా, రాజా కోరికముందు వాళ్ళు కిమ్మనకుండా ఊరుకోవలసిందే కదా? ఎటొచ్చీ, మీ రీ రహస్యాన్ని ఎవ్వరిముందూ వెల్లడి చేయకండి. ప్లీజ్."

నాకు నవ్వాగలేదు. "మిస్ సరితా! ఒకరి జీవితం వెలుగులోకి వస్తోంటే దాన్ని అడ్డుకుని పాడుజెయ్యాడం నా తత్వంకాదు. ఆల్ రైట్! అవసరం కలిగినప్పుడు మళ్ళీ కలుసుకుంటాను. మా అనుమతిలేనిదే నీవీ నగరాన్ని వదిలి వెళ్ళకూడదు," అన్నాను లేస్తూ.

సరీత తలూపింది.

అక్కణ్ణించి తిన్న మా హెడ్ క్వార్టర్ కి బైలుదేరాను, డైరెక్టర్ ముఖర్జీగారికి నా దర్యాప్తు వివరాలు తెలియ జెయ్యాడానికి.

# 7

ఉదయం తొమ్మిదిగంటల ప్రాంతంలో, నా ఆఫీసు బల్లమీద టెలిఫోన్ మోగింది.

రిసీవర్ అందుకుని "సారథి స్పీకింగ్ !" అన్నాను.

"నేనండీ, ఇన్ స్పెక్టర్ భండారీని! పోలీస్ హెడ్ క్వార్టర్ నించి మాట్లాడుతున్నాను. మీరు కోరిన వ్యక్తి

ఆచూకీ తెలిసింది...సారీ! వాడి ప్రియురాలి ఆచూకీ! వాడింకా తెరమరుగులో ఉన్నాడు. వాడి ప్రియు రాలిద్వారా ఏమైనా వివరాలు తెలియవచ్చు. ఆమె పేరు గీతా. బాబీ హోటల్ డాన్సర్!"

"వెరీగుడ్! ఆమె అడ్రస్ చెప్పండి. నేనే వెళ్ళి మాట్లాడుతాను."

"3-'-146,పటేల్ రోడ్, ఫ్లాట్ నెంబర్ పన్నెండు. ఆసక్తికరమైన విషయం ఏమిటంటే, నిన్న ఉదయమే గీతా హోటల్లో తన ఉద్యోగానికి రాజీనామా ఇచ్చిం దట. ఇద్దరూ కలిసి ఎక్కడైనా ఉడాయించాలను కుంటున్నారో ఏమో!"

"సరే! నేను కనుక్కుంటాను. థాంక్స్!" అని రిసీ వర్ పెట్టి లేచాను.

టాక్సీలో హుటాహుటిన పటేల్ రోడ్ చేరు కున్నాను. క్షణాల్లో భండారీ చెప్పిన బిల్డింగ్ కను క్కున్నాను. అందులో చాలామంది అద్దెకుంటారు. మెట్లెక్కి రెండో అంతస్థులో ప్రవేశించాను, ఫ్లాట్ నెంబర్ పన్నెండు తలుపు మూసి ఉంది.

మునివేళ్ళతో తట్టాను మెల్లిగా.

ఐదు నిమిషాల తరవాత తెరుచుకుంది.

"ఎవరు కావాలి?"

"గీతాగారు ఉన్నారా?"

"నేనే గీతాని! మీరెవరు?"

పాతికేళ్ళుంటాయామెకి. గులాబీరంగు ఒళ్ళు. సాధార ణంగా డాన్సర్లకుండే అన్ని హంగులూ ఉన్నాయి ఆకారంలో.

జేబులోంచి నా ఐడెంటిఫికేషన్ కార్డుతీసి చూపాను దాన్ని చూడగానే ఆమె ముహంలో రంగులుమారాయి.

"ఒక సి. బి. ఐ. అధికారికి నాతో ఏంపని?" అంది తేరుకుంటూ.

"చెబుతాను. ముందు లోనికిపద!" అంటూ గదిలోనికి అడుగు పెట్టాను.

అది డ్రాయింగ్ రూం. దాని పక్కనే మరోగది ఉంది. పరశురామ్ వున్నాడా? జేబులోంచి పిస్తోలుతీసి తొంగి చూశాను ఆ గదిలోకి.

ఎవ్వరూ లేరు!

టేబిల్ మీద రెడీగావున్న రెండు సూట్ కేసులూ' ఏర్ బ్యాగ్ నన్నాకర్షించాయి. అంటే, గీతా ఎక్కడికో ప్రయాణం కట్టడానికి సిద్ధంగా వుందన్నమాట.

"అసలు విషయం చెప్పకుండా ఏమిటి సోదా చేస్తున్నారు?" అంది ఆక్షేపణ చెబుతూ.

"నాకు పరశురామ్ కావాలి! మీరిద్దరూ స్నేహితులని తెలిసింది. ఎక్కడున్నాడు పరశురామ్?"

"అతను చేసిన నేరం ఏమిటి?"

"రాత్రి జరిగిన రాజా హత్యగురించి, ఆయన వైఢూర్యం దొంగతనం గురించీ నీకు తెలియదా?"

"రాత్రి పదకొండు గంటలకు ఓ ప్రత్యేక వార్తా ప్రసారం జరిగింది. అప్పుడు విన్నాను రేడియోలో!"

"ఆ హత్యా, దొంగతనం చేసింది ఎవ్వరో కాదు. పరశురామ్!"

"అబద్ధం! అతను దొంగతనం చేశాడంటే ఒప్పుకుంటానుగానీ, హత్య చేశాడంటే నేన్నమ్మను. పరశురామ్

హత్యలంటే హడలి చస్తాడు" అంది గీత ఖండితంగా.
"కావచ్చు, నా అంచనా ప్రకారం అతను ఇంకెవరి కోసమో ఆపనికి పూనుకొన్నాడు. అది హత్యా పథకం అని అతనికి తెలిసివుండదు. పొరబాటున హత్య జరిగి పోయింది. వైధూర్యం చొంగిలించింది మాత్రం అతనే!

నీ గదిలో సామాన్లు సర్దివున్నాయి. అంటే, మీరిద్దరూ ఏ విదేశానికో ఎగిరిపోదామని సిద్ధంగా వున్నారు. ఎక్కడున్నాడు పరుశురామ్?" అడిగాను తీక్షణంగా.

గీతా పకపక నవ్వసాగింది.
"ఏమిటా నవ్వు?"

"మీరు చాలా ఆలశ్యంగా వచ్చారు! పరుశురామ్ ఈ దేశంనుంచి ఎప్పుడో ఎగిరిపోయాడు."

"మిస్ గీతా! నేను సి. బి. ఐ. ఆఫీసర్నని మరచి పోకు!"

"నామాట నమ్మండి! ఆ నీచుడు నన్నూ మోసంచేసి పోయాడు. నిన్నరాత్రి, హోటల్లో డాన్స్ ప్రోగ్రాం ఇస్తున్న నాదగ్గరకు వచ్చి, ఈరాత్రి తనకు ఓ వ్యక్తి దగ్గర లక్షరూపాయలు రాబోతున్నాయనీ, ఆ డబ్బుతో ఎక్కడికయినా వెళ్ళి, స్వంత బిజినెస్ ప్రారంభిద్దామనీ, నన్ను వెంటనే ఇంటికెళ్ళి సామాను సర్దుకోమని చెప్పాడు. తను డబ్బు తీసుకుని రాత్రి ఒంటిగంటకు వచ్చి కలుస్తానని వెళ్ళిపోయాడు.

రాత్రంతా కాచుకున్నాను. ఇంతవరకూ పత్తాలేదు. నన్ను దగాచేశాడు రాస్కెల్! వాడి మాటలునమ్మి బంగారంలాంటి ఉద్యోగం వదులుకున్నాను" అంది గీతా ద్రబడ్డ మొహంతో.

"అంటే అక్కడ రాజుగారి హత్యజరిగిన వెంటనే నిన్ను కలిశాడన్నమాట!"

"రాజుగారి హత్యలో, వైఢూర్యం దొంగతనంలో అతని చెయ్యివుందని నాకు బొత్తిగా తెలీదు."

"డబ్బు తీసుకోడానికి ఎక్కడకెళ్తున్నాడో చెప్పలేదా నీకు?"

గీత కాసేపు ఆలోచించి "ఆఁ, నిరంజన్ దాస్ అనే వ్యక్తి దగ్గరకెళుతున్నట్లు చెప్పాడు. నిరంజన్ దాస్ తెలుసా మీకు?" అంది.

"మిడ్ నైట్ బార్ ఓనర్ కదూ?"

"ఔను. అతనే!"

"పరశురామ్ నివాసం ఎక్కడో తెలుసా నీకు?"

"తెలుసు."

"వెళ్ళి కనుక్కోలేదా, అక్కడున్నాడో లేదో?"

"ఇప్పుడు వెళ్ళాలనే తయారవుతున్నాను. ఇంతలో మీరు వచ్చారు."

"నీకా శ్రమ తప్పింది. నేనే వెళ్ళి కనుక్కుంటాను. అడ్రస్ చెప్పు" అన్నాను డైరీతీస్తూ.

"సుభాష్‌రోడ్, తివారీ మంజిల్, ప్లాట్ నెంబర్ 24."

"సరే పోలీసులకి ఇంటిమేట్ చెయ్యందే నీవీ నగరం వదలకూడదు. ఇది నా ఆజ్ఞ. పాటించక పోయావో చింతిస్తావ్" అని అక్కడ్నించి బయటపడి టాక్సీ ఎక్కాను.

నిరంజన్ దాస్ సంగతి నాకు బాగా తెలుసు. పేరుకు మిడ్ నైట్ బార్ నడుపుతున్నాడు గానీ, ఢిల్లీలో పేరు

మూసిన స్మగ్లర్. రాజులాగే అతనికీ చారిత్రాత్మక వస్తువులూ, విలువయిన ఆభరణాలు సేకరించే హాబీ ఉందట.

పరుశురాంచేత వాడే రాజును హత్యచేయించి, పింగోరా వైఢూర్యాన్ని తెప్పించుకోలేదు కదా! దాన్ని దొంగిలించి తెస్తే లక్షరూపాయలిస్తానన్నది వాడేనా?

దారి పొడుగునా ఇలా ఆలోచిస్తూ, సుభాష్‌రోడ్‌లో టాక్సీ దిగాను.

తివారీ మంజిల్ కనుక్కోడం పెద్దకష్టం కాలేదు. మూడంతస్థుల భవనం అది. అనేక కుటుంబాలు అద్దెకుంటాయందులో.

ఫ్లాట్ నెంబర్స్ చెక్ చేసుకుంటూ మూడో అంతస్థు చేరుకున్నాను.

గీతా చెప్పిన ఫ్లాట్ నెంబర్ 24 తలుపుమూసివుంది. గడియకి తాళం లేకపోవడం ఆశ్చర్యాన్ని కలిగించింది. కొంపదీసి గీత తప్పుడు అడ్రస్ యివ్వలేదుకదా?

ఆలోచిస్తూ మునివేళ్ళతో తట్టబోయాను తలుపును. చెయ్యి పడగానే కిర్రుమంటూ తెరుచుకుంది. నివ్వెర బోతూ పూర్తిగాతోసి లోన అడుగుపెట్టాను. అదిరెండు గదుల ఫ్లాట్.

ముందుగదిలో ఎవ్వరూలేరు. నిశ్శబ్దం. జేబులోంచి పిస్తోలుతీసి రెడీగా పట్టుకొని అడుగులో అడుగువేసు కుంటూ రెండో గదిలో ప్రవేశించాను. అంతే!

గదిలో కనిపించిన దృశ్యం నా శరీరంలో రక్తప్రసారాన్ని స్థంభింపచేసింది. కాసేపు రెప్ప వేయకుండా అలే చూస్తూండి పోయాను.

నేలమీద బోర్లాపడుకున్నాడో వ్యక్తి. ఛాతీక్రింద రక్తపుమడుగు. ఇంకా గడ్డకట్టని రక్తపు మడుగు! ఎవరు?

చెప్పలేని ఆత్రంతో, ఒక్క అంగలో అతన్ని సమీపించి, వెల్లకిలా తిప్పాను.

పరుశురామ్!

కళ్ళు మూతలు పడున్నాయి. గుండెమీద గాయం.

నిట్టూరుస్తూ, నెమ్మదిగా శవాన్ని నేలమీద పడుకో బెట్టాను.

ఇక నా పరిశోధన ముందుకు సాగాలంటే ఒకేఒక దారివుంది.

నిరంజన్‌దాస్!

అతన్ని కలుసుకుంటే, తప్పక ఏమైనా తెలియవచ్చు. సాయంత్రం ఏడు గంటల ప్రాంతంలో వెళ్ళాలి అతనింటికి.

తీవ్రంగా ఆలోచిస్తూ లేచాను.

## 8

వీధిలో జనసంచారం మామూలుగా వుంది.

వీధికిరుప్రక్కలా వెలుగుతున్న లైట్లకాంతిలో రిస్టు వాచీ చూసుకున్నాను.

సరిగ్గా ఏడుగంటలు.

అదే నిరంజన్‌దాస్ మేడ.

కాంపౌండ్ గేటు మూసివుంది. దాన్ని తోసుకుంటు కాంపౌండ్‌లో ప్రవేశించి సింహద్వారంవైపు వెళ్ళాను.

తలుపు మూసివుంది. కాలింగ్ బజర్ వత్తాను. ఐదు నిమిషాల తర్వాత, పొడుగ్గా, బలంగావున్న ఓ వ్యక్తి తలుపు తెరిచాడు. మొహంమీద రెండుమూడు కత్తి గాట్లు.

"ఏమిటి?" అడిగాడు కనుబొమలెగరేస్తూ.

"నా పేరు కంచన్‌దాస్! నిరంజన్‌దాస్ గారితో పనుండి వచ్చాను."

"ఏమిటి పని?"

"వారితోనే మాట్లాడాలి. చాలా ముఖ్యమైన బిజినెస్!"

"ఆల్‌రైట్, కమాన్!" అంటూ గుమ్మానికడ్డు తొలిగాడు.

హాల్లో అడుగుపెట్టాను.

మెట్లగుండా నన్ను పైకి తీసికెళ్ళి ఓ గదిముందాగి, లోనికెళ్ళాడతను. రెండు నిమిషాల తరవాత తిరిగివచ్చి "వెళ్ళండి!" అన్నాడు గదిలోకి దారి చూపుతూ.

నిస్సంకోచంగా ప్రవేశించాను గదిలో! గదిమధ్య సోఫాసెట్టు. ఓ సోఫాలో నిరంజన్‌దాస్, ఓ నడివయసు స్త్రీ కూర్చునున్నారు.

"రండి, కూర్చోండి. నాతో ఏమిటి పని?" అడిగాడు నిరంజన్‌దాస్ మర్యాదగా.

వారి కెదురుగా సోఫాలో చతికిలబడ్డాను. "దాస్ గారూ మీతో మాట్లాడ్డానికి వచ్చాను."

"చెప్పండి!"

ఆ స్త్రీవైపు చూశాను సందేహంగా.

నిరంజన్‌దాస్ నవ్వి "ఈమె ఎవ్వరో కాదు. నా భార్య శాంతాబాయి..." అంటూ ఆమెవైపు తిరిగి "శాంతా! వెళ్ళి కాఫీ పంపించు" అన్నాడు.

ఆ స్త్రీ మొహం చిటపట లాడిస్తూ లేచి బైటి కెళ్ళింది.

"ఇప్పుడు చెప్పండి ఏమిటో?" అన్నాడు నిరంజన్ దాస్.

"రాత్రి జరిగిన కోరాకోదీవి రాజు హత్యగురించి మీకు తెలుసా?"

"ఉదయం పేపర్లో చదివాను! ఏం?"

"హత్యతో బాటు అతని షింగోరా వైఢూర్యంకూడా దొంగిలించ బడింది. మీరెప్పుడయినా ఆ వైఢూర్యాన్ని చూశారా?"

నిరంజన్ దాస్ పెదవి విరచి "చూడలేక పోయాను. దాన్ని చూడాలన్న కాంక్ష విపరీతంగా ఉండేది నాకు. ఆ పార్టీకి నన్నూ ఆహ్వానించివుంటే చూసి వుండేవాణ్ని ఐతేనేం! నా దగ్గరకూడా అటువంటి వైఢూర్యంవుంది. ఐమీన్, నకిలీ వైఢూర్యం. అచ్చు అటువంటిదే!" అన్నాడు.

"నిజంగానా?" అడిగాను నమ్మనట్టు.

నిరంజన్ దాస్ తలూపి "అదొక్కటే కాదు. నాదగ్గర ప్రపంచపు విలువైన వస్తువుల నకళ్ళన్నీ ఉన్నాయి. వాటిని చూసినప్పుడల్లా నాకనిపిస్తుంది. ఇవన్నీ నిజమైన వైతే ఎంత బావుండో అని...

అదిసరే, ఏదో ఇన్సూరెన్సు కంపెనీగురించి చెబుతూ ఆగిపోయారు. ఏమిటది?" అన్నాడు నిరంజన్ దాస్ మాట మారుస్తూ.

కాస్త ముందుకువంగి చెప్పసాగాను. "నిన్నరాత్రి దొంగిలించబడ్డ ఆ వైఢూర్యాన్ని రాజు కోటిరూపాయ లకు ఓ అమెరికన్ కంపెనీలో ఇన్ష్యూర్ చేయించాడు. మార్కెట్లో అంత ఖరీదయిన వస్తువును యెవ్వరూ

కొనరు. ఆ దొంగ విధిలేక దాన్ని నాలుగయిదు ముక్కలు చేసి విడివిడిగా అమ్మడానికి ప్రయత్నించవచ్చు.

అలా ముక్కలుచేసిన పక్షంలో దాని ఖరీదుతగ్గి, నాలుగులక్షలకంటే ఎక్కువరాదు. ఆ ఇన్‌షూరెన్సు కంపెనీ, కోటిరూపాయలు నష్టపడే బదులు, ఎవ్వరికీ తెలీకుండా ఆ దొంగకు ఐదు లక్షలు చెల్లించి దాన్ని కొనటానికి సిద్ధంగావుంది.''

''ఈ ఆఫర్‌ని తీసుకొని మీరు నా దగ్గర కెందుకొచ్చారో అర్థం కావడంలేదు''అన్నాడు నిరంజన్‌దాస్ ఆశ్చర్యంగా.

''నేను ఆ కంపెనీ తరఫున మధ్యవర్తిగా పనిచేస్తున్నాను. నాకు తెలిసిన ఓ స్నేహితుడు ఈ విషయంలో మిమ్మల్ని కలుసుకోమనీ, మీకూ చారిత్రాత్మక వస్తువులు సేకరించే హాబీ వుందనీ, ఆదొంగ వైఢూర్యం అమ్మే ప్రయత్నంలో మిమ్మల్ని కలుసుకోవచ్చని, మీద్వారా ఆ దొంగకు ఇన్‌షూరెన్సువారి ఆఫర్ అందజెయ్యవచ్చనీ, చెప్పాడు'' అన్నాను నవ్వుతూ.

నిరంజన్‌దాస్ నిట్టూర్చి ''ఆల్ రైట్! అటువంటి వ్యక్తి ఎవ్వరైనావస్తే తప్పకుండా మీకు ఇంటిమేట్ చెయ్యగలను'' అన్నాడు.

''థాంక్స్! అన్నట్టు ఓసారి మీ పెర్సనల్ మ్యూజియమ్ చూపిస్తారా?'' అడిగాను కుతూహలంగా.

''దానికేం, రండి!'' అంటూ లేచాడు నిరంజన్.

అతన్ననుసరిస్తూ బయటికెళ్ళి మరోగదిలో ప్రవేశించాను. ఆగది నాలుగువైపులా అద్దాల బీరువాలున్నాయి. వాటినిండా రకరకాల వస్తువులూ, పెయింటింగ్స్ అమర్చి వున్నాయి.

గదిమధ్య గాజుషోకేస్ ఉంది. అందులో రకరకాల వజ్రాభరణాలు పేర్చివున్నాయి. వాటి మధ్యేవుంది ఆ వైఢూర్యం!

అదే సైజు! అదే మెరుపు! అదే ఆకారం!!

నకిలీ అంటే నమ్మశక్యం కాలేదు.

"నిజంగా ఇది నకిలీదేనా?" అడిగాను ఆశ్చర్యంగా.

"ఇదంత ఖరీదయినదయితే ఇంత నిర్లక్ష్యంగా ఇక్కడ పెడతానా? నిజమైన వైఢూర్యంలో అతుకులుగానీ, గీతలుగానీ వుండవు. మీరు దీన్ని భూతద్దంతో పరిశీలించారంటే, సవాలక్ష అతుకులూ, గీతలూ కనిపిస్తాయి. చూడండి" అంటూ బీరువాలోంచి ఓ పెద్దసైజు భూతఅద్దం తీసి అందించాడు నిరంజన్‌దాస్.

దాంతో వైఢూర్యాన్ని పరిశీలించాను పరీక్షగా.

నిరంజన్ చెప్పింది నిజం! అనేక అతుకులూ గీతలూ, కనిపిస్తున్నాయి. ఏమిటీమాయ?

"దీని వెలయెంత? ఎక్కడ కొన్నారు?" అడిగాను.

"చాలా రోజులక్రితం రాజస్థాన్‌లో ఓ వ్యక్తి దగ్గర పదివేలకు కొన్నాను" అతని మాట పూర్తి కాకముందే అతనిభార్య శాంతాబాయి వచ్చింది గదిలోకి.

"బజరంగ్ మిమ్మల్నోసారి రమ్మంటున్నాడు. చాలా ముఖ్యమైన విషయం చెప్పాలిట!" అంది.

నిరంజన్ నావైపు తిరిగి "ఎక్స్‌క్యూజ్ మీ! ఇప్పుడే వస్తాను. మీరు చూస్తూండండి" అంటూ బయటికి నడిచాడు.

అతని భార్య ఇంకా గదిలోనే వుంది.

అంతక్రితం నేను పరిశీలించిన నకిలీ వైఢూర్యంకూడా ఇంకా షోకేసు మీదేవుంది.

ఆమెదృష్టి దానిమీద పడగానే కనుబొమలు ముడిచి "ఇది కొత్తగా కొన్నట్టుందే మావారు! మీరుతెచ్చారా" అంది.

మరోసారి నివ్వెరబోయాను. "అదేమిటి, మీ భర్త చాలా రోజులక్రితం దీన్ని కొన్నారటగా? ఇంతవరకూ చూళ్ళేదా మీరు?"

"నిన్న ఉదయం వరకూ ఇదిక్కడలేదు. మొదటిసారి చూస్తున్నాను."

మరోమలుపు తిరగబోతుంది కథ!

నిన్న ఉదయం వరకూ ఇదిక్కడలేదు. నిన్నరాత్రే రాజు వైఢూర్యం దొంగిలించబడింది. కాని ఇది నకిలీ సరుకు. మరి నిరంజన్‌దాస్ దీన్ని ఎప్పుడో ఎక్కడో కొన్నానని దేనికి బొంకాడు? ఏదో మిస్టరీవుంది.

"ఇక వెళతాను. మావారు కాస్తకోపిష్టి!" అంటూ వెళ్ళిపోయింది శాంతాబాయి.

నేనక్కడే నిల్చుని నిరంజన్‌కోసం యెదురుచూడ సాగాను.

అంతలో తలుపుదగ్గర చప్పుడయింది.

అతనే కాబోలనుకుంటూ వెనుదిరిగి ఉలిక్కిపడ్డాను.

ఆతను నిరంజన్‌దాస్ కాడు!

నన్ను ఇంట్లోకి తీసుకొచ్చిన ఆజానుబాహుడు. బహుశా బజరంగ్ అతనే అయ్యుంటాడు. అప్పుడు పడింది నాదృష్టి అతని ఎడంచేతిమీద.

నల్లగా నిగనిగ మెరుస్తున్న పిస్తోలు!

# 9

"పిచ్చి వేషాలు వెయ్యడానికి ప్రయత్నించక బుద్ధిగా చేతులెత్తి బయటకిరా!" అన్నాడు బజరంగ్ పిస్తోలు నాకు గురిపెడుతూ.

నేను సి. బి. ఐ. మనిషినని పసిగట్టారా? ఏం జరుగుతుందోనని చేతులెత్తి బయటికి నడిచాను.

పిస్తోలుతో నన్ను కవర్ చేస్తూ పక్కగదిలోకి తీసుకెళ్ళాడు.

"రండి మిస్టర్ సారథి! మీరు సి. బి. ఐ. ఆఫీసరని ముందే చెప్పివుంటే, ఇంతకన్నా ఎక్కువ మర్యాదచేసేవాళ్ళంకదా?

ముందు మా బజరంగ్ నిన్ను గుర్తుపట్టలేదు. అందుకే తిన్నగా నా దగ్గరకి తీసుకొచ్చాడు. నేనింతవరకూనిన్ను చూళ్ళేదు గనక నీవు చెప్పిందంతా నమ్మాను. తరువాత సడన్‌గా జ్ఞాపకం వచ్చింది బజరంగ్‌కు నీ వెవ్వరో!

అందుకే మనం మ్యూజియం గదిలో వున్నప్పుడు నన్ను బయటికి పిలిపించి నీ సంగతి చెప్పాడు. రాత్రి జరిగిన రాజాహత్యా, దొంగతనం నేనే చేయించానని అనుమానిస్తున్నావుకదూ?" అడిగాడు నిరంజన్ నింపాదిగా.

"ఇంతవరకు అనుమానించాను. ఇప్పుడు రూఢీగా చెప్పగలను, ఆ నేరాలతో నీకు సంబంధం ఉందని! నీ మ్యూజియంలో వున్న వైఢూర్యం నిన్న ఉదయం వరకూ నీదగ్గరలేదు. నిన్న రాత్రే హత్యా, దొంగతనం జరిగాయి. ఇప్పుడా వైఢూర్యం నీదగ్గరికి వచ్చింది. దాన్నెప్పుడో రాజస్థాన్‌లో కొన్నట్టు నాతో బొంకావు. నేరంలో నీ చెయ్యి లేకపోతే ఈ నాటకం దేనికి?"

నిరంజన్‌దాస్ మొహం వెలవెల పోవడం గమనిం చాను.

"ఎలా తెలిసింది నీకు? నిన్న ఉదయం అది నాదగ్గర లేదని?"

నవ్వి "ఎలా తెలిసిందో నీకు చెప్పదలచుకోలేదు" అన్నాను.

"నీవు చెప్పినా, చెప్పకున్నా నాకు నష్టంలేదు. ఆ విషయం నీతోబాటు కొద్దిసేపట్లో సమాధి కాబోతుంది" అన్నాడు నిరంజన్ పళ్ళునూరుతూ.

"ఐతే ఈ బుల్‌డాగ్ చేత నన్ను హత్య చేయిస్తా వన్నమాట. అదంత సులభమైన పననుకున్నావా?"

నిరంజన్ పకపకనవ్వి "బజరంగ్‌కు చేతనయిన పను లలో అతి సులువైన పని హత్య" అంటూ అతనివైపు తిరిగి "బజరంగ్! కిల్ హిమ్!" అరిచాడు నిరంజన్.

బజరంగ్ నావైపు పిస్తోలు గురిపెట్టి ట్రిగ్గర్ వత్తబో యాడు అంతే! "ఢాం! ఢాం!" రెండుసార్లు పిక్కటి ల్లింది గది.

బజరంగ్, నిరంజన్‌దాస్ ఇద్దరూ జబ్బలు పట్టుకొని గావు కేకలు పెట్టారు. ఆ షాక్‌వల్ల బజరంగ్ చేతిలోని పిస్తోలు పట్టుతప్పి కిందపడింది.

అప్పుడే గదిలోకి ప్రవేశించాడో వ్యక్తి.

గాయపడ్డ ఇద్దరూ నివ్వెరపోతూ చూశారతనివైపు.

ఈసారి నవ్వడం నా వంతయింది. "మిస్టర్ నిరంజన్ దాస్! నీ యింటికి నేనొక్కణ్నే బయలుదేరి రాలేదు. ఇక్కడ ఇటువంటి సంఘటన ఎదురుపడితే, ఆదుకోడా నికి నా జూనియర్ని కూడా వెంటబెట్టుకొచ్చాను. సమ

యానికతను ఇంట్లో ప్రవేశించి బజరంగ్ చేతిలో నేను బలికాకుండా కాపాడాడు. ఇక దాగుడుమూతలు అనవసరం! చిత్రహింసలు పెట్టకముందే నిజం చెప్పడం నీకే మంచిది.''

నామాటల్లోని సత్యాన్ని గ్రహించి ఉంటాడు నిరంజన్. బాధను భరిస్తూ అతికష్టంమీద నోరువిప్పాడు.

''రాజుగారి హత్యతో నాకెలాటి సంబంధం లేదు. రాత్రి పదిగంటలకు పరశురామ్ ఆ వైఢూర్యాన్ని నా దగ్గరికి తీసుకొచ్చి లక్షరూపాయలకు బేరం పెట్టాడు.

నా పరికరాలతో దాన్ని పరిశీలిస్తే, నకిలీ సరుకని తేలింది. అది నకిలీ వస్తువని, పదివేలకిమించి దమ్మిడీ చెయ్యదని చెప్పానతనకి. దాంతో పరుశురామ్ ఉగ్రుడై బండబూతులు తిట్టసాగాడు.

ఎవ్వర్ని తిడుతున్నావని అడిగాను. ఒకపని చేసిపెట్టినందుకు ప్రతిఫలంగా దాన్ని అమ్ముకోమని ఓవ్యక్తి తనకిచ్చాడనీ, లక్షరూపాయలొస్తాయని చెప్పాడని, తను మోసపోయానని తక్షణం అతనికి ఫోన్ చేసి, అది నకిలీ సరుకని చెబుతాననీ, డబ్బుకావాలని పట్టుబడతాననీ చెప్పి వెళ్ళిపోయాడు. మళ్ళీ తిరిగిరాలేదు'' అన్నాడు నిరంజన్ దాస్.

గాయపడ్డ ఆ గుంటనక్కలిద్దర్నీ నా జూనియర్ కప్పజెప్పి, ఆ నకిలీ వైఢూర్యం తీసుకొని అక్కడ్నించి తిన్నగా రాయబారి సామ్రాన్ నివాస గృహానికి బయలుదేరాను.

## 10

నిన్నరాత్రి రాజుహత్య జరిగిన హాలు అది.

హాలుమధ్య నలుగురు రాణులూ, నకిలీ రాకుమారీ,

రాయబారి సామ్రాన్, సెక్రటరీ భోలాన్, ఇద్దరు బాడీ గార్డులు, ఆగ్రా మొగల్ మ్యూజియం డైరెక్టర్ దండావతే సమావేశమై వున్నారు.

జేబులోంచి నిరంజన్‌దాస్ దగ్గర సంపాదించిన నకిలీ వైఢూర్యాన్ని తీశాను. దాన్ని చూడగానే అందరి మొహాల్లో దిగ్భ్రాంతి కనుపించింది.

"ప్రొఫెసర్ దండావతే! మీరు వజ్రాల ఎక్స్‌పర్ట్ కదా? దీన్ని పరిశీలించి మీ అభిప్రాయం తెల్పండి" అన్నాను.

ప్రొఫెసర్ జేబులోంచి గడియారాలు రిపేరుచేసే వాళ్ళు పెట్టుకునే అద్దపుగొట్టం లాటిదితీసి, కుడికంటి మధ్య ఇరికించి, వైఢూర్యం అందుకున్నాడు.

ఐదు నిమిషాలవరకూ దాన్ని క్షుణ్ణంగా పరీక్షించి "ఇది నకిలీ వైఢూర్యం!" అని తేల్చిపారేశాడు.

"ఔను! చాలా రోజులక్రితమే, హంతకుడు రాజాగారి దగ్గరున్న అసలు వైఢూర్యాన్ని కాజేసి అమ్ముకుని, ఆయన్ని మభ్యపెట్టడానికి దీన్ని యథాస్థానంలో వుంచాడు.

ప్రొఫెసర్ దండావతే రాజాగారితో ఉత్తరప్రత్యుత్తరాలు జరిపి, ఆయన వజ్రవైఢూర్యాలను ఒక్కసారి చూడదలచినట్లు విన్నవించుకున్నాడు. తను కొద్దిరోజుల్లో భారతదేశం రాబోతున్నాననీ, అక్కడే చూడవచ్చనీ, రాజాగారు ప్రొఫెసర్‌కు రిప్లై యిచ్చారు.

దాంతో హంతకుడికి భయం పట్టుకుంది. ఒక అనుభవజ్ఞుడు వాటిని పరీక్షిస్తే ఆ వైఢూర్యం నకిలీదని యిట్టే పసిగట్టవచ్చనీ, దాంతో తన బండారం బద్దలై, రాజా

చేతిలో మరణదండన తప్పదనీ హడలిపోయాడు.

అప్పుడే అతనికీపథకం స్ఫురించింది. ఇక్కడ రాజు గారి పర్యటన ఏర్పాట్లు చూడటానికి మూడురోజులు ముందువచ్చి, మాజీ నేరస్థులకోసం గాలించాడు. పరశు రామ్ అనే పాత కేడీని కలుసుకున్నాడు...

పాకెట్లో బాంబుపెట్టి పరశురామ్‌చేత రాజుగారికి బహుమతిగా పంపించాడు. దాంట్లో ప్రాణాంతకమైన బాంబు ఉన్నట్టు పరశురామ్‌కు తెలీదు. అందులో గాస్ బాంబు ఉందనీ హాలంతా పొగమయం కాగానే షోకేస్ లోంచి వైఢూర్యం తీసుకు పారిపొమ్మని చెప్పాడు హంత కుడు పరశురామ్‌తో.

దానికి విరుద్ధంగా, బాంబుపేలి రాజుగారు మరణించే సరికి ఆ హడావుడిలో, వైఢూర్యం కాజేసి పారిపోయాడు పరశురామ్. అదే అతని ప్రతిఫలమని దాని ఖరీదు లక్ష రూపాయలుంటుందనీ, అమ్మి డబ్బుచేసుకోమని అంతకి ముందే చెప్పివుంచాడు హంతకుడు.

వైఢూర్యంతో తిన్నగా నిరంజన్‌దాస్ ఇంటికెళ్ళాడు పరశురామ్. నిరంజన్‌దాస్ దాన్ని పరీక్షచేసి, అది నకిలీ సరుకనీ, పదివేలకు మించి ఖరీదు చెయ్యదని చెప్పాడు.

పరశురామ్ ఉగ్రుడై, వెంటనే హంతకుడికి ఫోన్‌చేసి ఆ సంగతిచెప్పి డబ్బు డిమాండ్ చేశాడు. లేదా, అతని గుట్టుబైట పెడతానని బెదిరించాడు.

హంతకుడు డబ్బు తెచ్చిస్తానని నమ్మించి, పిస్తోలుతో వెళ్ళి పరశురామ్‌ని కాల్చేశాడు. ఈ పూర్తి పథకంలో హంతకుడివల్ల రెండు పొరపాట్లు జరిగిపోయి, నా దృష్టిని అతనివైపు మళ్ళించాయి.

"ఏమిటా పొరపాట్లు?" అడిగాడు రాయబారి ఆత్రతగా.

"మొదటిది పిస్తోలుతో పరశురామ్‌ని కాల్చాడే గాని అతను చచ్చాడా? లేదా? అని ధృవీకరించుకోలేదు. కొన ఊపిరిలో నాకు హంతకుడి గురించి చెప్పి, ప్రాణం వదిలాడు" అని అబద్ధమాడాను.

"పోతే రెండో పొరపాటు రాత్రి నేను హంతకుణ్ని కలుసుకుని రాజుగారి హత్య రాజకీయంగా జరిగిందనీ, రాజ్యకాంక్షగల వారెవ్వరో అపని చేయించారని చెప్పే సరికి, నన్ను తప్పుదోవ పట్టించడానికి రాజుగారి పెద్ద కొడుకును తాగుబోతుగా, జూదరిగా, వ్యభిచారిగా చిత్రించాడు..."

"అబద్ధం! రాజుగారి పెద్దకుమారునికి అటువంటి దురలవాట్లేవీ లేవు. ఆయన చాలా ఉత్తముడు. అంత చెడ్డగా ఎవరు చెప్పారు మీకు?" అడిగాడు రాయబారి తీక్షణంగా.

"ఎవ్వరో కాదు, ఇతనే!" అన్నాను భోలాన్ వైపు చూపిస్తూ.

ఆవాక్యం నానోట వస్తుందని అతను ముందే పసిగట్టి ఉంటాడు. నా వాక్యం పూర్తికావడం అతని చేతిలో మెరుపులా పిస్తోలు రావడం ఒకేసారి జరిగిపోయాయి.

"నిల్చున్న చోటునుంచి ఎవ్వరూ కదలొద్దు! మిస్టర్ సారథీ! నువ్వు నన్ను అరెస్ట్ చెయ్యలేవు. నేను మీ దేశ పౌరుణ్ని కాను. నాకు పూర్తి అధికారం వుంది. ఈ దేశం వదలి మరేదేశానికయినా వెళ్ళిపో..." అతని మాటలు ఇంకా నోట్లోనే ఉండిపోయాయి.

అంతవరకూ మౌనంగా ఈ తతంగమంతా చూస్తూ నిల్చున్న బాడీగార్డ్లిద్దరూ, తమతమ ఒరల్లోంచి కైజార్లు లాగి కన్నుమూసి తెరిచేలోగా భోలాన్ వీపులో దింపే శారు. కైజార్లు రెండూ అతని వీపుగుండా ఛాతీ ఇవత లకి వచ్చి మెరవసాగాయి.

భోలాన్ గావుకేక పెడుతూ మొదలు నరికిన చెట్టులా ముందుకు పడిపోయాడు!

బాడీగార్డ్స్ వంగి నాకు అభివాదంచేసి—"ఈ దేశ ద్రోహి మా ప్రభువును కిరాతకంగా చంపాడు. ఆయన ప్రాణరక్షణకోసం నియమింపబడ్డ మేము, ఆయన్ని రక్షించుకోలేక పోయాం!

ఈ నమ్మకద్రోహిని ఇలాచంపి, ఆయన ఆత్మకుశాంతి కలిగించ గలిగాం. మీరు మమ్మల్ని అరెస్ట్ చెయ్యవచ్చు" అన్నారు వినయంగా.

"నో, మిస్టర్ సారథీ! మీరు వాళ్ళను అరెస్ట్ చెయ్య లేరు. కారణం, వారిమీద ఎటువంటి చర్య జరిగినా అది మా దేశంలోనే జరుగుతుంది. ప్రభు పారాయణత నిరూ పించుకున్న ఈ విశ్వాసపాత్రులమీద మాదేశంలో ఎటు వంటి చర్యా తీసుకోబడదని మీకు తెలిసిందే కదా?" అన్నాడు రాయబారి స్రామాన్.

తలూపాను, మౌనంగా!

—: ఐపోయింది :—

# సీరియల్



[పన్నెండవ భాగము]

హాలీవుడ్ మనుషులతో నిండిన ట్రక్కులు, పవర్ వాగన్, జీపులూ, ఆ అడివిలో ముందుకి భారంగా కదుల్తున్నాయి. ఉదయాన్నించీ పని చేసిన డ్రైవర్ అలసిపోటంవల్ల -కో-ప్రొడ్యూసర్ పాల్ మావ్ని రిక్వెస్ట్ చేసి మొదటి జీపుని నేనే డ్రైవ్ చేస్తున్నాను.

వెనకాల సీట్లో శాన్యోరా, డైరెక్టర్, నటి బార్బరా ఆశీనులై వున్నారు. ముందు సీట్లో నేనూ, నా ప్రక్కగా డ్రైవర్, పాల్ మావ్, గైడ్ జెరీ వున్నాం.

దృష్టిని డ్రైవింగ్ మీద లగ్నంచేసి చెట్లమధ్యనుంచి

జీపుని పోనిస్తున్నాను, ఆ అడవిలో చోటుచేసుకొని ముందుకి పోతుతున్న వెనకాల వాహనాల్ని అప్పుడప్పుడు 'రియర్ వ్యూ'లో చూస్తూ, కాలం బరువుగా దొర్లడం యిష్టంలేక, పాల్ మోవ్ తీయబోయే సన్నివేశాల కబుర్లు చెబుతున్నాడు. నేను డ్రైవింగ్ చేస్తూనే అప్పుడప్పుడు ప్రశ్నలు వేసి, సందేహాలు తీర్చుకుంటున్నాను. ఉన్నట్టుండి ట్రక్కుల వెనక భాగం నుండి "ధన్..." మని రైఫిల్ శబ్దం వినబడింది. అందరూ అదిరిపడ్డాం ఆ హఠాత్ శబ్దానికి.

ఎవరు పేల్చారు?

ఎందుకు పేల్చి వుంటారు?

"భయంకర్! స్టాప్ ది జీప్!" అరిచాడు పాల్ మోవ్.

సడన్ బ్రేకు కొట్టి యింజన్ ఆఫ్ చేసి చటుక్కున క్రిందకు దూకాను, కుడివేపు నుంచి.

నా వెనుకగా అందరూ దిగిపోయారు. అప్పటికి నా వెనకాల వాహనాలన్నీ ఆగివున్నాయి.

"వాట్ ది హిల్ హాపెండ్ దేర్?" అరచాడు పాల్ మోవ్ వెనకవున్న ట్రక్కులవేపు గబగబా అడుగులేస్తూ.

మేమందరం పాల్ మోవ్ ని అనుసరించాము. ఆఖరి ట్రక్కులోంచి కాకీదుస్తులు ధరించిన ఓ గార్డు చేతిలో రైఫిల్ తో పరిగెట్టుకుంటు మావైపువచ్చాడు. పాల్ మోవ్ వైపుతిరిగి "సార్! వెనకాతల ట్రక్కులో నేను కాపలా కాస్తున్నాను ఏ జంతువువల్లా అపాయం రాకుండా... కానీ..." ఒగుర్చుతూ ఆగిపోయాడు గార్డు.

"కానీ...! యూ బ్రూట్ ఏమయింది?" అర్చాడు పాల్ మోవ్.

"సార్!... వెనకాల చెట్లలోంచి హఠాత్తుగా రెండు బాణాలు, కదులుతున్న మా ట్రక్కులోకి దూసుకు వచ్చాయి. నా ప్రక్కగా నిలబడి మాట్లాడుతున్న యిద్దరు పోర్టర్ శస్త్రాల్ని గుండెల్లోకి దూసుకుపోయాయి... బాణాలు వేసిన వ్యక్తులెవరో కనపడలేదు. అయినా గుడ్డిగా చెట్లలోకి రైఫిల్ మాత్రం పేల్చాను. మనవాళ్ళ శరీరం రంగు మారిపోతోంది. విషపు బాణాలేమో" అన్నాడు వణికిపోతూ గార్డ్.

అందరూ అదిరపడ్డాం అతని చివరి మాటలకు.

"పాయిజన్డ్ యారోస్" గొణిగాడు పాల్ మావ్. "పద చూద్దాం వాళ్ళని."

అంతా అటువేపు పరిగెత్తాం.

విషయం తెల్సి, మిగతా ట్రక్కుల్లోని మనుషులు బిలబిలాదిగి మా వెంటబడ్డారు.

నేలమీదకు దింపబడ్డ రెండు శరీరాలచుట్టూ జనమంతా మూగారు.

పాల్ మావ్ ప్రక్కగా, చోటుచేసుకుని ఆ యిద్దరి దేహాలవేపు చూశాను.

అప్పటికే పోర్టర్ శస్త్రాల్నిద్దరూ మరణించారు!!

మృతదేహాలు రెండూ, నల్లగా కమిలిపోయివున్నాయి. బాణాలు సూటిగా గుండెల్లోకినాటుకున్నాయి. "బా... నూం...టో...స్!" నా వెనక నిలబడ్డ గైడ్ జైరీ సన్నగా గొణిగేడు.

"వాట్ బాసుంటోస్?" అన్నాను ఉలిక్కిపడి వెనక్కి తిరిగి.

శవాలను, మోకాళ్ళమీద కూర్చుని పరీక్షిస్తున్న

పాల్‌మావ్ కూడా ఆ మాటలకు వెనక్కి తిరిగేడు.

"మిస్టర్ పాల్‌మావ్! యిది బాసుంటోల పనే అయ్యుంటుంది. బాసుంటో అంటే యిక్కడ ఓ అడవి తెగ మనుషులు. వాళ్ళ ప్రాంతంలో యితరుల నెవ్వరిని కాలు పెట్టనివ్వరు. ప్రవేశించిన వారిని చంపిగాని వదలరు" అంటూ ఒక్క క్షణం ఆగి ఊపిరి పీల్చుకున్నాడు జైరీ.

అప్పుడే జనంలో అలజడి రేగింది. అంతా భయంగా గొణుక్కుంటున్నారు.

"సర్! బాసుంటో ఆటవికులు సాధారణంగా గుంపులు గుంపులుగా యుద్ధం చెయ్యరు. ఓపెన్‌గావున్న మైదానాల్లాంటి ప్రదేశాల్లో వీరు ఎదుర్కోరు. చెట్లచాటు వ్యవహారం వారిది. దొంగదెబ్బలకు వాళ్ళకు పెట్టింది పేరు. ఇది కేవలం మొదటి హెచ్చరిక సర్!

వాళ్ళగూడెం ప్రాంతాల్లో యితరులు మసలకూడదు. మన వాహనాలు స్పీడ్ ఎక్కించాలి. స్నేహశీలురయిన మనుషులుండే 'మాసయ్' గూడెం చేరుకునే వరకూ మనకు బాసుంటోలనుండి ప్రమాదం వెంటాడుతూనే వుంటుంది. రైఫిళ్ళ కాపలా రెట్టింపుచేయాలి- నైట్ కాంపుల్లోనూ, ట్రావిలింగ్ ట్రక్కుల్లోనూ" అంటూ ఆగాడు జెయిరీ.

"డామిట్! నువ్వు ఈ విషయాలు ముందు యెందుకు చెప్పలేదు?" తోకతొక్కిన తాచులా లేచాడు పాల్ మావ్.

"మిస్టర్ పాల్‌మావ్! నేను చెప్పి కొత్తగా చెయ్యగలిగేదేమీ లేదు. పైగా చెప్పడంవల్ల ముందుగానే మన

మనుషులందర్నీ భయపెట్టిన వాడ్నవుతాను.''

రెండు నిమిషాలపాటు ఆ ప్రదేశమంతటా చావు నిశ్శబ్దం అలుముకుంది.

చీఫ్ డాక్టర్, శవాల ప్రక్కగా మోకాళ్ళమీద కూర్చొని, గుండెల్నుంచి పెకలించబడిన బాణపు మొనల్ని భూతద్దంలో పరీక్షిస్తున్నాడు.

''మిస్టర్ పాల్ మావ్! నేను క్షేమంగా హాలీవుడ్ చేరతానో లేదో?...లక్షలాది నా అభిమానుల కోసం, సంపాదించిన మిలియన్ల డబ్బుకోసం నేను బ్రతకాలి... దయచేసి తగిన రక్షణతో నన్ను వెనక్కి పంపించండి... మనం బాసుంటో ప్రాంతంగుండా ప్రయాణించడం కోరి వితో తల గోక్కోవడమే...'' భయంగా ఘట్టిగా పలికింది బార్బరా. ఆమె సుందరమైన దేహం సన్నగా వణుకుతోంది.

''మిస్ బార్బరా! ప్లీజ్ కంట్రోల్ యువర్ సెల్ఫ్! బాసుంటోలు కేవలం నిన్నుమాత్రం హతమార్చరు! ఇంత మంది వున్నాం. ధైర్యం తెచ్చుకో'' అన్నాను ఏకవచనంలో, స్నేహపూర్వకంగా ఆమె భుజం తడుతూ.

పాల్ మావ్ స్థాణువులా నిలబడిపోయాడు.

అంతా భయంగా, విచిత్రంగా చూస్తున్నారు...

''నో మిస్టర్ భయంకర్! నాకయింకా జీవించాలని ఉంది'' అంది తల అడ్డంగా ఊపుతూ, బార్బరా వణికే కంఠంతో.

శాన్యోరాకు సైగ చేశాను.

ఆమె బార్బరా భుజంచుట్టూ చేతులువేసి అవతల్కి తీసుకెళ్ళింది.

పాల్ మాన్ ముఖం బిగుసుకుంది. అతని పెదవులు మెల్లిగా కదిలాయి. "ఆల్ రైట్ జంటిల్మెన్! యిక నా నిర్ణయం వినండి. బాసుంటోలకు ఏది యిష్టమో యేది అయిష్టమో నా కనవసరం! ఐ జస్ట్ డోన్ట్ కేర్ దట్ బాస్టర్డ్స్! మనం యిదే మార్గంగుండా ప్రయాణిస్తాం, యింకోటి వీలుగ లేదు కాబట్టి. మన ప్రొడ్యూసర్ కౌన్సిల్ కొన్ని లక్షలఖర్చుమీద ఈ భారీచిత్ర నిర్మాణం తల పెట్టింది. ఆ డబ్బు వృధా కావడానికి వీలులేదు. సాహసికంగా మనం జర్నీ కంటిన్యూ చేస్తాం" అన్నాడు దృఢంగా, కోటు జేబులోంచి సిగార్ పైపు బయటికితీసి ముట్టించుకుంటూ.

ఈసారి డైరెక్టర్ కలుగ జేసుకున్నాడు.

"మిస్టర్ పాల్ మాన్! మనతో ప్రయాణిస్తూన్న వివిధ టెక్నీషియనులకూ, అయిదుగురు స్త్రీలకూ, ఇంకా కెమెరా మనుషులకూ, పోర్టర్లకూ, అవుట్ డోర్ బాయ్స్‌కి... అందరి క్షేమానికీ, అందరి ప్రాణాలకీ మీరే బాధ్యులవుతారు. బాసుంటోల సహాయం లేకుండా వారి ప్రాంతంలోంచి మనం పయనించలేం."

"డామ్ యువర్ ఒపీనియన్ మెడియర్ డైరెక్టర్! పిరికిమందు నూరకు. సినిమాలు డైరెక్ట్ చేసేవాడవి, నిజ జీవితంలోగూడా గైడెన్స్‌యివ్వడం నేర్చుకో"అర్చాడు అసహనంగా పాల్ మాన్.

డైరెక్టర్ ముఖం మాడిపోయింది.

వాతావరణంలో టెన్షన్ పెరిగినట్లు గుర్తించాను.

"మిస్టర్ భయంకర్! ఈ విషయంలో నీ అభిప్రాయం ఏమిటి?" కోపం తగ్గించుకొని అడిగాడు పాల్ మాన్.

నవ్వుతూ, స్నేహపూర్వకంగా అతని భుజాలమీద చేతులు వేసాను.

"అయామ్ సారీ మిస్టర్ పాల్ మాన్! నేను దారిన పొయ్యే దానయ్యను. మీ స్వంత విషయాల్లో స్ట్రేంజర్ గా నేను జోక్యం కలుగజేసుకోవడం అసమంజసంగావుంటుంది నిర్ణయం తీసుకోవాల్సింది మీరు. అయితే ఒకటిమాత్రం చెప్పగలను. ప్రమాదాలు నాకూ, కాన్వాయ్ రాకు కొత్త కాదు. మీరు తిరిగి వెళ్ళిపోతానంటే ఐవిల్ సే ఓకే. సాహసించి ముందుకు పయనిస్తామంటే, మాకున్న కొద్ది తెలివి తేటలతో, మమ్మల్ని మేం రక్షించుకుంటూ, మిమ్మల్ని కాపాడ్డానికి శాయశక్తులా ప్రయత్నం చేస్తాం" అన్నాను దృఢంగా.

పాల్ మాన్ మౌనంగా తలపంకించాడు.

"నువ్వు చెప్పింది బావుంది మిస్టర్ భయంకర్! నాగరికత లేని ఆటవికులకు భయపడి, తోక ముడుచుకొని వెనక్కి పారిపోతే—అంత అవమానం మరొకటి లేదు. ఈ చిత్రానికి పెట్టుబడి పెట్టిన ప్రొడ్యూసర్లు మమ్మల్ని దుమ్మెత్తి పోస్తారు.

సినిమా జర్నలిస్టులు వేళాకోళంచేసి—'ది డేరింగ్ ఫిల్మ్ యూనిట్ హు రాన్ బాక్' అన్న హెడ్డింగ్ కింద మా ఫోటోలు ముద్రిస్తారు. ఈ బాడ్ ప్రాపగాండాతో మా యూనిట్ లోని మనుషులెవ్వరికీ భవిష్యత్ వుండదు తప్పదు...వుయ్ ఆర్ గోయింగ్ ఫార్వర్డ్" అన్నాడు తల ఊపుతూ పాల్ మాన్.

అంతలో టీమ్ డాక్టర్ శవాన్ని పరీక్షించి పైకి లేచాడు. 'టై'ముడి లూజ్ చేసుకుంటూ "మిస్టర్ పాల్

మావ్! విషం బాణపు మొనకులేదు. మొన వెనకాలి భాగానవుంది నల్లరంగులో" అన్నాడతను విచిత్రంగా చూస్తూ.

"ఎందుచేత?" అడిగేడు పాల్ మావ్.

"తెలియదు. విషం వివరాలుకూడా నాకు తెలియదు. లేకపోతే విరుగుడు గురించి ఆలోచించే వాడిని."

"మిస్టర్ పాల్ మావ్! విషం డైరెక్టుగా బాణపు మొనలకు ఎందుకు పూయబడలేదో నేనూహించ గలను" అన్నాను గొంతు సవరించుకుంటూ.

పాల్ మావ్ ఆత్రతగా చూసాడు. "ఎందుచేత?"

"జస్ట్ ఎ పాయింట్ ఆఫ్ కామన్ సెన్స్! అదిచాల భయంకరమైన పాయిజన్ అయుండాలి. ఆటవికులు సాధారణంగా బాణాల్ని వీపు వెనక ఓ కొయ్యగొట్టం అమర్చి పెట్టుకుంటారు. పాయిజన్ డైరెక్టుగా మొనకుపూస్తే, బయటకుతీసి ఉపయోగించేటప్పుడుగాని. అటూ యిటూ కదిలేటప్పుడుగానీ పొరపాటున ఆ బాణాల మొన యే వేలికో, వీపుకో, మరొకరి శరీరానికో గుచ్చుకుంటే— ప్రమాదం. అందుచేత పాయిజన్ యారో హెడ్ వెనకాల పూసి వుండొచ్చు" అంటూ ఆగాను.

గైడ్ జెయిరీ హఠాత్తుగా మాముందు కొచ్చేడు. జంటిల్మన్! భయంకర్ లాజిక్‌లో నిజం పూర్తిగావుంది. ఆ విషయంలో మీకు మరికొన్ని వివరాలు యివ్వగలనని అనుకుంటున్నాను. మా తాత ముత్తాతలనుండి అందరూ 'జంగిల్ గైడ్' వృత్తిలో పని చేశారు. అందువల్ల నేను మరికొన్ని విషయాలు మీకు చెప్పగలను.

ఆ బాణాలకి పూయబడిన విషాన్ని 'యారోకాన్

ఫిరా' అనే మొక్కల ఆకులనుండి తయారు చేస్తారు. వాటినుండి విషాన్ని చేయడానికి బాసుంటోజాతి మనుషులే ఎంతో భయపడతారు. కారణం ఆ'విధానం' అంత ప్రమాదకరమైనది కాబట్టి. ఎంతో శ్రద్ధతో, యెంతో మెలకువతో ఆ విషాన్ని తయారుచేస్తారు.

ముందు జాగ్రత్తగా బాసుంటోలు ఆ విషాన్ని గూడెంలో తయారు చేయకుండా—అడవిలో మంచిప్రదేశాన్ని వెతుక్కుంటారు. అక్కడ ఆ మొక్కల్ని వుడకబెట్టి—యిగురబెట్టి వాళ్ళ పద్ధతిలో విషాన్ని తయారుచేసి మెల్లిగా బాణాలకు పూస్తారు. మందుగుండు సామగ్రి తయారు చేసేటప్పుడు మనంయెంతో జాగ్రత్త వహిస్తాం అలాగే బాసుంటో తెగ-మనుషులు ప్రత్యేకంగా, విశేషమైన కాలాన్ని ఖర్చుపెట్టి ఆ విషాన్ని తయారుచేస్తారు.

ఆవిషం ఎంతటి భయంకరమైనదీ అంటే, ఏ చెట్టు ముల్లో తగిలి చర్మంకొంచెం గీసుకుపోతే, ఆ గీసుకుపోయిన ప్రాంతంమీద ఒక్కబొట్టు 'యాకో' విషం తగిలేచాలు అది రక్తంలోకి ప్రవేశించి—మాక్సిమమ్ మూడు నాలుగు నిమిషాలలో మరణిస్తాడు మనిషి.

అయితే బాణపు మొనలకు పూయబడిన 'యాకో'విషం తాజాదికాక వారం పదిరోజులయి ఉంటే ఆ యారో హెడ్ మీద దుమ్ముచేరే అవకాశముంది. ఇలాంటి సందర్భాలలో బాణం గుచ్చుకోనబడిన మనిషి పది, పదిహేను నిమిషాలదాకా బ్రతకడానికి అవకాశం వుంది. ఒకోసారి పూయబడిన విషం పదిహేను, ఇరవైరోజులు దాటివున్నప్పుడు—అది ఎండిపోయి విషప్రభావం నిర్వీర్యమౌతుంది ఇలాంటి పరిస్థితుల్లో మనిషి మరణించే ప్రమాదంలేదు'' అంటూ ఆగి, భారంగా ఊపిరి వదిలాడు గైడ్ జైరీ.

అప్పటిదాకా ఆసక్తిగావిన్న నేను "మిస్టర్ జెయిరీ అయితే దానికి విరుగుడు లేదంటావా?" అడిగాను.

అందరితో పాటు పాల్ మావ్, డాక్టర్ కూడా జెయిరీ జవాబుకోసం ఉత్సుకతతో చూడసాగారు. ఒకక్షణం మౌనం వహించి "ఉంది మిస్టర్ భయంకర్!" అన్నాడు గంభీరంగా జెయిరీ.

"అయితే అది అంత ఉపయోగ పడకపోవచ్చు. ఎందుకంటే బాణం నాటుకున్న మనిషికి కేవలం— మాక్సిమమ్ మూడు నిమిషాల్లోగా యింజెక్షన్ యివ్వాలి. అప్పుడు అతను బ్రతకొచ్చు"

"ఇంజెక్షన్ విత్ వాట్?" అన్నాడు డాక్టర్ కళ్ళ జోడుతీసి చేతిలో పట్టుకుంటూ.

"ఏమిటా మందు?" పాల్ మావ్ అడిగాడు.

"అమ్మోనియం కార్బొనేట్ కొన్ని కేసుల్లో ఉపయోగాన్నిచ్చింది. అయితే 'కోరమీన్' ఇంజక్టుచేస్తే మనిషి తప్పక బ్రతుకుతాడు. అసలు విషయం మరచిపోకూడదు. మూడునిమిషాల గడువులో... లేకపోతే అప్పటికే ఆలస్యమైపోతుంది" అన్నాడు జెయిరీ.

"డాక్టర్! కోరమీన్ వుందా మన దగ్గర?" అడిగాడు పాల్ మావ్.

ఆలోచిస్తూ నిలబడి పోయాడు డాక్టర్.

"జ్ఞాపకంలేదు మిస్టర్ పాల్ మావ్! కంగారుగా బయల్దేరాం మనం. ఎన్నో మెడిసన్స్ హడావుడిగా సర్దాను. వెళ్ళి వెదికివస్తాను. కోరమీన్ వుంటే మనం చాలవరకు అదృష్టవంతులమే" అంటూ ఎవరి జవాబుకోసం ఎదురుచూడకుండా ట్రక్కు వైపు పరిగెత్తాడు డాక్టర్.

డాక్టర్ అలా వెళ్ళగానే అడిగాడు గైడ్ ని "మిస్టర్ జెయిరీ! అసలు ఇతరుల్ని బాసుంటోజాతివాళ్ళు ఎందుకు తమ ప్రాంతంలో మసలనివ్వరు?"

జెయిరీ నవ్వాడు. "ఆలోచించండి మిస్టర్ భయంకర్! ఇదికూడా కామన్ సెన్స్ పాయింటే..."

తీవ్రంగా ఆలోచించ సాగాను...

పాల్ మాల్ కూడా నాకేసి చూస్తున్నాడు.

మెదడులో ఓ ఆలోచన తళుక్కుమంది.

"అర్థమైంది మిస్టర్ జెయిరీ? ఎవరో నాగరికులు లేదా నాగరికుడు ఎప్పుడో ఈ బాసుంటో మనుషులకు అన్యాయము లేదా అపకారం చేసివుంటాడు. అప్పట్నించీ బయటి మనుషులంటే పగ పేరుకుపోయి వుంటుంది వాళ్ళలో" అన్నాను ఉత్సాహంగా.

మరోసారి నవ్వాడు జెయిరీ. "యువార్ కరెక్ట్ ఫ్రెండ్! అలాగే చెప్పారు మా పూర్వీకులు."

"మరో విషయం. ఆ విషాన్ని కేవలం మనుషుల్ని చంపడానికే ఉపయోగిస్తారా?"

"కాదు. ఎక్కువగా జంతువులను చంపటానికి. చర్మాలు మొలలచుట్టూ ధరిస్తారు."

పరిగెత్తుకొచ్చాడు డాక్టర్ మా మధ్యకి—

"డాక్టర్! ఎస్-ఆర్-నో?" అనుమానంగా అడిగాడు పాల్ మాన్.

"ఎస్. మిస్టర్ పాల్ మాన్. కోరమీన్ వుంది మన దగ్గర"— ఒగుర్చుతూ పలికాడు డాక్టర్ నవ్వుముఖంతో.

అంతా స్వేచ్ఛగా నిట్టూర్పు విడిచాం.

పాల్ మాన్ కొంచెం వెనక్కి నడిచి, రెండు చేతులు

పైకెత్తి "లుక్ హియర్! ఎవ్విరిబడీ" అంటూ కేకలు పెట్టాడు.

జనం అంతా పాల్ మార్ష్ చెప్పబోయే విషయం వినడంకోసం తలెత్తి అతడ్ని చూడసాగారు.

"జంటిల్ మన్! మనం ముందుకు ప్రయాణం సాగించ బోతున్నాం! ప్రికాషనరీ మెజర్స్ ఉద్భృతం చేస్తు న్నాను. ఇప్పట్నించీ ప్రతి ట్రక్కుమీద యిద్దరు సాయుధ గార్డులని ఎరేంజ్ చేస్తున్నాను.

"కాంబాల్ట్!"

"ఎస్సార్" చెయ్యెత్తాడు ఒకడు జనంలోంచి.

"రాబిన్!"

"ఎస్సార్" మరొకడు చెయ్యెత్తాడు.

"మీరిద్దరూ దృఢంగా ఉంటారు. వెనకాల ట్రక్కు మీద కాపలా కాయాలి మీరు" అంటూ కొంతమంది పేర్లను పిలిచి, వివిధ వాహనాలమీద వాళ్ళను గార్డ్స్ క్రింద ఎరేంజ్ చేసాడు పాల్ మార్ష్.

"నా గార్డ్స్! నా మాటలు వినండి. మీరంతా అతి మెలకువతో జాగ్రత్తగా కాపలా కాయాలి. మీ కళ్ళె ప్పుడూ తెరిచివుండాలి. ఏదయినా అనుమానం అనిపిస్తే చూసిన మరుక్షణంలో కాదు, చూసిన 'క్షణం'లో కాల్చి పారేయండి. మీ జీతాలు ఇప్పట్నుంచీ రెట్టింపు చేస్తు న్నాను. కాయకష్టంలా మన మనుషులను రక్షిస్తూ, వారి ప్రశంసలందుకోండి.

పోతే రాత్రి వేళల్లో మనం మకాంకోసం గుడారాలు దింపవలసి ఉంటుంది. నైట్ క్యాంపుని కాపలా కాసే వ్యక్తుల్ని మీనుండే నేను ఎన్నుకుంటాను. ఒక్కో

రాత్రికి వందడాలర్లు ఎక్స్ట్రా పే చేయబడుతుంది. టీ, సిగరెట్స్ కావలసినన్ని సప్లయి చేయబడతాయి. ఎవ్వరూ రాత్రివేళల్లో మత్తుపదార్థాలు సేవించడానికి వీలులేదు. మీ డ్యూటీచార్టు మరో అరగంటలో తయారు చేసి ఇస్తాను. మన మనుష్లల్లో ఎవ్వరూ మిస్ కాకూడదు. ముందు జాగ్రత్తగా అందరికీ ఈ అడవిప్లాన్ ఒకొక్కటి కాపీ యివ్వబడుతుంది. యూమస్టబీ కేర్ ఫుల్! ఓ. కే?" మిలిటరీ ఆఫీసర్‌లా పొలికేక పెట్టాడు పాల్ మాన్.

"ఎస్సార్!" అన్నారు నిర్ణయించబడ్డ గార్డులంతా చేతులెత్తి.

* * *

సాయంత్రం ఐదు గంటలవుతుంది.

హాలీవుడ్ వాహనాలు ఆ అడవిలో ముందుకు కదులుతున్నాయి. మొదటి జీప్‌ని ఈసారి నేను డ్రైవ్ చేయడంలేదు. దానికి నియమించబడ్డ ప్రత్యేక వ్యక్తి జీపుని తోలుతున్నాడు. అటు, యిటు కనబడుతున్న చెట్లవేపు సూటిగా చూస్తున్నాను.

నా జేబులో పాల్ మాన్ యిచ్చిన పిస్తోలువుంది. జీపులో వాతావరణం భయంకరమైన ప్రశాంతతలోవుంది జీపు మైలశబ్దం, మా వాహనం వెనకాల కదులుతున్న ట్రక్కుల శబ్దంతప్ప మరేమీ వినిపించటంలేదు.

ఇప్పుడు ప్రయాణిస్తున్నది ప్రమాదకరమైన 'బాసుంటో' తెగ మనుషుల ప్రాంతంగుండా—అని జీపులో కూర్చున్న వారందరికి తెలుసు!

ఏ క్షణాన్నైనా ఆ అడవి మనుషులు దాడి చేయవచ్చు. ఆలోచనలతో సిగరెట్టు పై సిగరెట్టు కాలుస్తుండడం

వల్ల నోరు పాడైనట్లనిపించింది.

"మిస్టర్ పాల్ మావ్! వాటర్ కావాలి" అడిగాను చేదయిన నోటిని నాలుకతో తడుపుకుంటూ.

పాల్ మావ్ మౌనంగా కాలిదగ్గరనుండి ప్లాస్టిక్ వాటర్ బ్యాగ్ తీసి నా చేతికిచ్చారు. మూత తెరిచాను. ఆశ్చర్యం!

ఊదారంగులో వున్నాయి నీళ్ళు!

"మిస్టర్ పాల్ మావ్!" పిల్చాను అతనివై పుచూస్తూ.

అర్థమైంది అన్నట్లు తలవూపి నవ్వి చెప్పాడు పాల్ మావ్.

"అవి హాలివుడ్ నీళ్ళు. అడవిలో ఎక్కడ తిప్పలు పడాల్సి వస్తుందో అని ఒకటాంకరు మంచినీళ్ళు మోసు కొచ్చాం. నిలవ వుండటానికి పెర్మాంగనేట్ కలిపాం అందులో. కాస్త ఎక్కువ అయ్యుంటుంది. అదే ఆ రంగుకు కారణం. నాట్ డేంజరస్. తాగండి. కాని ఎక్కువగా తాగొద్దు. తక్కువ స్టాక్ ఉంది మనదగ్గర."

బాటిల్ ఎత్తిపెట్టి రెండుగుక్కలు తాగి మళ్ళీమూత బిగించాను.

"మిస్టర్ భయంకర్! ఏమిటి మీరు చేసిన పని?" అన్నారు కోపంగా పాల్ మావ్.

"ఏమిటి? ఎక్కువ త్రాగానా? సారీ!"

"అదికాదు. మీరు ఎత్తిపెట్టుకోని త్రాగారు."

"ఓహ్! ఎంగిలి"

"మిస్టర్ భయంకర్! అమెరికన్స్ కి, బ్రిటిషర్స్ కి ఎంగిలి ఉండదు. అలా చేయడం ఎదుటి వ్యక్తిని అవమానించి నట్టు—మాకు."

"ఐసీ...అయామ్ సారీ. మీరు చెప్పింది గుడ్ మానర్స్."

"అంతేకాదు. అమెరికన్లకి, ఇంగ్లీషు వాళ్ళకి మరో అలవాటుంది. హోటల్లోగాని, ఎక్కడైనా, వొకడు డబ్బిస్తే దాన్ని ఎదుటివ్యక్తి అక్కడే లెక్కపెట్టుకోకూడదు. అలా చేస్తే డబ్బు ఇచ్చిన వ్యక్తిని అవమానించి నట్లవుతుంది."

"మిస్టర్ పాల్‌మావ్! మీరు చాలా మంచి విషయాలు చెప్పారు. భారతీయులు ప్రాథమికంగా ఇంకా ఎంతో నేర్చుకోవాలి" అన్నాను సిగ్గుపడుతూ.

పాల్‌మావ్ ఇంకా ఏదో అనబోతుండగా గైడ్ జెయిరీ మధ్యలో కలగజేసుకున్నాడు, "సర్! మీరు వాటర్ స్టాక్ ఎంతో లేదన్నారుకదూ!"

పాల్‌మావ్ అతనికేసి తిరిగి నవ్వాడు.

"ఏం, నీకు దాహంగా ఉందా యిప్పుడు?"

జెయిరీ నవ్వలేదు. "అదికాదు. మీకు కావలసినంత నీరు సప్లయిచేస్తాను" అన్నాడు జీప్ అద్దంలోంచి బయటకిచూస్తూ..

"అఫ్‌కోర్స్! కావాలి. కాని ఎక్కణ్నించి?" అడిగాడు వింతగా చూస్తూ పాల్‌మావ్.

"ఎదురుగా చూడండి ముందువున్న నదివైపు" అన్నాడు జెయిరీ చూపుడువేలితో అద్దంలోంచి ముందుకు చూపిస్తూ. పాల్‌మావ్, నేను అద్దంగుండా బయటికి పరీక్షగా చూసాం.

"యూ డామ్‌ఫూల్! నదిలాంటి దేమీ లేదే ఎదుటగా" అన్నాడు పాల్‌మావ్ కోపంగా.

“పొడుగునా ఇక్కణ్నించి రాతి నేల పరచుకొని ఉంది” అన్నాను ఇంకేం చెప్పాలో తెలియక.

“ఆ విషయం అలావుంచండి. మీరు నదిమీద ఎప్పుడయినా నడిచారా?” అడిగేడు నవ్వుతూ జెయిరీ.

“మిస్టర్ భయంకర్! మీరేమీ అనుకోకండి. బాసుంటోలు మనవాళ్ళిద్దర్నీ ఘోరంగా చంపారు. అప్పట్నించీ ఈ పిచ్చివాగుడు.” అన్నాడు పాల్ మోవ్ వ్యంగ్యంగా.

“డియర్ ప్రొఫెస్సర్! మనకు కావలసినది స్వచ్ఛమైన నీరు దొరుకుతుంది ఆనదిలోంచి. ట్యూబ్ సాయంతో టాంకర్ నిండా నింపుదాం” అన్నాడు జెయిరీ.

పాల్ మోవ్, నేనూ నిజంగా పిచ్చివాణ్ని చూసినట్టు జెయిరీని చూడసాగాం.

వెనకసీట్లోని కాన్యోరా, బార్బరా సుసాన్ జెయిరీ వంక పజిల్డ్ గా చూస్తున్నారు.

“జీప్ ఆపండి” అన్నాడు జెయిరీ.

డ్రయివర్ పాల్ మోవ్ వంక చూసాడు.

“స్టాప్” అన్నాడు పాల్ మోవ్.

రాతి నేలమీద జీప్ ఆగివుంది. రెండుసార్లు హారన్ కొట్టాడు డ్రయివర్. ఆ కోడ్ అర్థమై వెనక ట్రక్కులు ఆగాయి.

అంతా జీపు దిగాం.

“భయంకర్, మీవద్ద పిస్తోలు యిలా యివ్వండి” అన్నాడు జెయిరీ.

అతనివంక విచిత్రంగా చూస్తూ యాంత్రికంగా కోటు జేబులోంచి పిస్తోలుతీసి, అతనిచేతిలో పెట్టాను.

నేలమీద గొంతుకూర్చుని జెయిరీ—పిస్తోలుతో ఆ

రాతి నేలమీద టపటపా తాటించసాగాడు. ఓచోట నేల బోలు శబ్దం వచ్చినట్లయింది. అక్కడ పిస్తోలు మడమతో గట్టిగా కొట్టాడు. ప్లాస్టిక్ లా టప్పున చిటికింది రాయి. రాతిక్రింద ఏదో ప్రవహిస్తున్నట్లు శబ్దం అవుతోంది. మెల్లిగా నాకు విషయం అర్థం కాసాగింది.

జైరీ రాతి నేలమీద కొంత సేపటికి పెద్ద కన్నం ఏర్పరచాడు. అంతే! అందులోంచి సర్రున షాంపెన్ లా నీళ్ళు దూసుకొచ్చాయి పైకి.

పాల్ మావ్ కళ్ళు మెరిసాయి.

“మిస్టర్ జైరీ! రాతిలో కప్ప గురించి విన్నానుగాని, రాతిలోనుంచి నీళ్ళు రావడం, సంగతి వినడం, చూడ్డం ఇదే మొదటిసారి.”

“మిస్టర్ జైరీ! రాతి నేల క్రింద నది ప్రవహించడం ఎలా సాధ్యం అయింది?” అడిగింది—అప్పుడే ప్రక్కగా వచ్చిన శాన్యోరా!

“సిస్టర్! నిజమైన నేలకాదు. ఎప్పుడో లావా ప్రవహించింది ఈ నదిమీద. తరువాత లావా గట్టిపడి రాతి నేలగా ఏర్పడింది పై భాగం. ఇలాంటివాటిని ‘జిమా స్ప్రింగ్’ అంటారు. ఇదిగో నీరు చూడండి. గాజులా తెల్లగా స్వచ్ఛంగా ఉంటుంది. అందుకే అన్నాను మన మిప్పుడు నదిమీద నిలబడ్డామని” చెప్పాడు జైరీ—జైల్లోంచి విడివడినట్లు స్వేచ్ఛగా వేగంగా పైకి తన్నుకొస్తున్న నీటిని చూపుతూ.

“ఇటీజ్ జస్ట్ మార్వెలెస్!” అంది నటి—బార్బరా భుజాలెగుర వేస్తూ.

ఏదో అనబోతూ త్రుళ్ళపడ్డాను.

తటాలున మా కడ్డంగావున్న శాన్యోరానీ సూసాన్ నీ ప్రక్కకి త్రోయడం, జెరీ చేతిలోని పిస్తోలు చటుక్కున లాక్కోవడం, రెండు బాణాలు రివ్వున నాకటూ ఇటూ దూసుకుపోవడం... అంతా క్షణంలో జరిగిపోయింది!

అవి ఆ స్త్రీలకిద్దరికీ వెన్నులో గుచ్చుకోవలసిన విషపు బాణాలు.

"ఎవ్విరీబడీ గెట్ ఇన్ టు జీప్!" అర్చాను పిచ్చి వాడిలా అందరినీ వెనక్కి తోస్తూ.

విషయం అర్థమై — కేకలు పెడుతూ జీప్ లోకి దూకా రంతా. అప్పటికే చీకటి ఎక్కువ అవుతోంది.

పిస్తోలు ఉన్న చెయ్యి చాచి, చెట్లువైపు చూసాను. అప్పుడే చెట్ల ఆకుల మధ్యనుంచి నాలుగు కళ్ళు తప్పుకో వడం గమనించాను. ఆలస్యం చేయలేదు నేను. టప టపా కాల్చాను పిస్తోలు ఆవైపు. కెవ్వున ఆక్రందన వినపడింది. రివ్వున అటువైపు పరిగెత్తాను.

ఒకడు నేలమీద బోర్లాపడి కొట్టుకొంటున్నాడు! ఆఖరి క్షణంలో......మరొకడు తూనీగలా పరిగెడు తూండడం నా కంట పడింది.

"అతన్ని వదలకూడదు!"

పరుగెడుతున్న ఆ ఆటవికుని వెంట పిచ్చికుక్కలా పరుగెట్టసాగాను.

వెనకాలనుంచి "భయంకర్! వెనక్కి వచ్చేయ్! కమ్ బాక్!" అన్న పాల్ మావ్ పిలుపులు పట్టించు కోవడం లేదు నేను.

లేడిలా చెంగు చెంగున దూకుతున్నాడు, ముందు పరు గెడుతున్న ఆటవికుడు.

పిస్తోలు పేల్చాను మరోసారి పరుగెడుతూనే. అతని పాదానికి తగిలింది.

కుంటసాగాడతను.

అయితే కుడివైపు చటుక్కున తిరిగి మాయమయి పోయాడు.

ఒగురుస్తూ ఆ వైపు తిరిగాను.

అతను మలుపు తిరిగినవైపు అటూ, ఇటూ చూసాను.

ఎక్కడా కనపడలేదు ఆ ఆటవికుడు.

ఎక్కడికి మాయం అయిపోయాడు ఈ అరనిముషం టైములో?

చెవులు రిక్కించాను. ఎవరైనా పరిగెడితే ఖచ్చితంగా నలుగుతున్న ఆకుల చప్పుడవుతుంది. ఎక్కడా చీమ చిటుక్కుమన్న శబ్దం కూడా వినపడ్డంలేదు.

'హౌ కేన్ ఇట్ పాసిబుల్?'

అంతలో ఓ ఆలోచన తళుక్కున మెరిసింది నా మస్తిష్కంలో.

య్యాస్...అతని పాదానికి నా పిస్తోలు తూటా తగిలింది. గాయంలోంచి రక్తం...?

నేలను పరీక్షించసాగాను...

రక్తపు చుక్కలు......వరుసగా కనబడ్డాయి. వాటి వెంటే నడుచుకుంటూ వెళ్ళాను.

ఆటవికుడు ఏ చెట్టు చాటునో నన్ను దెబ్బతీయడానికి—పొంచుకొని ఉన్నాడా?

పిస్తోలు ట్రిగ్గర్ గార్డులో—వేలు గట్టిగా బిగించి పిల్లిలా అడుగులు ముందుకు వేయసాగాను.

రక్తపు చుక్కలు నన్ను గుబురుగా వున్న ఓ పొద దగ్గరకు తీసుకు వెళ్ళసాగాయి......

పొదదాకా వచ్చి ఆగిపోయాయి రక్తపు చుక్కలు...!?

పొదను పరీక్షించసాగాను—పిస్తోలు జాగ్రత్తగా పట్టుకొని.

బ్రహ్మాండమైన వెడల్పుగల చెట్టు మొదట్లో అల్లుకుని వుంది ఆ పొద...

యిరవై అడుగులు వుంటుంది ఆ చెట్టు చుట్టుకొలత. అయితే—పొట్టిగా ఉంది.

దాని వయసు కొన్నివేల సంవత్సరాలు ఉంటుందని పించింది చూడగానే—

చెట్టు మొదట్లో రక్తం—మడుగు కట్టింది...

చెట్టుమీద రక్తపు మరకలు పైకి వెళ్ళుతూ కనబడ్డాయి.

అంటే?—

గాయపడిన ఆటవికుడు—ఆ చెట్టుమీదికి ఎక్కి ఉంటాడు. అతి జాగ్రత్తగా దృష్టిని పైకి సారించాను.

ఎక్కడా ఆకుల చప్పుడు కూడా అవటంలేదు. ఇంతలో యెలా మాయమయ్యాడు?

నా గుండె—శబ్దం నాకే వినబడుతోంది.

అంతలో...

వెనుక ఎవరో కదిలిన చప్పుడయ్యింది.

గిరుక్కున వెనక్కి తిరిగాను.

ఆటవికుడు కాదు!

కాన్స్యరా!

చేతిలోని పిస్తోలుతో—ఒగురుస్తూ నిలబడిందామె.

బరువుగా ఊపిరి వదిలాను.

ఏదో చెప్పబోయింది శాన్యోరా.

నోటిమీద వ్రేలేసి మాట్లాడ వద్దన్నట్లు సైగ చేశాను.

ఆమెను మెల్లిగా దగ్గరకు పిల్చాను. పసిపిల్లలా శాన్యోరా దగ్గరకు వచ్చింది. ఆమె చెవిలో ఏదో చెప్పాను.

తల వూపిందామె.

ఆ వృక్షం—అతి పొట్టిగా వున్నా వెడల్పాటిది కావడంతో చేతుల్తో పట్టుకుని ఎక్కడం అసాధ్యం.

అరచేతులు సాచాను.

మెట్టులా, దానిమీద, శాన్యోరా కుడిపాదం మోపి చిన్న జర్కుతో పైకి ఎగిరి, అరచేతులమీంచి నా భుజం మీద నిలబడింది.

తల పైకెత్తాను. మెల్లిగా ఓ కొమ్మ నందుకొంది చేతుల్తో. అన్నివైపులా పరీక్షించసాగిందామె కొద్దిసేపు.

రెండు భుజాలమీద రెండుకాళ్ళు వేసి నిలబడ్డంవల్ల అంతకుమించి శాన్యోరా ఏం చేస్తోందో నాకు కనబడ లేదు.

పిక్కలదాకా ఉన్న గౌను—అడ్డం అయింది.

ఉన్నట్టుండి నా భుజాలమీద నిలబడ్డ శాన్యోరా లేత పాదాలు వణికాయ్.

"శాన్యోరా ఏమయిందిః?" అడిగాను ఉండబట్టలేక.

"భయంకర్! కదలక, గట్టిగా పట్టుకో" అని మాత్రం చెప్పింది.

ఆమె మాటలతో సమానంగా "ఢన్...ఢన్... ఢన్..."మంటూ పిస్తోలు ఆరుసార్లు భయంకరంగా పేలింది.

ఏమయింది?

ఎవర్ని కాలుస్తోంది?

బుర్ర పిచ్చెక్కుతోంది.

"భయంకర్! క్విక్! నీ పిస్తోలు యిటు యియ్యి!" అర్చిందామె మొదటి పిస్తోలును నేలమీదకు విసిరేస్తూ.

పిస్తోలు ఉన్న చెయ్యి గుడ్డిగా పైకెత్తాను.

ధన్...ధన్...ధన్...ధన్...ధన్...

మరో ఐదుసార్లు భయంకరంగా ప్రేలింది రెండో పిస్తోలు.

"భయంకర్! యిక దింపు!" అందామె అలసటగా, ఒగుర్చుతూ.

చేతులు పైకెత్తి శాన్వోరా నడుం పట్టుకుని, క్రిందకు దింపాను.

అప్పుడు చూశాను...!!

ఆమె కుడిచేతిలో గుచ్చుకొని వ్రేలాడుతున్న ఓ విషపు బాణాన్ని.

నా గుండె ఒక్కక్షణం కొట్టుకోవడం మానేసింది.

"శాన్వోరా! ఏమయింది?" గాభరాతో ఏదో అనబోయా...

"తర్వాత చెప్తాను. ముందు ఈ బాణం లాగెయ్. భయంకర్!" అందామె హఠాత్తుగా తోటకూరకాడలా వెనక్కి వ్రాలిపోతూ.

"సారీ! ఇడియట్‌లా ప్రశ్నించాను. కళ్ళు మూసుకో!"

ఆమె కెవ్వున అరుస్తుండగా చటుక్కున బాణాన్ని ఆమె ముంజేతినుండి పెకలించాను.

(సశేషం)

# ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్ట చివరిబొమ్మ) పరిశీలించండి. రెండు ముఖ చిత్రాలకు సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలోగాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి ఈ నెల 10వ తేదీ లోపు మాకు చేరే టట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబరుకూడా వ్రాయాలి. సభ్యులు కాని వారు తమ వ్యాఖ్యలతో 30 పై.లు స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 20లు నగదు బహుమతి పంపుతాము. ఫలితాలు వచ్చే నెల మాసపత్రికలో చూడండి.

## మీరే ఎన్నుకోండి?

ఈ నెల ప్రచురింపబడిన నవలలు, కథలు, హాస్య రచనలలో ఏది ఉత్తమమైనవో, మాసపత్రికలో ప్రచు రించబడిన బ్యాలెట్ పత్రంలో వ్రాసి పంపండి.

ఉత్తమ నవలకు రు. 200/-లు, ఉత్తమ కథకు రు. 100/-లు, ఉత్తమ జోక్‌కు రు. 20/- బహుమతి ఇవ్వబడుతుంది. ఇలాగే యీ మూడు ఉత్తమ రచనలను సరిగ్గా ఎన్నిక చేసిన పాఠకులకు ఒక్కొక్కరికి రు. 10-/లు బహుమతి వుంటుంది.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యత్వము తీసుకుంటే, మీకు కాపీలు గ్యారంటీగా చేరుతాయి. పైగా పత్రిక ఖరీ దులో కొంత తగ్గింపు లభిస్తుంది. సభ్యత్వము కోసం మీరు రు. 5/-లు పంపండి. మీకు ప్రతినెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 5/-లకే వి.పి. ద్వారా పంపబడతాయి.

# "దొంగ!"

దెబ్బల బారినుండి ఎట్టాగో తప్పించుకుని ఆ ఊరినుండి పారిపోతున్నాడొక దొంగ.

దురదృష్టవశాత్తు ఆ దొంగకొక వ్యక్తి ఎదురయ్యాడు.

దొంగ ఆ వ్యక్తిని చూపి తప్పుకునే మార్గం కానరాక కలవరపడ్డాడు. వెంటనే ఒక ఆలోచన వచ్చింది.

"అయ్యో! నారాయణ క్రొత్తవారిని చితక బాదు తున్నార్రో ఈ ఊరి ప్రజలు!" అంటూ కేకపెడుతూ దగ్గరగా ఉన్న గుట్టల దిక్కు పరుగెట్టసాగాడు.

క్రొత్త వ్యక్తి బిత్తరపోయి తనకు ఎదురుగా కర్రలతో వస్తున్న ఊరివారిని చూచి, దొంగ మాటలు నిజమేనని వెనుదిరిగి పరుగెట్టడం మొదలెట్టాడు.

ఊరివారంతా "అదిగో, దొంగ" అంటూ క్రొత్త వ్యక్తిని పట్టి చితకబాది, పోలీస్టేషన్‌కి తీసికెళ్లారు.

—సుధశ్రీ, రత్నాపూరు.

# చిక్కు ప్రశ్న?

రామారావు జేబులో ఉన్న డబ్బు అయిపోయేవరకు సారాయి త్రాగాడు. ఇంకా త్రాగాలనే ఉంది. కాని జేబులో డబ్బులు లేవు. సారాయి దుకాణం వాడు అప్పు పెట్ట నన్నాడు. చేసేదిలేక దుకాణం బయటకు వచ్చేశాడు.

రోడ్డుమీద నడుస్తూ తల త్రిప్పి చూశాడు. "డిటెక్టివ్ ప్రసాదు" అని గోడమీద ఉన్న బోర్డును చూడగానే మెరుపులాంటి ఆలోచన వచ్చింది. వెంటనే గేటు తెరుచుకొని లోపలికి వెళ్ళాడు.

డిటెక్టివ్ ప్రసాదు గదిలో కూర్చుని పుస్తకం చదువుతున్నాడు. అంతలో 'నమస్కారం' అన్న పిలుపుతో పుస్తకం మూశాడు.

"నమస్కారం, రండి కూర్చోండి" అన్నాడు ప్రసాదు. రామారావు వచ్చి ప్రసాదుకు ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చున్నాడు.

"మీ పేరు?" అన్నాడు ప్రసాదు.

"రామారావు. నేను వచ్చిన పని ఏమిటో చెబుతాను. మీకు ఒక్క ఆధారం దొరికితే చాలు హంతకుని పట్టుకుంటారు కదా. నేను ఒకటి అడుగుతాను. దానికి జవాబు చెప్పండి మీరు దానికి జవాబు చెప్పలేకపోతే మీరు నాకు పదిరూపాయిలు యివ్వాలి. మీరు చెప్పగలిగితే పేదవాణ్ని గనుక అయిదు రూపాయిలు యిచ్చుకుంటాను. మీకు సమ్మతమయితేనే చెప్పండి." అన్నాడు రామారావు.

ప్రసాదు కొంచెంసేపు ఆలోచించి "సరే, నాకు సమ్మతమే" అన్నాడు.

"జాగ్రత్తగా వినండి" అంటూ ప్రారంభించాడు.

"ఇద్దరు భార్యాభర్తలు ఉన్నారు. భార్య అందగత్తె అని చెప్పవచ్చు. భర్త గుడ్డివాడు, మూగవాడు, భర్త గుడ్డితనము ఆసరాగా తీసుకొని భార్య వేరొకనితో సరసాలాడుతూ ఉంది. అలా చాల రోజులనుంచి జరుగుతుంది. ఇది గుడ్డివాడి స్నేహితుడు కనిపెట్టాడు. ఇతను మూగ

వాడు. అసలు విషయం గుడ్డివాడితో చెబుదామని ప్రయత్నించాడు. కాని లాభం లేకపోయింది. ఆమె విషయం ఆ మూగవాడే స్వయంగా గుడ్డివాడికి తెలియజేయాలి. అది ఎలా?" అని చెప్పి ముగించాడు రామారావు.

ప్రసాదు ఆలోచిస్తున్నాడు. మూగవాడు నోటితో చెప్ప లేడు. మూగవాడే స్వయంగా గుడ్డివాడికి తెలియజేయాలి. సైగలతో చెబుదామంటే ఎదుటివాడు గుడ్డివాడు. ఎలా చెప్పగలడో అర్థంకాలేదు. రామారావు మంచి చిక్కులోనే త్రోశాడు అనుకున్నాడు.

చాలసేపు ఆలోచించినమీదట "నాకు తెలియదు. నీవే చెప్పు." అన్నాడు ప్రసాదు.

"ముందు పది రూపాయిలు యివ్వండి" అన్నాడు.

ప్రసాదు పది రూపాయిల నోటు తీసి రామారావుకు యిచ్చాడు.

"పదికి చిల్లర యివ్వండి," అన్నాడు రామారావు. పది రూపాయిల నోటు తీసుకొని రెండు అయిదులు ఇచ్చాడు.

రామారావు ఒక అయిదు రూపాయిల నోటు ప్రసాదు చేతిలో ఉంచాడు.

"ఏమిటిది?" అన్నాడు.

"నేను చెప్పినదానికి సమాధానం నాకుకూడ తెలియదు. నేను చెప్పలేకపోయాను కాబట్టి, న్యాయం ప్రకారం అయిదు యిచ్చి వెళుతున్నాను," అనిచెప్పి, ఐదు నోటుతో మళ్ళీ సారాయి దుకాణంవైపు దారితీశాడు రామారావు.

—సి. కె. నాయుడు. గుంటూరు-4.

## విదేశ ప్రయాణం?

"నీ భర్త స్టేట్స్‌కి పోయాడట నిజమేనా?"

"నిజమే! శ్వాసక్రియకి ఆటంకం ఏర్పడటం వలన వెళ్లారు."

"అంటే ఊపిరితిత్తులకి సంబంధించిన జబ్బా?"

"జబ్బుకాదు. ఇక్కడ అప్పులవాళ్ళు ఆయన్ని సరిగా ఊపిరి పీల్చుకోనివ్వలేదు."

—సి. విశ్వనాథరెడ్డి, పానగల్.

## అందరూ అలాగే అంటారు?

లింగరాజు ఆఫీసుకి వస్తూనే తన పెర్సనల్ సెక్రటరీ ఉమని పిలిచి, "ఈరోజు నాకుచాలా పనుంది. ఎటువంటి ఫోన్‌కాల్స్ నాకు రావటానికి వీల్లేదు. ఏదయినా అర్జంటుగా మాట్లాడాలని చెప్పినా 'అందరూ అలాగే అంటారు' ఈరోజు కుదరదు అనిచెప్పు—" అన్నాడు కఠినంగా.

మధ్యాహ్నం టెలిఫోన్ మోగగానే ఉమ రిసీవర్ అందుకుంది. "ఇప్పుడు ఆయనతో మాట్లాడటం కుదరదు"అని చెప్పింది.

"నేను ఆయన భార్యను"—అంది ఫోన్ చేసినావిడ.

"అందరూ అలాగే అంటారు. ఈరోజు కుదరదు" అనిచెప్పి రిసీవర్ పెట్టేసింది, లింగరాజు పెర్సనల్ సెక్రటరీ ఉమ.

—వి. యస్. తెన్నేటి, సికింద్రాబాదు.



